# పవిత్రప్రేమ

కేతవరపు రామకృష్ణశాస్త్రి





దర్శ గ్రంథమండలి, వి

5

# పవిత్రప్రేమ

ఆమెపేరు మాధురి. కొంతమంది ముద్దుకోసం "మధూ!" అని పిలుస్తుంటారు. ప్రేమతో మరికొంతమంది "మధురం!" అని పిలుస్తూంటారు. ఆమె వయస్సుకు పన్నెండు లేక పదమూడుసంవత్సరాల వయస్సుగల బాలిక. ఇప్పుడిప్పుడే ఆ బాలిక దేహంలోంచి కొత్తగా ప్రవేశించ బోతూన్న యౌవనపుతళుకులు తొంగిచూస్తున్నాయి. అయినప్పటికి ఇంకా చిన్నతనపులక్షణాలు, ఆ చిలిపితనం వెన్నాడుతూనే ఉన్నాయి. కేవలం సరళహృదయంగల ఒక అమాయకపుబాలిక. ఆమె శైశవావస్థ ఎట్లాగడిచిందో ఆమెకేమీ తెలియదు. తన అయిదవఏట తల్లిదండ్రుల ద్వారా ఆ బాలిక, కులగౌరవాలకు దూరమైన పరువు ప్రతిష్ఠలు శూన్యమైన సంఘంలో ప్రవేశపెట్టబడింది. తన భవిష్యత్తుఅంతా ఒక పాశవికవృత్తిలో (నీచవ్యాపారము) గడుస్తుందనీ, తానొక ఆటబొమ్మగా ఉండవలసివస్తుందనీ ఆ బాలిక ఎట్లా ఊహించగలుగుతుంది? ఆమెలాలనపాలనము లకు సంబంధించిన భారమంతా ఒక యౌవనమంతాగతిం చిన మధ్యవయస్సులోనున్న స్త్రీ నిర్వహిస్తోంది. మాధురి ఆమెను అమ్మా! అని పిలుస్తూంటుంది. ఆహా! "అమ్మా!" ఎంత పవిత్రమైన సంబోధన! ఆ మధురమైన పిలుపుకు ఆ కాంత యోగ్యురాలు కాదన్నసంగతి లోకజ్ఞానములేని ఆ

ముద్దుబాల కేమి తెలుసును! దైవవంచనవల్ల కన్నతల్లిదండ్రుల నిర్దాక్షిణ్యమే కారణముగా ఆ బాలికారత్న మా వనితచేతికి జిక్కింది. ఎప్పుడు యుక్తవయస్సు వస్తుందా! ఎన్నడు విట సమూహాలచేత ఆమె యౌవనసౌరభాన్ని ఆఘ్రాణింపఁజేసి ధనమును మూటగట్టుకొందామా అని ఆ దుర్మార్గురాలు ఎదురుచూస్తూ దినాలు లెక్కపెట్తోంది. తన రక్షకురాలే ఒకనాటికి తనకు భక్షకురాలౌతుందన్న సంగతి దురదృష్ట వంతురాలైన యీ బాలికమనస్సుకు తోచలేదు.

నానాటికి మాధురి యౌవనకుసుమం వికసించి పరిమళాన్ని వెదజల్లుతూంది. రసికశేఖరుల చూపులు సదా ఆమె మీందనే నిలిచిపోతున్నాయి. కాని మాధురి కీగొడవ ఏమీ తెలియదు. మామూలుగా నవ్వుతూ ఆటపాటలతో కాలము గడుపుతోంది. ఆమె దట్టమైన, మృదువైన నిడుదపెన్నెరివేణి పిఱుదులుదాటి చూచేవారి హృదయాలను ఆకర్షిస్తోంది. తుమ్మెదల బారువలెఉన్న ఆమె ముంగురులు ముఖపద్మానికి రెట్టించినఅందాన్ని ప్రసాదిస్తున్నాయి.

మాధురికి నగలంటే అయిష్టం. సామాన్యమైన, పరిశుభ్రమైన చీర, ఆ చీరకుతగిన జాకెట్టు - ఇంతే ఆమె వేషం. చెవులకు బంగారపు కర్ణాభరణాలు (Ear Rings) వ్రేలాడుతూంటాయి. ముంజేతులకు బంగారుగాజులజత. ఇంతకన్న వేరు నగలుకాని, విలువగల చీరలుగాని ఆమెకు లేవు. అయినప్పటికీ ఆ సాధారణమైన దుస్తులతోనే మాధురి ఎంతో అందంగా కనబడుతుంది. దేవుడిచ్చిన సహజసౌంద ర్యానికన్న ఈ తెచ్చుకొనే అందచందాలు ఎక్కువకావు.

అమాయకంగా, స్వేచ్ఛగా, నిర్లక్ష్యంగా తిరిగే మాధురికి తన శరీరంమీద వికసితమౌతూన్న యౌవనప్రభావంయొక్క విలువ తెలియటంలేదు.

మాధురిని అమ్మ (పాలకజనని) ఎంతో ప్రేమతో శ్రద్ధగా పెంచుతోంది. స్వార్థమును సాధించాలనే ఊహతో ఉన్న ఆమెహృదయములో ఎన్నోకోరికలు, కాముకభావాలు ఇమిడిఉన్నాయి. ఈ ఎనిమిదితొమ్మిది సంవత్సరాలనుండి మాధురిని పెంచుతూ ఆమె ఎన్నిఆలోచనలు చేస్తోందో, ఎన్నిఊహాసౌధాలు నిర్మిస్తోందో, ఎన్నికోర్కెలతో రంగు రంగులచిత్రాలను హృదయపటంమీద చిత్రించుకొం టోందో ఎవరుచెప్పగలరు? కాని పరిశుద్ధహృదయంగల మాధురి కల్ల, కపటం అంటే ఏమోఎఱుగదు. మాయ, మర్మం ఏమీ తెలియదు. కేవలం స్వచ్ఛమైన మనస్సు. చదువు వ్రాతలో చాలా చాకచక్యంతో తెలివితేటలు కలిగిఉంటుంది. పరమేశ్వరుడామెకు శ్రావ్యమైన కంఠ స్వరాన్ని ప్రసాదించాడు. ఏదైనా పాటపాడితే పక్కనున్న వారంతా చేతులోఉన్న పనులుకూడ మానేసి వినడానికి వస్తారు. సౌందర్యానికితోడు మధురమైన కంఠస్వరంకూడా ఉండడంచేత బంగారానికి పరిమళం అబ్బినట్లుంది. అమ్మ ఉద్దేశ్యం ఏమిటి?......భవిష్యత్తులో మాధురి తనఇంటిని ధనరాసులతో వెండిబంగారాలతో నింపుతుందని అనుకొం టోంది.

తర్వాత రెండుసంవత్సరాలు గడిచినాయి. స్థితిగతులు మారిపోయినాయి. మాధురియొక్క మధురగానం జన

సమూహాన్ని ఆకర్షిస్తోంది. గౌరవనీయవ్యక్తులు కొంతమంది ఆమెపాటను వినడానికి ఎదురుచూస్తున్నారు. ఇరుగుపొరుగు తరుణీమణులకు ఇది చాలా మనోవేదనకు కారణంకావడం చేత మనస్సులు పట్టలేక చాటుచాటున ఆవేశంతో అమ్మ మీద ఎత్తిపొడుపుమాటలు, నిందావాక్యాలు వర్షంకురి పిస్తున్నారు. కాని అమ్మ ఈమాటలను లక్ష్యంచెయ్యలేదు. ఆమె ఈ నిందావాక్యాలను మహానందంతో గ్రహిస్తూ గొప్పనిధి లభించినంత సంతోషాన్ని అనుభవిస్తోంది. తనకు రాబోయే మహావైభవాన్ని తలచుకొని అందరూ దుఃఖ పడాలని ఆమెతలంపు. తనగానంలోంచి బయలుదేరేది అమృతమో, విషమో మాధురి ఊహించుకోలేకుండా ఉంది. దానివలన తనకు లభించేది సుఖమా లేక దుఃఖమా, ఆనందమో లేక విషాదమో తెలుసుకోలేకుండాఉంది. సంగీతంమీద ఆమెకు సహజమైన అనురాగం, అభిలాష ఉంది. అందుచేత మాధురి సమయాసమయ విచక్షణలేకుండా ఎప్పుడూ ఉత్సాహంతో పాడుతూనే వుంటుంది.

వసంతకాలంలోని కోకిలవలె ఎప్పుడూ ఆమె అత్యుత్సాహంతో గంతులువేస్తూ పాడుతుంది. అంతసంతోషం ఎందుకువస్తోందో ఆమెకేమీ తెలియదు. ఆ సమయంలో మాధురిజీవితానికి అంతకన్న ఆనందకరమైనకార్యం ఇంకొకటి లేదు. మాధురి ఉత్సాహానికి అమ్మ ఉప్పొంగిపోతూం టుంది. తన దత్తపుత్రిక ముందుముందు చీకటింటికి గొప్ప వెలుగు, శుష్కించిన పూదోటకు వసంతాగమం, పేదకు

పెన్నిధి, కంటి కానందంయిచ్చే ఆటవస్తువుగా, ప్రకాశించ గలదని ఆమెనమ్మకం.

ఒకనాటి సంధ్యాకాలం. కనుచీకటిగా ఉంది. మంద మారుత స్పర్శ ఎంతోహాయిగా, సుఖప్రదంగా, మనశ్శాంతి నిస్తోంది. అటిసమయంలో మాధురి నిరావరణంగా వున్న పై అంతస్థుమీందకూర్చుని సహజకోమలస్వరంతో గానం చేస్తోంది. ప్రేమోతలయొక్క హృదయాంతర్గతమైన మర్మవేద నలనుకూడా ఆగానధ్వని బహిర్గతం చేస్తోంది. ఇంట్లోఉన్న అమ్మ ఆ పాటనువిని ఆనందంపట్టలేక తన్మయత్వాన్ని పొందుతోంది. ఒక్కమారుగా వెళ్ళి కౌగలించుకొని ముద్దు పెట్టుకొందామా అని అనుకొంది. కాని అట్లాచేయలేక పోయింది. కారణమేమనగా ఒకవేళ అట్లాచేస్తే ఆమె వెంటనే పాటఆపివేయవచ్చు. దానివలన తానుపొందు తూన్న ఆనందపారవశ్యానికి ఆటంకంకలుగుతుంది. అందు చేతకలిగిన ఉద్దేశ్యాన్ని నెఱవేర్చలేకపోయింది. మాధురి పాడుతోందంటే దానికి ఆమెమనస్సంకల్పమే కారణంగాని ఇతరుల ప్రోత్సహంకాదు. ఎవరైనావచ్చి కుతూహలంతో పాడమంటే ఆమెసిగ్గుపడి తలవంచుకొంటుంది. కాని జవాబు చెప్పదు. అంత సున్నితమైనమనస్సు. అప్పుడేతయారౌతున్న మృదువైన కుసుమలతకన్న గట్టిగా స్పృశిసే వాడిపోయే అర్థవికసితమైన గులాబిపువ్వుకన్న ఆమెకింకో పోలిక లేదు.

తానుపాడే గానవాహిని ఒకనాటికి తనకే ఉపద్రవ కరంగా పరిణమిస్తుందేమోనన్న యోచనకూడ ఆ అమా యకురాలైన మాధురికి కలగలేదు. మొత్తముమీద ఆమె

గానంవల్ల కలిగే ఆనందం ఉన్మాదవిషాదాలు రెండింటికీ కారణభూతమౌతుందని చెప్పకతప్పదు. ఆమెపాటలో ఒక విధమైన ఉన్మాదము, రక్తి, మాధుర్యము, ఆకర్షణ వున్న దను విషయం యదార్థము.

రోడ్డుమీద స్వైరవిహారులగు యువకుల రాకపోకలు చాలా జోరగా ఉన్నాయి. ఆవిధంగా వచ్చేపోయే రశికు లంతా ఆమెపాటను ఒకటిరెండు గడియలకాలం విని అందు వల్లకలిగే మనోవినోదంతో తమ దైనికశ్రమను పోగొట్టు కొంటూంటారు. అమ్మ సావిడికిటికీలోంచి ఆశాపూరిత నేత్రాలతో ఆ శ్రోతలను పరిశీలనగా చూస్తూంటుంది. వారిలో తనదృష్టికి ధనాఢ్యవ్యక్తులని తోచినవారిని కను సైగలతో ఆహ్వానిస్తూంటుంది. ప్రేక్షకులకు ఆమెగానమే వినపడుతుందిగాని రూపసందర్శనం కలగటంలేదు. కొంత మంది శ్రోతలా గానమును చెవులార విని ఆనందపరవశులై తమసర్వస్వము ఆమెముందు ధారపోయడానికి సిద్ధపడు తూన్నట్లు వారివారి ముఖభావాలవల్ల వెల్లడవుతూంది. అట్టివారిలో అగ్రగణ్యుడైన ఒకవ్యక్తి క్రీగంటిచూపులతో అమ్మవైపుచూచి నేత్రావధానంచేశాడు. ఆ చూపులలో "విశేషాలేమి? పరిస్థితి ఎట్లాఉంది?" అన్నప్రశ్నలు భావ గోచరమౌతున్నాయి. ఇటువంటివానిలో నిపుణురాలైన అమ్మ గ్రహించి ఆనందపడ్డది. వికసితముఖంతో ఆ వ్యక్తిని చూచి చిరునవ్వునవ్వుతూ ఆ నవ్వులోనే "ఏలినవారి దయ వలన అంతా సుముఖంగానేఉంది." అనేభావాన్ని స్పష్ట పరచింది. వారిద్దరకు చూపులతోనే సంభాషణాలుజరిగి

నాయి. పాపము దురదృష్టవంతురాలైన మాధురిగానంలో అమృతంవుందా లేక విషంవుందా? ఈ దృక్సంభాష ణలు ఆమెభవిష్యత్తును ఏస్థితిలోకి తీసుకునివస్తాయి? అనే యోచన ఎవరికీ కలగలేదు. మాధురికి ఆ ఊహ అసలేలేదు.

## 2

ఒకరోజున అమ్మ మాధురినిపిలిచి ఇట్లాఅన్నది. "అమ్మాయీ!బీరువాలోంచి సిల్కుచీర, జాకట్టు తీసికట్టుకో. నీనగలన్నీ ధరించు. ఆ మాసినచీర, నలిగిన జాకెట్టు చూడ డానికి ఎంతో అసహ్యంగాఉన్నాయి. తీసివేసి మంచిదుస్తులు వేసుకో. కుమారబాబుగారు నీకోసం పదివేలరూపాయలు విలువగల హారంపంపించారు. మెడలోవేసుకో."

మాధురి కొంచెంచిరునవ్వుతో కొద్దికాఠిన్యం కన పరుస్తూ తల్లికి జవాబుచెప్పింది."నేనాహారం వేసుకోను. నా కది అక్కరలేదు." అని మారాముచేస్తూ ఇంకోవైపుకు వెళ్ళింది. అమ్మ ఆశాపూరితములైన చూపులతో చూస్తూ అన్నది.

"నామాట వినవూ? మాఅమ్మాయి ఎంతోమంచి పిల్ల. అమ్మా! నామాటవిను. పరుగెత్తకు."

"నేను పరుగెత్తడంలేదు. ఇక్కడేవున్నానుగా! నువ్వు చెప్పదలచిందేమిటో చెప్పు" అన్నది మాధురి.

"వింటావా?" అన్నది అమ్మ.

"వింటావా! వింటావా! అనడమేగాని నోట్లోంచి మాట ఊడిపడటంలేదు. ఏమిటాసంగతి?" అన్నది మాధురి.

"ఆ హారం మెళ్లో వేసుకో. లేకపోతే నామీదబెట్టే. నువ్వాహారం వేసుకొంటే ఎట్లాఉంటావో, ఎంతఅందంగా ఉంటావో చూడాలనిఉంది" అన్నది అమ్మ.

"అందచందాలు, శోభవిషయం అట్లాఉంచు. నేను సహజంగానే అందమైనదాన్ని. నా కా హారం ఎందుకు?" అన్నది మాధురి.

మాధురి గులాబిరేకులవంటి పెదవులపై చిరునవ్వు కనబడింది. దానితోకలిపి అమ్మకూడా మందహాసాన్ని వ్యక్తంచేసింది.

అమ్మ అంతటితో వదిలిపెట్టక కూతురుగడ్డంపుచ్చుకొని ఇట్లాఅన్నది. "అట్లాకాదమ్మా! ఒక్కమాటు ఆ హారం వేసుకో. చూచిసంతోషిస్తాను. నాకన్నులు చల్లగా ఉంటాయి. పట్టుపట్టకు. నాతల్లివికాదూ!"

తల్లిపట్టుదలకు మాధురి జవాబుచెప్పలేక తలవంచుకొని అన్నది "తీసుకొనిరా! వద్దంటూంటే ఎందుకా పట్టుదల? ఎందుకంత పంతం? అనుకున్నపని జరిగేవరకూ వదిలిపెట్టవు. తీసుకురా!"

అమ్మ వెంటనే లోపలికివెళ్ళి హారంతోపాటు నగలన్నీ తెచ్చి మాధురికి అలంకరించింది. ఎట్లాగో బలవంతం మీద విలువగల నీలపురంగు సిల్కుచీర, విలువగలబ్లౌజు తొడిగి తనమనస్సుకు నచ్చినట్లుగా శృంగారించి ఆమె అందాన్ని కన్నుల కరువుతీరేటట్లుగా ఒక్కమాటు నిదా

నించిచూచింది. తన పెంపుడుకూతురింత అందంగా ఉంటుందని ఆమె ఎన్నడూ అనుకోలేదు. ఆసౌందర్యాన్ని సావధానంగాచూచి బ్రహ్మానందపడ్డది. సంతోషభాష్పాలు ముత్యాలకోవవలె ఆమెచెక్కిళ్ళమీదకు జారిపడుతున్నాయి.

"సరేనా! సంతోషించావా అమ్మా!" అన్నది మాధురి.

"ఎంతో ఆనందంగా ఉంది. ఆ అలంకారం అట్లాగే ఉంచుకో" అన్నది అమ్మ.

"చాలులే. నువ్వుచూశావుగా! ఇక తీసేస్తాను."

—అంటూ మాధురి మెడలోనినగలన్నీ తీసివేయడానికి ప్రయత్నించడంచూసి అమ్మ అన్నది,

"అదేమిటే అమ్మా! అన్నీ తీసేస్తున్నావు? వద్దువద్దు. తియ్యకు. తీస్తే నామీద ఒట్టే."

"పట్టుపట్టకు. నాకక్కరలేదంటూంటే ఎందుకంత బలవంతంచేస్తావు? ఊరేగింపువిగ్రహంవలె ఇవన్నీతగిలించుకొని కూర్చోడమంటే నాకు చాలా అసహ్యం." అన్నది మాధురి.

ఇంతలో ఎవరో బయటనుంచివస్తూన్నట్లు అడుగుల చప్పుడు వినపడింది. మాధురి చకితురాలై ఆవైపుకు చూస్తోంది. మెడలోవున్న హారాన్ని తీసివేయాలని ఎడమచేత్తోపట్టుకుని కొంతవరకు తీసినచెయ్యి అట్లాగేఉంది. ఆమెశిరస్సు స్పష్టంగా నిరాటంకంగా, అందంగా కనపడు

తోంది. పైటకొంగునవున్న అంచు భుజందాటి మెడకింద వేలాడుతోంది. అల్లబడిన తలకట్టు పిఱుదులుదాటుతోంది. తలకురాచుకొన్న సుగంధతైలపు పరిమళం ఆ గదిఅంతా నిండిపోయి నాల్గువైపుల వ్యాపించింది.

కొత్తగావచ్చినవ్యక్తి లోపల కాలుపెట్టేడు. అమ్మ వెంటనే ఎదురుగావెళ్ళి గొప్పఆదరం, సత్కారంచేసి కూర్చొబెట్టింది. కాని మాధురి ఎట్లాఉంది? ఇటువంటి ధనాఢ్యపువ్యక్తులఎదుట అలంకరించుకొని ఎదురుగా వాలు చూపులతో చూస్తూనిలబడడం ఆమెకు ఇదే తొలిసారి. ఇంతే గాక ఆ వచ్చినవ్యక్తిని గౌరవించి ఆదరించవలసిన బాధ్యత అంతా తనశరీరంమీద, మృదుహస్తములమీద, మెత్తని చిగురుటాకులవంటి చేతివేళ్ళమీద ఆధారపడి ఉంటుందన్న విషయం అమాయకురాలైన, ప్రపంచకవిషయాల్ని తిన్నగా అర్థంచేసుకోలేని మాధురి కేమితెలుస్తుంది? మరియు ఆ రసిక శిఖామణికి తన అర్ధవికసిత యౌవ్వనపుష్పాన్నే సత్కరించవలసిఉంటుందన్న ఊహకూడా ఆమెకుకలగడం అసంభవం. అందుచేత మాధురి సిగ్గుతో తలవంచుకొని కొయ్యబొమ్మవలె నిలువబడింది.

అమ్మ ఆగంతకుడైన రసికుని సుందరమైన శయ్యాగృహంలోకి తీసికొనివెళ్ళి మెత్తనికుర్చీలో సగౌరవంగా కూర్చొబెట్టింది. వెనుకఉన్న దిండుకానుకొని ఆవ్యక్తి దర్జాగా కూర్చున్నాడు. అమ్మ ఎదురుగా కొంచెందూరంలో నిలువబడి వినయంఉట్టిపడేటట్లు అన్నది; "ఏలినవారికి మా మీద చాలాదయకలిగింది. తమరు రావడంచేత ఈశిథిలమైన

ఇంటికి ఎంతో వెలుగువచ్చింది. తమరాకకోసం ఎదురు చూడడంతో కళ్ళుకాయలుకాసినాయి." అంటూ వెనుకకు తిరిగి "అమ్మాయీ! అమ్మాయీ!" అని కేకవేసింది.

మాధురి మారుపలుకలేదు. ఆమె అక్కడనుండి ఇంకోగదిలోకి వెళ్ళిపోయి మంచంమీదకూర్చుని దిండు మీద తలఉంచి వెక్కివెక్కి ఏడుస్తోంది. అట్లా ఎందుకు దుఃఖ పడుతోందో ఆమెకేమీ తెలియటంలేదు. తనశోకానికి కారణమేమో ఆమె ఊహించుకోలేకపోతోంది.

"ఇంకా చిన్నపిల్ల. ఆటలమీది దృష్టిపోలేదు. ఏమీ అనుకోకండి. మహారాజులు తమరు దాన్ని చూడడానికివస్తే ఎక్కడికో వెళ్ళింది. ఏలినవారు దయచేసి కొంచెం విశ్రమిస్తే నేనులోపలికివెళ్ళి వక్కలు, ఆకులు అమ్మాయిచేతికిచ్చి మీ దగ్గరకు పంపిస్తాను." అన్నది ఆయనతో అమ్మ.

అమ్మ వెనుకటిగదిలోకి వెళ్ళిచూడగా మాధురి అక్కడలేదు. కూతురుపట్టుదలకు ఆమెకు కొంచెం కోపంవచ్చింది. అసలువిషయంఏమో కొంతవరకు గ్రహించి ఉంటుందని అమ్మ ఊహించి ఇంకోగదిలోకి వెళ్ళి చూచింది. కూతురు దిండుమీద తలపెట్టుకొని రోదనంచేస్తూండడం కని పెట్టి దగ్గరకువెళ్ళి చూసింది. ఆమెవిశాలనేత్రాలు దుఃఖంతో ఎర్రబడిపోయాయి. కూతురుదుఃఖానికి కారణమేమో అమ్మ తెలుసుకోలేకపోయింది. మీదచెయ్యివేసి ప్రేమతో నిమురుతూ అన్నది: "అమ్మాయీ! మాధురీ! ఇదేమిటి? ఎందుకు ఏడుస్తున్నావు? ఇంటికి జమీందారుగారువస్తే నువ్విట్లా

ఉండడం బాగుంటుందా? ఆనందించవలసినసమయంలో దుఃఖ పడతావేం? ఛీ! ఛీ! లే! ఇట్లా ఎవరైనా చేస్తారా?

మాధురి కదలలేదు, మెదలలేదు. అట్లాగే పడుకొని ఉంది. "అమ్మాయీ! నువ్విట్లాచేస్తే నామీదఒట్టే. లేచిరా. నాపేరు చెడగొట్టవద్దు. చివరకు వచ్చిన పెద్దమనిషికి మర్యాదైనా చెయ్యాలా లేదా! ముఖం కడుక్కొనిరా. ఇంతలో నేను ఆకులకు సున్నంరాచి చుట్టిఉంచుతాను."

మాధురి ఎంతచెప్పినా లేవలేదు. అమ్మ బలవంతంగా లేవదీసి ముఖంకడిగి తలసరిజేసి తములపాకులు చుట్టడం ప్రారంభించింది. మాధురి మనస్సులో దీర్ఘంగాఆలోచిస్తోంది. "ఆయనఎవరు? అమ్మకు ఇంతధనికులైన చుట్టాలెవరూలేరు. ఎక్కడినుంచి వచ్చాడు ఈఅతిథి? నేను ఆయనకు ఎదురుగా వెళ్లాలీ! ఎందుకువెళ్ళాలి? వెళ్ళను. ఎంతచెప్పినా వెళ్ళను. వెళ్ళకపోతే ఏమౌతుంది? అమ్మ ఏడుస్తుంది. ఆమె కింత ఆదుర్దా, విచారం దేనికి? పరపురుషుని ఎదురుగా నిలువబడి మాట్లాడగలనా! మాట్లాడితే వచ్చేనష్టంఏమిటి?"

అమ్మ ఆకులుచుట్టి పళ్లెంలోఉంచి మాధురితో అన్నది: "అమ్మాయీ! ఈపళ్లెంతీసుకొనివెళ్ళి వారిఎదురుగా ఉంచు. వెంటనే మర్యాదగా వినయంగా నమస్కారం చెయ్యి. నేనుకూడా నీవెనకే వస్తాను. పద. ఆలస్యమౌతోంది. మాఅమ్మవుకాదూ! మంచిదానవు. నామాట విను. త్వరగావెళ్ళు. ఆయన ఏమైనా అనుకుంటాడు."

ఎంతచెప్పినా మాధురి లేవలేదు అమ్మ ఇట్లాఅన్నది: "ఎంతచెప్పినా వినవేమే! అవతల కూర్చున్నపెద్దమనిషికి

కోపంవస్తుంది. ఆయన ఎంతో అవమానంగా ఊహిస్తాడని చెప్పినా లక్ష్యంలేదేం? మనఇంటికివచ్చిన పెద్దమనిష్లాషి అ అగౌరవంగావెళ్తే బాగుంటుందా? అల్లరిపిల్లా! చెప్తే గ్రహించవేమి? నాబిడ్డవుగాదూ! నామాట విను. దీర్ఘాయుష్మంతురాలవై గొప్పపేరు డబ్బు సంపాదించాలి."

ఆమె కుమార్తెను కౌగలించుకొని ముద్దుపెట్టుకొంది. మాధురి ఏమీఅనలేక పళ్లెంతీసుకొని బయలుదేరిందేగాని మనస్సు వెనుకకులాగుతోంది. ఎట్లాగో తలవంచుకొని వెళ్ళి తమలపాకులపళ్లెం ఆతనిముందుబల్లమీదపెట్టింది. కాని నమస్కారంచేయాలనిచెప్పినమాట మరిచిపోయింది. ఒక నిమిషమైనా అక్కడ నిలువలేకపోయింది. తనగదికి వెళ్దామని వెనుకకు పెద్దపెద్ద అంగలువేస్తూ నడుస్తోంది.

అట్లావస్తూంటే అమ్మఎదురై "అదేమిటే అమ్మాయీ! ఎక్కడకు వెళ్తున్నావు? రా.కూర్చో.కొంచెం సేపు వారి ... అంటూ మాధురిచేయిపట్టుకొని బలవంతంగా తీసుకొనివచ్చి అతనికెదురుగా కూర్చోపెట్టి తాను గూడ కొంచెందూరంలో కూర్చుంది. నాలుగైదునిమిషాలు నిశ్శబ్దంగా గడిచినతర్వాత ఆ ప్రశాంతవాతావరణానికి భంగంకలిగిస్తూ అమ్మ ఆగంతకునిజూచి "మహారాజా! మా అమ్మాయికి ఇంకా చిన్నతనం. ఇంతవరకు ఇతరులయెదుట నిలుచోడం మాట్లాడడం తెలియదు. ఇంతకుముందెప్పుడూ అట్లా చెయ్యలేదు. అందుచేత కొంచెం భయంతో,సిగ్గుతో, నోరెత్తలేక పోతోంది."అన్నది.

ఆతడు మాధురిని ఓరగంటచూస్తూ చిరునవ్వునవ్వి

"మరేమీలేదు. కొత్తలో అట్లాఉండడం సహజమే." అన్నాడు.

"చిత్తము మహారాజా! ఏదో ప్రపంచజ్ఞానంలేని అమాయకురాలు. చిన్నబిడ్డ. తమరు అనుగ్రహిస్తే కృతార్థు రాలౌతుంది. తమ పాదధూళి తగిలేచాలు. పాలు పంచదార వలె మీతో కలిసిపోతుంది. ఇంతకన్న నాకు ఆనంద మేముంది? అప్పుడివిధంగా నన్నిక్కడ కూర్చోనిస్తుందా?"

—అంటూ ఆగంతకుడైన కుమారబాబునుచూచి ఒక మందహాసాన్ని ముఖంమీదకు అరువుతెచ్చుకొంది, ఆమె.

"దీనికింత ఉపోద్ఘాతం అక్కరలేదు. ఇంకా చిన్న తనంఅన్న సంగతి కనపడుతూనేఉంది. నేను తరుచుగావచ్చి చూస్తూనేఉంటాను. ఈవయస్సులో సిగ్గు, సంకోచం ఉంటుంది. అట్లా వుంటేనే బాగుంటుంది. రెండుమూడు దినాలు ఇట్లాగడిస్తే తర్వాత పాటవినే అదృష్టంకూడా నాకు లభిస్తుంది. అవునాకాదా మాధురీ!" అంటూ కుమారబాబు ప్రేమవీక్షణాలను ఆమెముఖంమీదకు ప్రసరింపచేశాడు.

"ఏలినవారు చెప్పింది సత్యం. మీఆజ్ఞను పాలించ డానికి సిద్ధంగాఉన్నాం. సర్కారువారు వస్తూపోతూ పలక రిస్తూంటే ప్రేమకూడా అధికమౌతుంది. అదెప్పుడు వృద్ధి అయిందో పరస్పరం హృదయాలు స్వాధీనమౌతాయి. "అమ్మాయీ! మాధురీ! ప్రభువులేమి సెలవిస్తున్నారో

వింటున్నావా? నీకిష్టంలేకపోయినా వారు కోరినందుకైనా ఒక పాటపాడు. హార్మోనియం తీసుకొనిరానా?"

"వద్దు. ఇప్పుడేమీ అవసరంలేదు. సిగ్గుతో మునిగిపోతూంటే సంగీతం ఎట్లా పాడుతుంది? బలవంతం ఎందుకు? నాలుగుదినాలు గడిస్తే నువ్వు చెప్పకుండా తానేపాడుతుంది. మంచిది నేను వెళ్తాను." అన్నాడు కుమారబాబు.

అమ్మలేచి ఆదుర్దాకనపరుస్తూ అన్నది :"అయ్యో! అప్పుడేవెళ్తారా! ఏమివచ్చినట్లు-ఏమివెళ్ళినట్లు! పిల్ల వెంకితనంచేత మహారాజుగారి మనస్సు కష్టపడిఉంటుంది. మాధురీ! కొంచెం పాడవమ్మా! మహారాజుగారు వింటారు."

మాధురి ఏమీమాట్లాడలేదు. కుమారబాబు అమ్మవైపుతిరిగి అన్నాడు: "బలవంతపెట్టవద్దని చెప్పేనుగాదూ! చంద్రహారంబాగుందా! లేకపోతే........."

"చంద్రహారం బాగానేఉంది. కాని-"

"మధ్య ఆపివేశావేం? చెప్పు ఇంకా ఏమిటో?" అన్నాడు కుమారబాబు.

"నేను చెప్పలేను మహారాజా! మాధురీ! నువ్వే చెప్పు. ప్రభువుగారు దొడ్డవారు. ఖాతరీచెయ్యి. శీవికా లోటు లేదు-రూపానికా సాటిలేదు. నీ ఉద్దేశ్యం వారితోచెప్పు. సిగ్గుపడకు." అంది అమ్మ.

మాధురి ఏమిచెప్పగలదు? ఇదంతా విటులను మోసగించేనాటకమనీ, దీనివలన తనజీవితం అధోగతిపాలా

తుందనీ ఆ అమాయకురాలు ఎట్లా గ్రహిస్తుంది? తల్లి మాటలలోని అంతరార్థం, రహస్యభావం లేశమైనా ఆమె గ్రహించలేకపోయింది. సిగ్గుతో తలవంచుకొని మౌనముద్ర ధరించింది. ఆమెకు మోయలేనంత భారం తలకెత్తినట్లుంది.

కుమారబాబు అమ్మతో అన్నాడు: "మాధురి మాట్లాడ దలచుకోలేదు. ఆమెకుబదులు నువ్వే చెప్పు."

'ఆఁ! ఊఁ!' అని నసుగుతూ "చంద్రహారం బాగానే ఉందిగాని అది జారుగా ఉంటుంది. దానికితోడుగా మెడకు ఏదైనా ఒక నెక్లెస్ ఉంటే అంటిపెట్టుకొని ఉంటుంది. అందంగా ఉంటుందని అమ్మాయి నాతో అన్నది. సిగ్గుచేత మీతో చెప్పలేకపోతోంది." అంది అమ్మ.

కుమారబాబు నవ్వుతూ అన్నాడు : "ఓహోహో! ఇంతేనా! దానికింత సందేహమెందుకు? అదీవస్తుంది. తలచు కొంటే ఎంతసేపు?"

అతడు మళ్ళా నవ్వేడు. ఆ నవ్వుతో గదిఅంతా ప్రతిధ్వనించింది.

కుమారబాబు కొంతసేపు ఈమాట ఆమాట మాట్లాడి బయటకి వెళ్ళిపోయాడు. అమ్మ ఆయనను సాగ నంపడానికి కొంతదూరం అనుసరించింది. ఇక మాధురి హృదయం ఎట్లాఉందో, ఆమెకడుపులో ఎటువంటితుఫాను చెలరేగుతోందో ఎవరికీ తెలియదు. అడిగినా ఆమె చెప్పదు.

# 3

ఆరునెలలు గడచినాయి. మాధురిలో ఎంతో మార్పు వచ్చింది. కుమారబాబుతో ఏకమైపోయింది. క్షీర నీర న్యాయంగా వారిద్దరూ కలిసిపోయారు. అమ్మ కుమార్తె నెంతో ప్రేమతో చూస్తోంది. ఒకసంవత్సరంలో మంచి మేడ కట్టించి చుట్టూ పూలమొక్కలు, మంచిమంచి చెట్లు వేయించి ఎంతో అందంగా చూడముచ్చటగా తయారు చేయించాలనీ, ఇంకా ఏమేమోచేయాలనీ అంచనాలు వేస్తోంది. ఆకాశంలో సౌధాలు కట్తోంది.

చక్కగా అలంకరించిన గదిలో మాధురీకుమారు లిద్దరు కూర్చున్నారు. కుమారబాబు మంచంమీద బాలీసు నానుకుని ఒయ్యారంగా కూర్చున్నాడు. విలాసవస్తు సామగ్రి గదిలో నాలుగుప్రక్కల అమర్చబడిఉంది. విశాలమైన సోఫాలో కూర్చుని మాధురి పాటపాడుతోంది. సాధనతోగూడిన ఆ కంఠస్వరం హార్మోనియంశ్రుతిలోకలిసి శ్రవణానందం కలగజేస్తోంది. రీడ్లమీద వ్రేళ్ళు అత్యద్భుతంగా నాట్యంచేస్తున్నాయి. ప్రేమభావపూరితమైన ఒకపదం పాడి రాగాలాపనచేస్తోంది. కుమారబాబుసంగతి అడగనక్కరలేదు. మాధురిగానానికి అతడు తన్మయుడై పోతున్నాడు. ఆనందానికి అంతులేదు. తాను దేవేంద్రుడు. మాధురి దేవాంగన. అదే వారిస్వర్గం. ఆనందమనే ఆకాశ గంగాతరంగాల్లో మునుగుతూ తేలుతూన్నాడు.

కొంతసేపటికి పాటఆగిపోయింది. ఆగిన కొంతసేపటికి

కుమార్‌కు తన్మయభావంపోయి బాహ్యజ్ఞానంకలిగింది. కళ్ళువిప్పిచూచి "మాధురీ!" అని పిలిచాడు.

"ఆజ్ఞ ఏమి? మహాప్రభూ!" అన్నది మాధురి.

"సీసాఊడదీసి గ్లాసులోపోసి రెండుమోతాదులు ఇస్తావా?" అన్నాడు కుమార్.

మాధురిలేచి ఒయ్యారంఅంతా ఉట్టిపడేటట్లుగా అలమారులోంచి సీసాతీసి విలువగల ద్రాక్షసారాయిని గ్లాసులోపోసి కుమార్‌కందిచ్చి "తీసుకోండి" అన్నది.

"అట్లాకాదు. నీచేతిమీదుగా తాగించాలి." అన్నాడు కుమార్.

"నా చేతిమీదుగా?" అన్నది మాధురి.

"చేత్తోతాగిస్తే ఎంతో మజాగావుంటుంది."

"అట్లాగైతే నేనే తాగిస్తాను పుచ్చుకోండి" అంటూ మాధురి అతిసుకుమారములైన వ్రేళ్ళతో గ్లాసుపట్టుకొని కుమారబాబు నోటికందిచ్చింది. ఆనందం చేత కంపించిపోతూండే పెదవులతో అత డాగ్లాసును తెప్ప పాటుకాలంలో ఖాళీచేశాడు. అంతటితో ఆగుతుందా, వరస వెళ్తోంది. గ్లాసులోపొయ్యడం, అందివ్వడం మాధురివంతు. తాగడం అతనివంతు. ఇట్లా నడుస్తోంది. కొంతసేపావిధంగా సురాపానకార్యక్రమం జరిగిపోయింది. కుమారబాబు మత్తుతో ఊగిపోతున్నాడు. మాధురి ఉత్సాహంతో తిరిగి ప్రేమగానం ఆలాపనచేస్తోంది. కుమారబాబు ఆనందపర వశుడై భేష్! భేష్! వాహా! వాహా!అని మెచ్చుకొంటున్నాడు.

పాట పూర్తిఅయినతర్వాత కుమార్ మత్తుతో తూలిపోతూ మాధురినిపిలిచాడు.

"మాధురీ!"

"మహారాజా!"

"ప్రియురాలా! నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా? నిజం చెప్పాలి."

మాధురి ఆప్రశ్నకు మందహాసం చేస్తూ జవాబు చెప్పింది.

"మహారాజా! ప్రేమ మాటలతో బోధపడదు. బోధపరచడంకూడా చాలాకష్టం."

కుమారబాబు ఎడమ చేతిని ఆమెభుజంమీాద వేసి కుడి చేత్తో ఆమెగడ్డంపుచ్చుకొని నెమ్మదిగాఊపుతూ అన్నాడు.

"అయితే ఇక ఏరీతిగా తెలుస్తుంది మాధురీ!!"

"ఆప్రశ్న నాహృదయాన్ని అడగండి. అదే మీాకు సమాధానం చెపుతుంది." అన్నది మాధురి.

"శాబాస్! బాగా చెప్పేవు, ప్రియురాలా!" అంటూ ఆమెకంఠంలో చాలా అట్టహాసంగా నవ్వేడు.

"అయితే నేనుకూడా ఆ విధంగానే మిమల్ని అడిగితే?" అన్నది మాధురి.

"నాప్రేమ ఎట్లాంటిదో చూస్తావా?" అన్నాడు కుమార్.

"మీారు చూపించగలరా?"

"తప్పకుండా."

అతను మాధురియొక్క నవ్వుతూన్న ముఖాన్ని దగ్గరగాతీసుకొని అతిమృదుతరములైన ఆమె మెత్తనిపెదవులమీద మధురమైన, సూక్ష్మాతిసూక్ష్మమైన చుంబనాన్ని ముద్రించి కంపింపచేస్తూ అన్నాడు:

"మాధురీ! చూశావా? దీనినే ప్రేమఅంటారు."

మాధురి మారాంచేస్తూన్నట్లు నటిస్తూ కుమార్ కౌగిట్లోంచి తప్పించుకొని ఎడంగా నిల్చుంది. ఆమెకు దేహమంతా పులకరించినట్లైంది. వెంటనే కొంచెం కోపాన్ని నటిస్తూ నెమ్మదిగా అన్నది:

"చాలు. మీప్రేమఅంతా కట్టిపెట్టండి. నాకిట్లాంటి పనులు పనికిరావు."

"మాధురీ! నిజంగా నీకక్కరలేదా?"

"ఆహా! నిజంగానే"

మాధురికి నిజంగా కోపంవచ్చిందా! అనే ఊహతో కొంచెం సంకోచపడ్డాడు కుమార్. అంతలో ఒక్కమాటు నిదానించి మాధురిముఖంవైపు పరిశీలనగా చూశాడు. ఆమె పెదవులమీద చిరునవ్వు లీలామాత్రంగా గోచరించడం గమనించాడు. మాధురి అనవసరంగా కోపం తెచ్చుకొన్నదా? లేక ఆమె ప్రేమించేవిధానం ఇట్లాగేవుంటుందా? అనుకున్నాడు.

కొన్నినిమిషములు గడిచినతర్వాత తిరిగి సురాపాన కార్యక్రమం ప్రారంభమైంది. గ్లాసుమీద గ్లాసు నడుస్తోంది. కుమార్ దేహం తెలియనిస్థితిలోకి వెళ్తున్నాడని తెలుసుకొని,

"ఆపండి. ఇహ తాగనీయను." అన్నది మాధురి.

"కాదు మాధురి! ఇంకొక్క గ్లాసు."

"ఒకమాట అడగనా?"

"సంతోషంగాఅడుగు. సంకోచంవద్దు."

"ఈ సురాపానంవల్ల మీకేమి ఆనందంకలుగుతోంది? నాప్రేమకంటే ఈ సారాయి తియ్యగావుందా?"

"మాధురీ! నీకు తెలియదు. అది చెప్పేవిషయంకాదు. అనుభవంచేత తెలుసుకోవాలి. నీ ప్రేమసంగతి వేరు. ఈపానీయాన్నిగూర్చిన విషయం వేరు. చెప్తేబోధపడదు."

"కాదు. నాదృష్టిలో మీకు నాప్రేమకన్న సారాయి ఎక్కువగావున్నట్లు కనపడుతోంది."

"కాదు మాధురీ! నిన్నునాప్రాణంకన్న ఎక్కువగా ప్రేమిస్తున్నాను. నీతరువాతనే సారాయి."

"చాలించండి. అదికూడాచెప్పుకోవాలీ! మీకేది ఎక్కువ ఇష్టమో గ్రహించాను." అన్నది మాధురి.

"నీ దృష్టిలో నేను ఇకమీద తాగకూడదనా?" అన్నాడు కుమార్.

"నిజం. అదే నా ఊహ. కాని నేను అనుకొన్నంత మాత్రాన ఏమౌతుంది?" అన్నది మాధురి.

"మంచిది. ఇంకొకగ్లాసు ఇయ్యి. ఇకమీద నిన్ను అడగను. తెలిసిందా?" అన్నాడు కుమార్.

"అడగరుగదా! నిజమేనా?" అన్నది మాధురి.

కుమారబాబు ఆమె అమాయకత్వానికి నవ్వుకొన్నాడు. ఆ నవ్వును మాధురి ఎట్లాఅర్థంచేసుకొన్నదో తెలియదు. ఆ నవ్వులోకలిపి తానుగూడ నవ్వింది.

# 4

ఆదినం తోటలో విందు. (Garden party) కుమారబాబుతాలూకు సేవకులందరు కోలాహలంగా సంతోషంతో అటుఇటు తిరుగుతూ సర్దుపాటుచేస్తున్నారు. అంతకుముందే తోటఅంతా శుభ్రంచేసి అలంకరించబడింది. వరుసలుగా వేయబడిన కుర్చీలకెదురుగావున్న చౌపాయీలపై (నలుచతురపు ఎత్తుబల్లలు) పదార్థాలన్నీ వంటవారు ఒకటొకటిగా సిద్ధంచేస్తున్నారు. నౌకర్లకూ, కూలీలకూ తీరిక లేదు. ఏమాత్రం పొరబాటువచ్చినా యజమాని హంటరుతో కొడతాడేమో అన్న భయంతో సేవకవర్గంఅంతా వణుకుతూ పనిచేస్తోంది. తప్పుకు శిక్ష దెబ్బలతోపోదు. ఒకటి రెండు నెలల జీతంకూడా జరిమానాక్రింద బిగపట్టుకోడం జరుగుతుంది.

ఆహ్వానింపబడ్డ సజ్జనులంతా ఒకరొకరుగా వస్తున్నారు. ఆహూతులైవచ్చిన అతిథుల హాస్యవినోదసంభాషణలతో తోటఅంతటా గందరగోళంగావుంది. వచ్చిన పెద్దమనుష్యులంతా కుర్చీలమీద కూర్చున్నప్పటికీ సంఖ్య పూర్తికాలేదు. కొన్ని ప్రధానములైన ప్రదేశాలు ఖాళీలుగానే వున్నాయి. కారణమేమంటే కుమారబాబు రావడం

ఆలస్యంఅయింది. అతనితోపాటు ఇంకా ముగ్గురునల్గురు పెద్దమనుష్యులు రాలేదు. వారికోసం అందరూ ఎదురు చూస్తున్నారు.

ఆకస్మికంగా మోటారుహారన్ వినపడ్డది. తర్వాత రెండునిముషములకు మోటారు లోపలికివచ్చింది. అందరు లేచినిల్చున్నారు. కారులోంచి కుమార్ కిందకుదిగి అందరికి వందనంచేసి నవ్వుతూ "నే రావడం ఆలస్యం అయింది. నామూలంగా మీకందరకూ కష్టంకలిగినందుకై నేను విచారపడుతున్నాను. కాని ఒకవిధమైన సంతోషం కూడా కలుగుతోంది. ఇంతవరకూ నేను మీకందరకూ ఒక సంతోషకరమైన కార్యక్రమం ఏర్పాటుచేయడానికే బయట వుండిపోయాను. ఇటువంటి విందుభోజనాలకు మ్యూజిక్ పార్టీ వుంటేనేగాని అందంవుండదు. రసవంతంగా శోభించదు. అందుచేత ఆ ఏర్పాటుచేయించాను. కొంచెంసేపటిలో మనపట్టణంలోవుండే సుప్రసిద్ధగాయని మిస్. మాధురీదేవి వచ్చి తన గానంతో మిమ్మల్నందరినీ ఆనందింపచేస్తుంది. నా యీ ఏర్పాటు మీకందరకూ వుత్సాహకరంగా వుంటుందని భావిస్తాను. ఆమెయొక్క శక్తిసామర్థ్యాలనుగూర్చి మీ యెదుట ఎక్కువగా చెప్పడం అనవసరమనుకొంటాను." అన్నాడు.

ఒక్కగుక్కలో కుమార్ బాబు పైవిషయమంతా సభ్యులయెదుట చెప్పి ఆపివేశాడు.

"ఆమె గొప్పగాయకురాలని మీరంటూంటే ఇప్పుడే విన్నాము. అటువంటి దివ్యగానంవినే భాగ్యం

లభించడంకూడా మా అదృష్టమే." అని అన్నాడు సభ్యులలో ఒకడు.

"ఆమె ఎప్పుడూ బయటకురాదని విన్నాను" అని అన్నాడు ఇంకొకసభ్యుడు.

"ఘోషాసంగతి నాకు తెలియదు కాని ఆమె డబ్బుకోసం కక్కుర్తిపడి ఆశించే స్వభావంకలదికాదని విన్నాను. వేశ్యలలోకూడా ఆత్మగౌరవం కాపాడుకోవాలనే పట్టుదలగల ఇట్లాంటివారు కొందరున్నారు" అన్నాడు మరియొక సభ్యుడు.

"అదికాదు. ఆమె వయస్సులో చాలాచిన్నది. పదిమందిలోకి రావడానికి చాలాభయపడుతుంది. సంకోచం ఎక్కువ. ఎక్కువమంది జనంవున్న ప్లాటుఫారంమీదకు ధైర్యంగారాలేదు." అన్నాడు కుమార్.

ఇంతలో ఇంకో మోటారువచ్చింది. దానిలోంచి పరిశుభ్రమైన సాదాదుస్తులు ధరించిన, సౌందర్యరాశియగు పదిహేనుసంవత్సరాల వయస్సుగల బాలిక కిందకుదిగడం అందరూ చూశారు. ఆమె రూపసౌందర్యాలలో కృత్రిమంగానీ, వేశ్యలకుండే కపటమందహాసంగానీ, కన్నులలో చాంచల్యంగానీ ఏమీలేదు. కేవలం అమాయకత్వం స్పష్టంగా కనపడుతోంది. వెంట అమ్మ, ఇంకొక సేవకుడు వున్నారు. సహకారవాద్యాలుగాని వానిని వాయించేవారుగాని కనపడలేదు.

అమ్మ అందరికీ ఎదురుగానిలుచుని నమస్కారంచేసి

ప్రక్కకు తప్పుకొంది. వెనకనున్న నౌకరుకూడా వందనం చేసి వెళ్ళిపోయాడు.

మాధురి అట్లాగే నిల్చునివుంది. ఆమెనేత్రాల్లో ఒక వున్మాదభావంకాని మందహాసరేఖలుగాని ఏమీలేవు. తల వంచుకొని మౌనంగా నిల్చుంది.

మిసమిసలాడుతూండే ఆమెఅందం, యువకుల నాకర్షించి వెఱ్ఱివాళ్ళను చేయగల యౌవనపుకళలు కూర్చున్న సభ్యుల కన్నులకు మిఱుమిట్లుగొల్పడంచేత అందరికి చెప్పలు వాలిపోయినాయి.

"ఇంతఅందంగా వుందేం? ఇది అందమేనా! లేక ఏదైనా మోసమా?" అనుకొన్నాడు ఒకడు.

"ఆకళ్ళల్లో ఎటువంటివారినైనా ఆకర్షించే విషం వుంది. సర్వరక్షకుడు భగవంతుడే కాపాడాలి. కనుకనే కుమార్ ఈమెవెంటబడి నిద్రాహారాదులుకూడా మరచిపోతున్నాడు." అన్నాడు ఇంకొకడు.

ఇక కుమార్ సంగతి చెప్పనక్కరలేదు. ఆనందసముద్రంలోబడి మునకలు వేస్తున్నాడు. మాధురినిచూచి "మాధురీ! అట్లానిల్చున్నావేం? భయంఎందుకు? ఇక్కడ వున్నవాళ్ళంతా మనవారే. పరాయివారెవరూ లేరు." అన్నాడు కుమార్.

కైలాసచంద్రుడు కుమారబాబుకు ఆంతరంగిక మిత్రుడు. అతడు కుమార్ మాటను బలపరుస్తూ అన్నాడు.

"నిజం. నిజం. నేను పరాయివాణ్ణికాదు. కుమారబాబుకు కుడిభుజం- తెలిసిందా?"

"నేను ఎడమభుజం - సందేహంలేదు." అని మురళీధరుడు అన్నాడు. ఇంకా అతను ఇట్లాఅన్నాడు.

"ఇక్కడవున్నవారంతా మనవారే. కుమార్ మీ సంగతి ఎంతో గొప్పగా చెప్పేడు. అనేకసార్లు అతను మాతో నీవిషయంచెప్పగా విన్నాము. ఒకసారి శ్రవణానందంగా నీ పాట వినాలని అనుకొన్నాము. కాని ఇంతత్వరగా మాకోరిక నెఱవేరుతుందని మే మెవరమూ అనుకోలేదు. ఈనాడు మా కిటువంటి అవకాశం కలుగ జేసినందుకు కుమారబాబుకు ధన్యవాదాలు సమర్పిస్తున్నాము."

ఈవిధంగా ముఖస్తుతులు ప్రారంభమైనాయి. ఎవరికి తోచినట్లు వారంటున్నారు. ఆమె ఏమిసమాధానం చెపుతుంది? ఆమె కీ గొడవంతా ఏమిటో అర్థంకావటంలేదు. తన్ను కుమారబాబు మోసంచేశాడనుకొని చాలాఆశ్చర్యపడుతోంది. ఎవరూవుండరు. మనమిద్దరమే అని కుమార్ అన్నాడు. ఆమాట నమ్మి ఇక్కడకు వచ్చిచూస్తే పెద్దసభ, ప్లాటుఫారం అన్నీఏర్పాటైనాయి. ఇప్పుడేమిచేస్తుంది?

ఏమీ మాట్లాడకుండా తలవంచుకొని కూర్చుంది. కుమార్ ఆమెవైపు చూశాడు. ఆమెకూడా ఓరగంట కుమార్‌ని చూసింది. కనుచూపులతోటే వారిద్దరూ మాట్లాడుకొంటున్నారు. ఆమెముఖంమీద ఒకవిధమైన సౌందర్యశోభ తొణికిసలాడుతోంది. పెదవులమీద మందహాసం రేఖామాత్రంగా స్పష్టమౌతోంది. కుమార్ ఒకమారు మాధురిని, ఇంకొకమారు సభ్యులనుచూచి, "ముందుగా

సంగీతసభ ఏర్పాటుచేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. ఇది మీకందరికీ సమ్మతమేనా?" అన్నాడు.

"మాకిష్టమే." అన్నారు అందరు.

"మాధురీ!" అన్నాడు కుమార్.

"సర్కార్!" అన్నది మాధురి.

ఆమెకు కుమారబాబును సర్కార్ అని సంబోధించడం ఇదే తొలిసారి. లోగడ అనగా వారిఏకాంతసమయంలో ప్రియుడా! ప్రియతమా! మనోహరా! అని పిలుస్తూండడం మాధురికి అభ్యాసం. కాని ఇప్పుడు కుమార్‌ను "సర్కార్" అని సామాన్యంగా సంబోధించింది. కారణమేమంటే ఆమె కుమార్‌ను ఎంతప్రేమించినప్పటికి లోకానికి ఒక వేశ్యగా తాను నిర్ణయింపబడడంచేత నల్వురిలో తన హృదయభావాన్ని వెల్లడించడానికి సాహసంచాలక ఆ విధంగా అన్నది.

"ఒకటిరెండుకీర్తనలు - నీకుసంతృప్తిగావున్నవి పాడి సభ్యులను సంతోషపరచాలి." అన్నాడు కుమార్.

"నాపాట బాగుంటుందా? అందరికీ ఆనందంగా వుంటుందా?" అన్నది మాధురి.

"ఆవిషయం అడగాలా! నువ్వు ఏదిపాడినా బాగానే వుంటుంది. సంకోచంలేకుండా స్వేచ్ఛగా గానం విన్పించు." అన్నాడు కుమార్.

మాధురి పాడడం ప్రారంభించింది. ఒకటికాదు. రెండు కాదు. ఇంకొకటి-ఇంకొకటి అంటూ సభ్యులుకోరుతూన్న కొద్దీ కీర్తనలు, పాటలూ జరిగిపోతున్నాయి. శ్రోతలకంద

రికీ తృప్తి తీరడంలేదు. సరేకదా, సమయమెంత గడిచిందో కూడా వారికి తెలియడంలేదు. సభ్యుల స్తోత్రపాఠాలు కరతాళధ్వనులు ఎక్కువౌతున్నకొద్దీ మాధురికి ఉత్సాహము అధికమై బాగా విజృంభించి పాడుతోంది.

దూరంగా కూర్చున్న అమ్మసంగతి చెప్పశక్యం గాకుండావుంది. కుమార్ పాటకు సరసులుపొందే ఆనందం చూచినకొద్దీ ఆమె అయోమయావస్థలో చిక్కింది. భవిష్యత్తులో తాను చేయాలనుకొన్న కార్యక్రమాన్ని గురించి గాలిమేడలు తయారుచేస్తోంది. తనలో ఎన్నో కోరికలు కోలాహలంచేస్తున్నాయి.

నౌకర్లు, వంటవారు ఉదయంనుంచి శ్రమపడివుండడం చేత వాళ్ళకుమాత్రం చాలా విసుగుదలగావుంది. ఈగొడవ ఎప్పుడు పూర్తిఅవుతుందా, ఇంటికెప్పుడుపోదామా అని ఎదురుచూస్తున్నారు.

కొంతసేపటికి కుమార్ చేతిగడియారంచూచుకొని మాధురికి చేతితో పాట ఆపమని సూచనచేశాడు. పాట కచేరీ ఆగిపోయింది. వెంటనే వంటవాళ్ళులేచి బల్లమీద భోజనపదార్థాలను ప్లేట్లతో తెచ్చి ఏర్పాటుచేశారు. అందరు కూర్చుని తినడానికి ప్రారంభించారు. మాధురికి ప్రత్యేకంగా కుమార్ ప్రక్కనే కుర్చీవేశారు. ఆమె ఠీవిగా వచ్చి కూర్చుని అందరితోపాటు ఆరగించడం సాగించింది. వంటవారు పదార్థాలను మారువడ్డన చేశారు.

కబుర్లతోను, నవ్వులతోను, కోలాహలధ్వనుల తోను విందుభోజనాలు పూర్తిఅయినాయి. తరువాత బుడ్లు,

గ్లాసులు వచ్చాయి. విదేశపుసరుకు. ఖరీదు అధికం. నౌకర్లు గ్లాసులలోనింపి అందరికి అందిస్తున్నారు. మాధురికిగూడా గ్లాసు అందించారుగాని ఆమె ఇంకా సురాపానపుగోడవలో దిగలేదు. అందుచేత ఎంతమంది ఎన్నివిధాల బలవంతం చేసినా అంగీకరించలేదు. సభ్యులందరూ తలకు మూడు నాలుగుచొప్పున గొంతునిండేటట్లు తాగి సురాపాన వినోదాన్ని జయప్రదంగా పూర్తిచేశారు.

పార్టీ దిగ్విజయంగా జరిగింది. ఖాళీఅయిన సారా బుడ్ల దొంతరలు దానికి ఎంతోశోభను తీసుకొనివచ్చాయి. అందులోఎక్కువ విశేషమేమంటే, మాధురికి అమితమైన వుత్సాహం చెలరేగింది. వెంటనేలేచి తాను రుచిచూడకుండా గ్లాసులు కొంతమందికి స్వయంగా అందిచ్చింది. అందాలరాసి తనమృదుహస్తాలతో సుకుమారములైన చేతి వ్రేళ్ళతో గ్లాసులు అందిస్తూంటే రశికులంతా అమితానందంతో ధన్యులమైనామని అనుకొంటూ తీసుకొని పూర్తి చేశారు. నేటి గార్డెన్ పార్టీలో మాధురి ఇంతవుత్సాహంగా ప్రవర్తిస్తుందనీ అందరినీ రంజింపచేస్తుందనీ కుమార్ వూహించలేదు. అతని కా సమయంలో మితిలేనివుత్సాహంకలిగింది.

సారాయిప్రభావం సభ్యులమీాద తీవ్రంగాప్రసరించింది. ఎవరికీ శరీరస్మారకంలేదు. పిచ్చివాళ్లైపోయారు. "మాధురి కేవలం అమాయకురాలుగా కనపడే మాధురి-ఒకచోట ఇంతమందిని వెఱ్ఱివాళ్ళనుచేసి ఆడిస్తోంది. ఎంత సాహసం!" అని వారిలో ఒకరిద్దరు కొంచెం స్మృతివున్నవారు ఆశ్చర్యపడుతున్నారు. గంటకుముందు జగన్మోహి

నిగా కనపడ్డ మాధురి ఆ తాగుబోతుల కన్నులకు పెద్దపులి వలె కనపడుతోంది. "ఇంతమందిచేత తాగించి తాను ఒక్క గ్లాసైనా తాగలేదు. ఎంతమోసం! ఎంతచమత్కారంగా తప్పుకొంది" అని అనుకొంటూ తూలిపోతూ ఒకరుమీద ఒకరు పడుతూ అందరు తోటదాటుతున్నారు.

మాధురికి ఇదంతా ఒకవినోదంగా వుంది. "వెళ్ళు. త్వరగా వెళ్ళు. లేకపోతే చాలా ప్రమాదం సంభవిస్తుంది." అని ఆమెహృదయంలో ఎవరో ప్రభోధంచేస్తున్నారు.

మాధురి బయటకువచ్చి డ్రైవరునిపిలిచి రెండు పది రూపాయలనోట్లు చేతులో పెట్టింది. వెంటనే క్షణమాత్రంలో కారుబయలుదేరి వెళ్ళిపోతోంది. వెంటవున్న అమ్మ నౌకరు కూడా మాధురి అంతతొందరగా కంగారుగా ఎందుకువచ్చేస్తోందో తెలుసుకోలేక తెల్లబోతున్నారు.

ఇంటిముందు కారు ఆగింది. ముందు మాధురి, తర్వాత అమ్మ, నౌకరు ముగ్గురూ దిగగానే మోటారువెళ్ళిపోయింది. గడప ఎక్కుతూ అమ్మ అడిగింది. "అమ్మాయీ! నేటికార్యక్రమంబాపతు మొత్తం అంతా ఇచ్చారా?"

"నీకు ఎప్పుడూ డబ్బుగొడవే." చిరాకుతో అన్నది మాధురి.

"అవునమ్మా! కష్టానికితగిన ప్రతిఫలం తీసుకోవద్దా?" అన్నది అమ్మ.

"వారు పారిపోతారా? మనం పారిపోతామా! రేపు

ఎవరిచేతనైన కబురంపితే డబ్బురాదా! అదేమాత్రం కష్టమైనపని?" అన్నది మాధురి.

"మాటిమాటికీ నీకంత కోపంవస్తూంటుందేం?" అన్నది అమ్మ.

"ఎవరికి! నాకా కోపం!" అన్నది మాధురి.

కూతురు ముఖవైఖరిచూచి అమ్మ ఏమీమాట్లాడకుండా తనగదిలోకి వెళ్ళిపోయింది. మాధురికూడ తనగదిలోకి వెళ్ళి గభాలున మంచంమీద కూలబడింది. తలుపు వేసుకొందామనే జ్ఞాపకంకూడా ఆమెకు లేదు.

కొంతసేపు అట్లాగేపడుకొని ఆలోచించినకొద్దీ తన్ను ఏవైపుకు బలవంతంగా తిప్పుతున్నారో, చేస్తూన్న పనేమిటో, మాధురి కొంతవరకూ అర్థంచేసుకోగలిగింది. ఎవరిని తాను తల్లిగా భావిస్తోందో ఆ తల్లి ఎటువంటి స్థితికి తీసుకొని వెళ్ళాలనుకొందో, బంధించివుంచడానికి ఎట్టి వలపన్నిందో, జీవితాన్ని ఎట్టి నీచవ్యాపారంలో గడపడానికి బలవంతం చేస్తోందో, వేశ్యావృత్తి ఎంతనీచమో చక్కగా గ్రహించింది. "ఆహా! విధివిలాసం! భగవంతుడు తన్ను ఎందుకు వేశ్యగా చేసి ఇట్టి నీచవ్యాపారం నాచేత చేయిస్తున్నాడు? ఈవిధంగా నా జీవితం భయంకరమైన అగ్నిగుండములోపడి దహింపబడాలనీ, బ్రతికినంతకాలం నరకయాతన అనుభవిస్తుండాలనే అతని సంకల్పమా? ఈ వృద్ధురాలు నిజానికి నా తల్లేనా? తల్లి అయితే నాచేత డబ్బుకోసం ఇట్టి నికృష్టమైన కార్యం చేయిస్తుందా! యథార్థం ఆలోచిస్తే నేనీ వేశ్యల కులంలో జన్మించానా? లేక ఈ ముదుసలి నన్ను బలవం

తంగా వేశ్యనుచేసిందా? ఛీ! ఛీ! ఈవిధంగా వ్యభిచార వృత్తిలో ప్రతివాడిదగ్గర ఆడుతూపాడుతూ జీవితంగడపడం నాకేమీ ఇష్టంలేదు. భగవానుడా! ఈ భయంకరజ్వాల నుండి నన్ను రక్షించు. ఈపాపిని, పిశాచిని!..........."

మాధురి ఇంకా అదేవిధంగా ఆలోచిస్తూనేవుంది.

"ఈ చీకటికొట్లోంచి రక్షింపబడతానా? రక్షింపబడ గలనా? ఎటువంటి అవకాశంగాని ఆశగాని లేదు. నేనొక అజ్ఞానురాల్ని. ఆడుదాన్ని. దైవం యౌవనసౌందర్యాలను ప్రసాదించాడు. కాని ప్రపంచకం నాకు వేశ్యలలో స్థాన మిచ్చింది. పురుషులు సమర్థులు. మొదటినుండీ ఈ పురుష జాతి బలవంతమై వృద్ధిపొందుతోంది. వారు ఏమిచేయాలను కొన్నా చేయగలరు. చేస్తారు. ఇక ఆడుదానిగతి? పురుషుల కామతృష్ణను తీర్చే ఒక ఆటబొమ్మ. విలాసవస్తువు. కాలో చితంగా మగవారు మాట్లాడే ఇచ్ఛకాలకు, చూపించే ఆశ లకు లోబడి వారిచేతులలో కీలుబొమ్మై పడివుండాలి. వ్యభి చారంచేసే పురుషుడికి సంఘంలో స్థానంవుంది. వానివలన మోసపోయిన స్త్రీనిమాత్రం సమాజం బహిష్కరిస్తుంది. ఎంతదుర్మార్గం! ఆడుదిగా పుట్టడం ఎంతదురదృష్టం! ఈ దురవస్థలోంచి తప్పించుకొని బయటపడే మార్గంలేదా! వుంటేమాత్రం ఆమార్గం చూపించేవారెవరు? కుమార బాబును నేను ప్రేమిస్తున్నాను. ఆయనకూడా నన్నుప్రేమి స్తున్నాడు. చివరకు నేనొక వ్యభిచారిణిగా, వేశ్యగా నిర్ణ యంకావడం, నా గౌరవంఅంతా మట్టిలో కలవడమేనా? ఈ ప్రేమయొక్క పరిణామదశ? అందులో ఎవరిఎదుట?

నన్ను ప్రేమించానని చెప్పే కుమార్ ఎదుటేనా! అతని దృక్ప థంలోనే ఈ క్రియాకలాపమా! లోకంలో గృహస్థులంతా తమభార్యలు అగౌరవంపొందుతూంటే చూస్తూండగలరా? కుమార్‌కు నేను పెండ్లి చేసుకొన్న భార్యనేఅయితే నాచేత ఇట్లాచేయిస్తాడా? అతని ప్రేమలో కపటమేలేకపోతే సభలో నేను నడిపిన కార్యక్రమాన్ని అంతవుత్సాహంగా కన్నులు తెరిచి చూస్తూ ఎందుకు వూరుకుంటాడు? నన్ను హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నానని అతను అనడం-నేను వినడం ప్రతిదినం జరుగుతూన్నదే కానీ అతనిమాటలు సత్యదూరా లనీ, అతని ప్రేమ కపటమనీ, అనుమానించకతప్పదు. ఛీ! కుమారబాబు ధనాఢ్యవ్యక్తి, సంపన్నగృహస్థు అయినం దుకు తనయెత్తుకు తగినట్లు పెద్దమనుష్యులుచేసే పనిచెయ్య లేదు. పరస్థలానికి నన్ను పిలిపించి ఇట్లాంటి దుస్థితికలగ చెయ్యడం ఎంత చెడ్డపని? ఇదెంతమాత్రం క్షమించతగింది కాదు. కుమార్! నేను నిన్నే కోరుతున్నాను. ప్రేమించాను. ప్రేమిస్తున్నాను...... కాని ఈ తప్పుకు ఒకానొకదినం నువ్వే ప్రాయశ్చిత్తంచేసుకోవలసివుంటుంది...........

ప్రాయశ్చిత్తమా! కుమార్ ఎంతోచక్కనివాడు. నేనో! అతని పాదాలదగ్గరవుండే దాసీతోనైనా పోలను. అటువంటి నన్ను సుందరీ! అని పిలుస్తాడు. నే నెంతభాగ్య వతిని? ఎంత అదృష్టవంతురాలను? కుమార్! నువ్వు నన్ను ప్రేమించావు. నీచేత నేను ప్రేమింపబడ్డాను..........

...ఆఁ! ఏమంటున్నాను! ఛీ! తిరిగి మామూలు పాటేనా! అతనిపేరు మాటిమాటికి నోటితో ఉచ్చరించడం

దేనికి? లేదు. ఇకమీాద నా నోటితో అతనిపేరు ఉచ్చరించను. ఈ అప్రతిష్ఠ భరించను. జీవితంయొక్క దృక్పథాన్ని మార్చే స్తాను. స్త్రీజాతికి సహనశక్తి సహజంగాఉంటుంది. నా స్వశక్తిమీాద ఆధారపడి ముందుకార్యక్రమం నడిపిస్తాను.

ఇటువంటి అప్రతిష్ఠను సహించను. ఎన్నటికీ ఆత్మ గౌరవానికి భంగంరానీయను. చూదాం. భవిష్యత్తు ఎట్లా ఉంటుందో"

ఈవిధంగా ఆలోచించుకొంటూ పడుకుని నిద్ర పోయింది.

మాధురి హృదయంలో ఎంతబాధపడుతోందో ఎవ రికి తెలుస్తుంది?

# 5

కొంతకాలంనుంచి నేషనల్ ఫిలింకంపెనీవారిపేరు దేశంలో చాలా వాడుకలోఉంది. వారు నిర్మింపజేసిన చలనచిత్రాలు వేలకొలది జనాన్ని ఆకర్షిస్తున్నాయి. కారణమేమనగా, మిస్ లిలీ అనేపేరుగల సౌందర్యవతి ఆ ఫిలింకంపెనీలో నటించడమేగాక సహజ మధుర కోకిల గానంతో ప్రపంచకాన్ని మోహింపచేస్తోంది. ఆ కంపెనీ వారు ఆమె అభిప్రాయాలకు గౌరవానికీ భంగంకలుగ కుండా చాలా ఆదరంతో చూస్తున్నారు. ఆమెను ఫిలిం కంపెనీవారు ఇంకోచోటికి వెళ్ళనీయకుండా ఆమె ఉద్దే శ్యాలకు అంగీకరించి తమకంపెనీలో పర్మినెంటుస్టార్ గా

ఉంచేశారు. అనగా ఆ ఫిలింకంపెనీవారు తీసే చిత్రాలన్నీ ఆమెయొక్క వేషభాషా, గానాభినయాలమీద ఆధారపడి ఉన్నాయని గ్రహించాలి.

ఫిలించూడడానికి వచ్చిన ప్రేక్షకులందరూ ఆమె వేషాన్ని చూచి, పాటనువిని, అభినయానికి ఆనందించి వాహవా! శభాస్! భేష్! అంటూ విపరీతంగా స్తోత్రాలు చేస్తూంటారు. ఇన్నిమారులుచూసినప్పటికీ జనానికి లిలి ఎవరు? ఈమె ఎక్కడనుంచి వచ్చింది? మానవాంగనయా, లేక దేవకాంత దిగివచ్చిందా? అన్నసందేహాలు కలుగుతూనేఉంటాయి. ఈమె తప్పక దేవకన్యకగాని మనుష్య స్త్రీకాదు. మనుష్యులకిట్టి శక్తిసామర్థ్యాలుండవని చాల మంది నిశ్చయించారు. మరియు లిలీపేరుమీద నేషనల్ ఫిలింకంపెనీవారు దేశంలో చాల గౌరవం, ధనం సంపాదించారు.

సినీమాలో ఆమెపార్టు వచ్చేసరికి చూడవచ్చిన స్త్రీ, పురుష, బాల, బాలికలందరూ తదేకదీక్షతో తెరవైపు చూస్తూంటారు. హాలుఅంతా నిశ్శబ్దం. నోరుతెరిచి ప్రక్కనున్నవానితో రహస్యంగానైనా మాట్లాడడానికి సాహసం ఎవరికీ ఉండదు. అంత ఆసక్తితోవింటూ ఇతరవిషయాలు కూడా మరిచిపోతారు. సినీమాలను చూచే రశికులంతా అనేకగ్రామాలలోంచి వచ్చి వారందినములు ముందుగానే తమసీట్సు రిజర్వుచేసుకుని వెళ్తూంటారు. ఆరీతిగా చేయకపోతే అనుకొన్ననాటికి హాలులో ప్రవేశందొరకడం కష్టమే

ఆవిధంగా మిస్ లిలీ అందరిహృదయాల్లో స్థానం సంపాదించింది.

చాలాచిత్రాల్లో లిలీ నటించింది. ఆమె నటించిన ప్రతి చిత్రం ప్రేక్షకుల పొగడ్తలను సంపాదించింది. వేలకొలది జనాన్ని ఆకర్షించింది. దానిలో శకుంతల చిత్రం ప్రత్యేకతను ఆర్జించింది. ఆ చిత్రంలో లిలీ శకుంతల వేషం వేసి చాలా ఆకర్షణీయంగా, ఎంతో సహజంగా స్వాభావికంగా నటించింది. చూచిన ప్రతివ్యక్తి ఇది నటనకాదు, నిజమైన శకుంతల దిగివచ్చిందా! అని భ్రమించాడు. అందుచేత మిగతా ఫిల్ములకన్న శకుంతల చిత్రం చాలకాలం నడిచింది. చూచినవాడే పదిసార్లు చూస్తున్నాడు. ఎన్నాళ్ళు చూచినా జనానికి తృప్తి తీరడంలేదు.

ప్రచండవేగంతో వచ్చే ఝంఝూమారుతంవలె ఆకస్మికంగా ఈ లిలీ ఎక్కడనుంచి వచ్చిందో, ఈమె జన్మస్థానం ఏదో తెలుసుకోడానికి చాలామంది ప్రయత్నించారు. కాని, వారి ప్రయత్నాలన్నీ వ్యర్థమైనాయి. ఎవరినోటి నుండి విన్నా ఈమెనుగూర్చిన ప్రసంగమే. పట్టణాలల్లో ఈమె సంగతి అట్టుడికినట్లు ఉడికిపోతోంది. విశ్వప్రయత్నము చేసినా ఆమె వృత్తాంతం కొంచెమైనా ఎవరికీ తెలియలేదు. ఈపరీక్షలో ప్రవేశించిన వారందకీ మార్కులు సున్నా అయినాయి.

మానవతత్వంలో అనేక భేదాలు ఉన్నాయి. ఒకొక్కక వ్యక్తి చాలా విచిత్రమైన ప్రకృతికలవాడై ఉంటాడు. ఏదైనా చిక్కుసమస్యలో పడ్డాడాఅంటె దానిని

సాధించేవరకూ, ఆ రహస్యాన్ని తెలుసుకొనేవరకు నిద్రాహారాలు సరిగా తీసుకోడు. నిద్రపోడు. రాత్రులు పగళ్ళు అదే చింత. ఈరకం మనుష్యులు కొంతమంది ఉంటారు. వారి మనస్తత్వాలు అలా ఎందుకు ఉంటాయో వారికీ తెలియదు. ఇతరుల కంతకంటే తెలియదు.

ఆ దినం శకుంతలచిత్రం చూడడానికి వేలకొద్దీ జనం వచ్చారు. హాలులో సూదిమోపడానికైనా స్థలంలేదు. కిటకిటలాడిపోతోంది. జనంఅంతా ఆట ఎప్పుడు ప్రారంభమౌతుందా అని చూపులు తెరవైపుకుతిప్పి ఆదుర్దాతో ఎదురుచూస్తున్నారు. వారి కాసమయం నిమిషమొక సంవత్సరంగా గడుస్తోంది. ఆట ప్రారంభించే సమయంకాగానే గంటమోగింది. దీపాలు ఆరిపోయి హాలంతా అంధకారమైంది. వెంటనే తెల్లని తెరమీద ఛాయాచలనచిత్రం గోచరించింది. జనమంతా నిశ్శబ్దంగా సావధానంగా కూర్చుని చూస్తున్నారు. అంతలో ప్రశాంతమైన వాతావరణంతో కూడియున్న కణ్వమహాముని తపోవనం, అందులోఉన్న పుష్పవాటిక, కనబడింది. కాషాయాంబరధారిణియై, నియమితేంద్రియయై, లజ్జ, సౌమ్య, సౌశీల్యభావాలు ముఖాన గోచరింపచేసూ ఒక సౌందర్యరాశియైన దేవీమూర్తి చేతిలి కత్తెలతో పూలమొక్కలకు నీళ్ళు తోడిపోస్తోంది. శకుంతల! శకుంతల అనుకుంటూ జనం రెప్పవాల్చకుండా చూస్తున్నారు. వారికళ్ళ కామె వేషధారిణిగాగాక నిజమైన శకుంతలగానే కనిపిస్తోంది. ఈ వేషధారిణి పేరు లిలీ అనే జ్ఞానాన్నే వదిలిపెట్టేశారు. ఆ సౌమ్యత, లావణ్యాము,

మాధుర్యము, సిగ్గుతో సగము వంచుకున్న ఆ వదన సౌందర్యం, బ్రహ్మచర్య వ్రతనిష్ట-అన్నీ ఒక్కమాటుగా ఆ స్వరూపంలో గోచరించాయి. ఎంతో స్వాభావికంగా ఉందిగాని కృత్రిమలక్షణం ఎక్కడా గోచరించడంలేదు. అత్యాసక్తితో చూస్తున్నారు. మధ్య విశ్రాంతికాలం వచ్చినా ఎవరూ లేవలేదు. హాలులోంచి ఒక్కవ్యక్తికూడా లేచి అవతలకు వెళ్ళలేదు. బయటికివెళ్ళిరావాలనే సంకల్పం కూడా వారికి కలగలేదు. సరిగదా ఈ విశ్రాంతికాలం ఎందుకు వచ్చిందా! అని అంతా విసుగుదలతో ఉన్నారు. పదినిముషాలు పూర్తికాగానే ఆట ప్రారంభమైంది. ఆవిధంగా కూర్చున్నదిమొదలు ఆట పూర్తి అయ్యేవరకూ ప్రతివాడు లేవక శ్రద్ధతో దీక్షతో చూశాడు.

ఆట పూర్తిఅయింది. ఆట అప్పుడే అయిపోయిందా! అన్న అసంతృప్తితో జనమంతా లేచి వెళ్ళుతున్నారు. ప్రతి వారినోట శకుంతలపాత్ర ధరించిన "లిలీ" ప్రశంసయే విన పడుతోంది. ప్రేక్షకులంతా ఎవరితోవను వారు వెళ్ళిపోయి నారు. కాని ఒకవ్యక్తిమాత్రం వెళ్ళక హాలుబయట నిల్చుని చూస్తూ మధ్య మధ్య హాలుచుట్టూ తిరిగి ఎవ రినో వెదుకుతున్నట్లు నటిస్తున్నాడు. అతడెవరో ? ఎవరి కోసం వెతుకుతున్నాడో ఎవరికీ తెలియదు. కొంతమంది అక్కడివారు ఆ వ్యక్తినిచూచి శకుంతలనుచూచి పిచ్చి వాడైనాడా అని అనుకుంటున్నారు.

కొంతసేపావ్యక్తి ఆవిధంగా తిరిగి తిరిగి హాలుమేనే

జరున్న ప్రదేశానికివచ్చి నమస్కారంచేసి "అయ్యా! ఈ హాలు ఎవరిది?" అని అడిగాడు.

"నేషనల్ ఫిలిం కంపెనీవారిది" అని చెప్పాడు మేనేజరు.

"మిస్ లిలీ ఈ ఫిలింకంపెనీలోని తారయేనా?" అని మళ్లీ అడిగాడు ఆవ్యక్తి.

"ఔను ఆమె ఈకంపెనీలోనేఉంది. ఎందుకు అడుగుతున్నారు?" అన్నాడు మేనేజరు.

"అయ్యా!ఒకసారి నేను మిస్.లిలీని కలుసుకోగలనా" అని అడిగాడు ఆవ్యక్తి. ఆమాటవిని మేనేజరు ఆశ్చర్యపడుతూ ఆవ్యక్తితో "లిలీని కలుసుకోవడమా?" అన్నాడు మేనేజరు.

"ఔనండి. నేను ఆమెను ఒకసారి చూడాలి" అన్నాడు ఆవ్యక్తి.

"ఆమెను చూడడం, ఆమెతో మాట్లాడడం అంటే అంత తేలికగా ఉందనుకున్నారా? అది చౌకబేరం కాదు. సాధ్యమయ్యేపనికాదు. ఎంతోమంది విశ్వప్రయత్నం చేసి వ్యర్థంగా తిరిగి వెళ్ళిపోయారు. కంటితో చూడడానికైనా ఎవరికీ సాధ్యంకాలేదు" అన్నాడు మేనేజరు.

"నేను చౌకబేరంగా మీతో మాట్లాడడానికిరాలేదు. ఇదుగో ఈ అయిదువందల రూపాయల కరెన్సీ తీసుకొని నేనామెను కలుసుకొని మాటాడగలిగే సదుపాయం చెయ్యండి" అన్నాడు ఆవ్యక్తి.

"అయ్యో! క్షమించండి. చౌకబేరం అనగా మీరు వేరే అభిప్రాయపడ్డారు. నా ఉద్దేశ్యం అదికాదు. ఆమె ఎవరికీ అట్టి అవకాశం ఇయ్యదు. కూర్చోండి. ఒక సంగతి చెపుతాను."

ఆ వ్యక్తి ఎదురుగాఉన్న బల్లమీద కూర్చుని "చెప్పండి. ఏమిటాసంగతి?" అన్నాడు.

"మిస్ లిలీ ఒకషరతు ఏర్పాటుచేసుకొంది. 'నేనెవరినీ కలిసిమాట్లాడను. నాకోసం ఎవరైనావస్తే నానిశ్చయం వారికి తెలియజేసి ఆవలకు పంపించండి. అంతేగాని నాదగ్గరకు పంపవద్దు.' అని కంపెనీవారితో షరతుపెట్టింది. అందుచేత——మీ డబ్బు మీరు తీసుకోండి" అన్నాడు మేనేజరు.

"ఇది నా స్వల్పబహుమతి. దీనిని మీరు తిరస్కరించవద్దు"అన్నాడు వ్యక్తి.

"నేను మీకు ఏవిధంగా ఉపకారంచేయగలనో నాకు అర్థంకాలేదు. మీకోర్కె చెల్లించడానికి దోవ కనపడటంలేదు. మీ విషయం ఆమెతో చెప్పడానికైనా ఎట్టి అవకాశం నాకు లేదు. ఈ ఋణం నాకెట్లా తీరుతుంది?" అన్నాడు మేనేజరు.

"ఋణంతీర్చడం అనే విషయం వదిలిపెట్టండి. ఈ స్వల్పానికి మీరట్లా ఆలోచించవద్దు. ఆమె ఎవరు? ఎక్కడ ఉండేది? ఇక్కడకి ఎట్లావచ్చింది? ఈ విషయాలు మీకేమైనా తెలిస్తే చెప్పండి" అన్నాడు వ్యక్తి.

"ఆమె సంగతి తెలుసుకోవాలన్న ఆదుర్దాతో మీరు

అడుగుతున్నారు. కాని మాకేమీ తెలియదని చెప్పవలసి వచ్చినందుకు విచారపడుతున్నాను. లిలీ తన స్వవిషయం మాకెవరికీ తెలియజేయలేదు. మా ఊహకు, తోచిన విషయాలు ఒకటి, రెండు చెప్తాను వినండి-ఇంట్లో పెద్దవారికి ఆమెకు సరిపడకపోవడంచేత ఏదో ఘర్షణ వచ్చివుంటుంది. అనగా తల్లితో పోట్లాడిందని నా ఊహ. దానితో ఇంట్లో చెప్పకుండా పారిపోయివచ్చిందని అనుకొంటున్నాము. ఇదంతా మా అనుమానం. ఒకవేళ ఇది నిశ్చయం కాకపోవచ్చును. షూటింగ్ జరిగే సమయంలోకూడ ఆమె పరులను రానీయదు. పురుషులకు చాలా దూరంగా ఉంటుంది. కొత్తగా వచ్చినప్పుడు మేనేజింగ్ ప్రొప్రైటరు ఆమెను పాడమన్నారు. రెండు, మూడు మాటలు పాడింది. చాలా బ్రహ్మానందంగాఉంది. పాటకుతగిన రూపంకూడాఉంది. ఇహ నేంకావాలి? ఆమె చెప్పిన షరతులకన్నింటికీ అంగీకరించి ఆమెను పర్మినెంటుఆర్టిస్టుగా బుక్ చేశాడు. పార్టుసమయంలోనూ రిహార్సల్సు, షూటింగు సమయంలోనూతప్ప మిగతా కాలంలో స్టూడియోకురాదు. ఎప్పుడూ ఏకాంతంగా ఉంటుంది. పరిస్థితులనుబట్టి ఆమె గొప్పయింటి ఘోషాస్త్రీ ఏమోఅన్న ఊహ కలుగుతూంటుంది. ఆమెయింట్లో స్త్రీ సేవకురాండ్రేగాని పురుషులు లేరు. ఇతరులు ఎంత పెద్దమనిషి, ఎంత గొప్పవాడు వచ్చినా కనపడదు. మాట్లాడదు. తాను ఏర్పరచుకొన్న హద్దులుదాటి వీసమైనా ఈవలకురాదు. అందుచేత అందరూ ఆమెను చాలా గౌరవంగా భక్తిశ్రద్ధ

లతో చూస్తూంటారు. మీకూ "లిలీ" సంగతి తెలుసుకో వాలన్న అవసరం దేనికి ?" అన్నాడు మేనేజరు.

"అంత పేరుప్రఖ్యాతులను సంపాదించి, దేశం మొత్తం మీద కీర్తిని మూటకట్టిన ఆ నారీమణిని చూడాలన్న ఊహ ఎవరికి ఉండదు? విద్యావంతుడైన ప్రతిపురుషునకు అట్టి కళా స్వరూపిణితో ఒకటి రెండు నిముషాలు మాట్లాడాలని ఉంటుంది. సరే ఇప్పటికి ఇంతవరకు తెలిసిందిగదా. సెలవు తీసుకుంటాను. అవసరంవస్తే మళ్ళా కలుస్తాను. థేంక్ యూ-గుడ్ బై" అన్నాడు ఆ వ్యక్తి.

"గుడ్ బై, గుడ్ బై, మెనీ మెనీ థేంక్స్. మై గుడ్ ఫ్రెండ్!" అంటూ మేనేజరు ఆ వ్యక్తితో షేక్ హ్యాండ్ చేశాడు.

*　　*　　*

ఆ వ్యక్తి నిరాశాబద్ధుడు కాలేదు. అతి సాహసంతో తన ప్రయత్నాన్ని కొనసాగించాలని చూసున్నాడు. ఇవాళ కాకున్న రేపు, తప్పితే ఎల్లుండి, కాకపోతే ఇంకా కొన్నిదినాలకైనా తన వాంఛ నెఱవేరదా! అన్న దృఢ నిశ్చయం ఉంది. ఎన్నటికైనా ఆమెను కలిసి మాట్లాడగల నని అతనిధైర్యం. ఈ నిశ్చయంతో అతను ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు.

డబ్బుతీసుకొన్న విశ్వాసంతో మేనేజరు అతనికి కావ లసినసాయం చేస్తూనే ఉన్నాడు. ఒక దినం "లిలీ"కి ఈ విధంగా జాబు వ్రాశాడు.

"ఒకగొప్ప జమీందారు మిమ్మల్ని కలుసుకోవాలని

కోరుతున్నాడు. అతడు మీా గొప్పతనాన్నిగూర్చి చాలా పొగడుతూ ఒక్కసారి కలుసుకొని మాట్లాడాలనే కుతూహలం అధికంగా ఉందని అన్నాడు మీా అనుజ్ఞ అయితే ఒక్కసారి మీా దర్శనంచేసి నాలుగైదు నిముషాలకాలం మీాతో ప్రసంగించాలని ఉత్సాహపడుతున్నాడు. ఆయన కోరిక నెరవేర్చాలని నా ప్రార్థన."

—అని వ్రాసిపంపగానే వెంటనే లిలీ, ఈ విధంగా జవాబువ్రాసి పంపించింది. "ఆయనకోర్కె తీర్చలేనందుకు చాలా విచారపడుతున్నాను. ఇతరులతో కలిసిమాట్లాడాలనే ఉద్దేశ్యాన్ని నా మనస్సులోంచి తప్పించేశాను. ఆయన నన్ను పొగడుతున్నారని విని సంతోషించాను. నామీాద వారికిగల అనుగ్రహానికి అనేక ధన్యవాదాలు సమర్పిస్తున్నాను. నా తరఫున మీారే వారికి నమస్కారం సమర్పించి పంపించి వెయ్యండి. అంతేగాని నేను వారిని కలుసుకోడానికి అంగీకరించను.''—మేనేజరుఆజవాబును ఆయనకుఅందచేశాడు. లిలీ వ్రాసిన ప్రత్యుత్తరం చదువుకోగానే అతనికెంతో విచారంకలిగింది. అతను హృదయానికి గొప్ప గొడ్డలిపెట్టువలె తగిలింది. లిలీని చూడడానికి ఎంత ఆదుర్దాగా ఉన్నాడో ఆమె కేమితెలుస్తుంది ? ఎవరు తెలియజేస్తారు ? అతని మనస్సుకు నిరాశకలిగింది. సర్వవిధముల ప్రయత్నించాడు. ఆమె దర్శనంకోసం ఆమెతో మాట్లాడడానికీ రూపాయలను మంచినీళ్ళవలె ఖర్చుపెట్టాడు. నౌకరు మొదలు మేనేజరువరకు ఇంకా ముఖ్యమైనవారందరికీ లంచాలిచ్చాడు. కాని ఏమిలాభం? ప్రయత్నంఅంతా వ్యర్థ

మైంది. లిలీ స్పష్టంగా జవాబు చెప్పింది. ఆమెను కలుసుకోడం అసంభవమన్న సంగతి తెలియగానే ఇక జీవించి లాభం లేదనుకొన్నాడు. ఆమె తనతో వుండే సహకర్మచారులు నట నటీవర్గంతో గాక ఇతరులతో మాట్లాడదన్న విషయం అతని సర్వాశాపాశాలనూ ఒక్కసారిగా నాశనం చేసింది. ఇంత కఠోరమైన నియమం ఆమె ఎందుకు వహించిందో ఆమెకే గాని ఇతరులకెవరికీ తెలియదు

గొంతులో ప్రాణంవున్నంతవరకూ అతడు తన ప్రయత్నం సాగించడానికే నిశ్చయించాడు. లిలీవున్న భవనం చుట్టూ ఎన్నిసార్లో తిరిగివస్తున్నాడు ఒకసారి ఆమె మేడ పైభాగంమీద నిలువబడివుండగా చూశాడు. స్వరూపం కనపడినతర్వాత అతని వుత్సాహ, వుద్రేకాలు నాలుగు రెట్లు విజృంభించాయి. తనకోర్కె తీరుతుందన్న వుత్సాహం తిరిగి తలెత్తడం ప్రారంభించింది. తాను ఎన్నిదినాలనుంచో చూడాలని కోరుతూన్న స్వరూపం కంటికి గోచరించగానే కలిగిన సంతోషానికి మితిలేకపోయింది. తనఊహ సఫలం అవుతుందన్న నమ్మకం కలిగింది. ధైర్యసాహసాలను వదిలిపెట్టకుండా తిరిగి మహాప్రయత్నంచేశాడు లిలీకోసం. ఇతడు పిచ్చివాడైపోతాడేమో అన్న నమ్మకంకూడా కొంత మందికి కలిగింది. కాని అంతదీక్షతో చేసినప్రయత్నం వ్యర్థమౌతుందా?

ఎట్లాగైతేనేమి అతనికి మార్గందొరికింది. వెళ్ళదలచుకొన్న సౌధముయొక్క ద్వారాలు తెరువబడే సమయం వచ్చింది. అదేరీతిగా అంటే విశేషంగా ద్రవ్యంతిన్న విశ్వా

సంతో మేనేజరు పట్టుబట్టి ఆవ్యక్తిని "నేషనల్ ఫిలిం కంపెనీ" లో ఒక ఆర్టిస్టుగా బుక్ చేయించాడు. రిజిష్టరులో పేరు ఎక్కింది.

## 6

నేషనల్ ఫిలింకంపెనీవారికి అదివరకే చాలా గొప్ప పేరువుంది. ఇప్పుడొకవిధమైన కొత్తకళ వచ్చింది. బంగారానికి పరిమళం అబ్బినట్లు పూర్వమున్న కీర్తికి తోడుగా ఒక నూతనశకం ప్రారంభమైంది. ఎందుచేతనంటే, ఆ కంపెనీలో వసంతుడనుపేరుగల కొత్తవ్యక్తి నటుడుగా ప్రవేశించాడు. మిస్ లిలీ కథానాయికగా నటించిన ప్రతిచిత్రంలోను ఇతడు కథానాయకుడుగా అభినయిస్తూంటాడు. ఆ సమయంలో అద్భుతమైన మనోహర దృశ్యం ప్రేక్షకుల కన్నులకు మిఱుమిట్లుగొలుపుతూ కనపడుతూంటుంది. అగ్నికి వాయువు తోడైనట్లుగా వారిద్దరు ఒకచిత్రంలో నటిస్తూంటే అపూర్వమైన శోభ అంతటా వ్యాపిస్తోంది. చూపరుల నేత్రాలు అత్యంత ఆకర్షితములు కావడంచేత ఆనంద భాష్పాల ప్రవాహాన్ని స్రవింపజేస్తున్నాయి. లిలీవసంతుల పాత్రాభినయం చూస్తూన్నంతసేపు "వీరిద్దరూ ఈలోకం వారుకారు. దేవలోకంలోంచి దిగివచ్చారేమో! కాకపోతే ఈలోకోత్తరములైన గానాభినయ సౌందర్యాదులు ఎట్లా వస్తాయి?" అన్న సంశయం మనస్సులోవ్యాప్తమౌతూంటుంది. సాత్త్వికప్రేమకు సర్వాంగసుందరమైన ఉదాహరణం ఇంత

కన్న ఇంకొకటిలేదన్న నిశ్చయజ్ఞానం కలుగుతుంది చాలా మందికి.

ఏ ఫిలింలో లిలీ వుంటుందో దానిలో వసంతుడు కూడా ఉంటాడు. వీరిద్దరును కలిపి కొన్ని చిత్రాలు తయారు చేశారు. వాటన్నింటిలో వీరిద్దరే కథానాయికానాయకులు. వారంత సన్నిహితులై వున్నప్పటికీ ఒకరినొకరు తెలుసుకోవాలని, పరిచయం కలుగజేసుకోవాలని ప్రయత్నించలేదు.

ఒకరివైపు ఒకరు ఆకర్షింపబడుతూన్నప్పటికీ, పరస్పరం మాట్లాడాలని వున్నప్పటికీ సాహసించలేకుండా ఉన్నారు. ఇందుకు కారణమేమో వారిమనస్సులలో ఏముందో, ఎవరికీ తెలియదు. మన్మధునితో సమానమైన రూపం, దృఢమైనదేహం తీర్చినట్లున్న అవయవాలుకల వాడు వసంతుడు. అందుచేత దినాలు జరుగుతూన్నకొద్దీ లిలీ వసంతునివైపు ఆకర్షింపబడుతోంది. అతనితో మాట్లాడాలని నోరు తెరవబోయి లిలీ బలవంతంగా తనహృదయంలోని భావాన్ని ఆపుకొంటోంది. నోటినుండి ఒకమాటగూడా బయటికి రానీయడంలేదు. వసంతుడుకూడా అటిస్థితిలోనే ఉన్నాడు. వసంతుడు వున్నతాశయంకలవాడు. ఎన్నటికైనా తన వుద్దేశ్యం నెఱవేరకపోదని ఊహించాడు. ఆరోజు దగ్గిరలోనే వున్నదని స్థిరపరచుకొన్నాడు.

స్టూడియోలో షూటింగ్ జరిగే సమయంలో వారిద్దరూ చాలా సన్నిహితులై రాధాకృష్ణులు, ఉషా అనిరుద్ధులు, శకుంతలాదుష్యంతులవలె పరస్పరానురాగంతో

నిండివుండే భావాలను అభినయిస్తూంటారు. అయితే ఏమి? ఒకరినొకరు అర్థంచేసుకోడానికి సాహసించలేకపోయారు.

కొన్నిదినాలు ఈవిధంగా గడిచిపోయినాయి. అదృష్టంవల్ల అతడనుకొన్నదినం వచ్చింది. ఒకరివిషయం ఇంకొకరు అర్థంచేసుకొన్నారు వసంతుడంటే కుమారబాబు అనీ, లిలీ అంటే మాధురి అనీ ఉభయులూ తెలుసుకొన్నారు. మాధురికోసం వున్మాదుడైపోయిన కుమార్ ఆదినం ఆవేశంతో మాధురిని పలకరించాడు.

"మాధురీ!" అన్నాడు కుమారబాబు.

"కుమారబాబూ!" అన్నది విస్మయాన్ని వెల్లడి చేస్తూన్నచూపులతో మాధురి.

"నన్ను మరిపించి ఎందుకు పారిపోయివచ్చావు? మీ అమ్మ నీకోసం ఎంతదుఃఖపడుతోందో! ఎంత పిచ్చిదై పోయిందో నీకు తెలుసునా?" అన్నాడు కుమార్.

"అమ్మా! ఛీ!ఛీ! అది నాకు అమ్మ ఎన్నటికీ కాదు. దానిగతి ఏమైపోతే నాకేం? దానిపేరు నాతో చెప్పవద్దు." ఒక్కగుక్కలో అనేసింది మాధురి.

"పోనీ ఆవిషయం వదిలిపెట్టు. నన్ను ఎందుకు మరపించావు?" అన్నాడు కుమార్.

"లేదు! ఎట్లా మరిచిపోతాను? ఏవిధంగా మరిపిస్తాను? నా హృదయాన్ని అడుగు కుమార్! నిన్ను నేను హృదయపూర్వకంగా ప్రేమించాను. ప్రేమిస్తున్నాను. ముందుకూడా ........." అన్నది మాధురి.

"మాధురీ! నీకోసం నేను ఈ వేషంతో ఎన్నిదినాల

నుంచి ఎన్ని అవస్థలుపడుతూ ఇక్కడకు చేరగలిగేనో తెలుసుకొన్నావా?"

"తెలుసు."

"ఏమి తెలిసింది?"

"నువ్వు నన్ను ప్రేమిస్తున్నావన్న సంగతి తెలిసింది."

"ఆ ప్రేమకు ఇదా ప్రతిఫలం?"

"ప్రతిఫలమా!" మాధురి చిరునవ్వునవ్వింది.

కుమార్ మందహాసంతో కూడిన ఆమె లేతగులాబి రెక్కలవంటి పెదవులను వేళ్ళతోపట్టుకొని కంపనంకలిగించాడు.

"మాధురీ!"

"మాట్లాడను."

"కారణం ఏమైనా ఉందా?"

"నువ్వా! నువ్వా! మరీనీ - చాల్లేవెళ్ళు. నేను మాట్లాడను."

"ఓహో! ఇదా సంగతి?"

ఇద్దరు ఒక్కమారే కిలకిలా నవ్వుకొన్నారు. ఆ సమయంలో వారిద్దరిలో ఎంతో అమాయకత్వం గోచరించింది.

"మాధురీ!"

"ఎందుకు?"

"ఈ నాట్యాభినయాల్ని వదిలిపెట్టు. ఎక్కడికైనా వెళ్ళిపోదాం. కాశ్మీర్‌లోఉండే ప్రకృతిశోభ చూడముచ్చటగా ఉంటుందని విన్నాను. కొన్నిదినాలు అక్కడఉండి

ఆ దేశంలో ఉండే సృష్టి వైభవాన్ని కళ్ళార చూచి ఆనందించి వద్దాము."

"అక్కడకు వెళ్తారా?"

"నా వెంట నువ్వు కూడా వస్తే—"

"చాలాదినాలనుండి నేనూ అదే ఆలోచిస్తున్నాను. కాని ఏం చెయ్యను? కంట్రాక్టు ఇంకా ఆరుమాసాలవరకు ఉంది. అది పూర్తి కాకుండా వెళ్ళడం బాగుండదు."

"అట్లాగే చేద్దాం. కంట్రాక్టుసమయం పూర్తి అయిన తర్వాతనే బయలుదేరిపోదాం. ఈలోపుగా ఇంకా ఒకటి రెండు ఫిల్ములు తయారు కావచ్చునా?"

"కావచ్చు. తర్వాత మనం బయలుదేరవచ్చు. ఇంతకూ అన్నమాట నిజమేనా?"

"నామాట ఎప్పుడూ అసత్యం కాదు. నువ్వే నన్ను వదిలిపెట్టి మళ్ళా పారిపోతావేమో!"

మాధురి నవ్వుతూ "నేను పారిపోగలను. పారిపోతాను." అని అన్నది.

"ఎందుకు పారిపోతావు?" అన్నాడు కుమార్.

"నాకు విసుగుదలపుట్టే—"

"నిన్ను విసిగిస్తానా మాధురీ! లేదు. ఎన్నటికీ అట్లా జరుగదు. ప్రేమించడం నిన్ను విసిగించడానికేనా?"

"కాక మరేమి?"

"అయితే ప్రేమించవద్దంటావా?"

"వద్దు."

"నిజమేనా?"

మాధురి అన్నమాట మనస్ఫూర్తిగా నోటినుండి రాలేదు. వస్తే కుమార్ హృదయానికి ఎంతో ఆఘాతం కలిగేది. ఆమె 'వద్దు' అని నోటితో అంటున్నా రెండు పెదవులమీద మందహాసరేఖలు స్పష్టమౌతూన్నట్లు కుమార్‌కు తోచింది. అందుచేత మాధురి పైకి "వద్దు" అనిఅన్నా మనస్సులో ఆమెకు తనమీద సంపూర్ణమైన ప్రేమ ఉందని కుమార్ గ్రహించాడు.

"మాధురీ! నిన్ను ప్రేమిస్తాను. ఎప్పుడూ ప్రేమిస్తూంటాను."

"బలాత్కారంచేస్తే కేసుపెట్తాను. తర్వాత—"

"జైలులో పెట్టిస్తాను. ఆ మాటకూడా అను."

"అంటాను. తప్పకుండా అంటాను."

"మాధురీ! నువ్వు హృదయపూర్వకంగా ఆ మెత్తని పెదవులతో మందహాసంచేస్తూ ఒక్కమాట చెప్పు. నువ్వు నన్ను అపరాధిగా నిర్ణయిస్తున్నావా?"

"ఆహా! నిర్ణయించాను. నిన్ను బంధింపచేస్తాను."

"బంధింపచేయవద్దు. స్వయంగా బంధించు. లేదా ఇంకా చెయ్యదలచుకొన్నదేమో అదికూడా చెప్పు."

"ఉరిశిక్ష వేయిస్తాను."

"ఉరిశిక్షే! సరే. అదీ నాకు అంగీకారమే."

"ఉరికి అంగీకరించావూ?"

"ఎందుకు అంగీకరించనూ? ఇట్లాంటి శిక్ష అందరికీలభిస్తుందా? తనప్రియురాలు ఎదురుగానిల్చుని సుకుమారములైన వేళ్ళతో ఆ ఉరితాడు మెడకుతగిలిస్తూంటే ప్రియుడు

ఆ మాధుర్యమూర్తిస్వరూపాన్ని మనస్సులో తలచుకొంటూ సంతోషంగా ఆ శిక్ష అనుభవిస్తాడు. నాకా గౌరవం లభిస్తుం దంటావా మాధురీ! అట్లాగైతే నిజం చెప్తున్నాను. నాకు ప్రేమవద్దు. ఉరిశిక్షే కావాలి."

"సరే అట్లాగైతే. సంతోషమైందా?"

ఇద్దరూ పరస్పరం బుజాలమీద చేతులు వేసుకొని కిల కిలా నవ్వుకొన్నారు.

* * * *

చూస్తూండగానే ఆరునెలలూ ఆరుదినాలవలె గడిచి పోయినాయి. ఒకనాడు కుమార్ మాధురిని కలుసుకొని మాట్లాడాలని వచ్చాడు. మాధురి కుమార్‌ను సగౌరవంగా ఎదురేగి లోపలికి తీసుకొని వెళ్ళి కూర్చోపెట్టింది. ఏవేవో మాటలు జరుగుతున్నాయి. మాటలసందర్భాన కుమార్, "మాధురీ! కంట్రాక్టు పూర్తిఅయింది కదా!" అన్నాడు.

"అయింది. తరువాత—"

"తరువాత చెప్పేదిఏముంది? కాశ్మీర్ ప్రయాణానికి సిద్ధంగాఉండు."

"మధ్యమధ్యఉండే ప్రసిద్ధములైన పట్టణాల్ని చూస్తూ నెమ్మదిగా వెళ్తే బాగుంటుంది."

"అట్లాగే చేద్దాం."

ఇద్దరిహృదయాల్లో దేశాటనం చెయ్యాలి, కాశ్మీర్ చూడాలి, అన్న వుత్సాహం పొర్లిపోతోంది. సంతోషం సర్వోత్తమస్థానం అలంకరించింది. రెండు ప్రేమోన్మాదహృద యాలు ఏకమై ప్రకృతియొక్క సౌందర్యాన్ని చూచి ఆనంద

తరంగాల్లో మునిగి తేలడానికి సిద్ధమైనాయి. మందమలయానిల విజృంభణంతో ఆకాశానికి కొట్టుకొనిపోయి పక్షులవలె ఎగిరిపోవాలని, సముద్రతరంగాలవలె ఒకరినొకరు సంఘర్షింపబడాలని, వారిద్దరూ ఎంతో ఉబలాటపడుతున్నారు.

కుమార్‌కు నిధి చేతికిచిక్కినట్లుంది. ఇద్దరూ అత్యంత గాఢమైన మైకంలో మునిగిపోయారు. ఈ ప్రేమ ప్రదర్శనం సాత్వికంకాదు, చిరస్థాయికాదు అని అతనికి తోచడంలేదు. సూర్యకిరణప్రసారంలో ముచ్చిబంగారం అసలుబంగారంకన్న ఎంతో ఎక్కువగా ప్రకాశిస్తుంది. అదేవిధంగా ఈ విషాక్తమైన ప్రేమ తాత్కాలికంగా సంభవించి నాల్గుదినాలు మురిపించిపోతుంది. కనుకనే స్వచ్ఛమైన పవిత్రప్రేమకన్న దీనివిజృంభణం, సౌకుమార్యం, ఇందులోని ఆనందం ఎంతో హృదయాకర్షణంగా వున్నట్లు కన్పిస్తుంది, అనేభావం అతనికి గోచరించలేదు. మొత్తంమీద ఇద్దరూ ఒకవిధమైన వ్యామోహపిశాచానికి చిక్కి పిచ్చివాళ్లైపోయారు. ప్రేమలో సంతోషంవుందిగాని కామవాసనలో పరితృప్తిలేదు. పవిత్రమైనప్రేమను పొందగలిగిన వ్యక్తి శాశ్వతమైన ఈశ్వరీయానందమును అనుభవించగల భాగ్యశాలి అవుతాడు. కామవాసన మనస్సును చలింపజేసి నిప్పులో కట్టెలువేసినకొద్దీ కాలిపోవువిధంగా విషయసుఖాలు అనుభవించినకొద్దీ తృప్తిని కలిగించక మోహాదాహాన్ని అధికంచేసి వివేకాన్ని పాడుచేసి మానవుని నిర్వ్యాపారునిగా నిరర్థకునిగా ఒక వెఱ్ఱివానినిగా తయారుచేస్తుంది. ప్రపంచకంలో వాడు రెండుకాళ్ళపశువుగా

ఎన్నుకోబడతాడు. మనుష్యత్వం నశించిపోతుంది. కాని ఏమిచెప్పినా లాభంలేదు. ఆరోజు రావాలి, వానికన్నులు తెరువబడాలి.

తుదకు ఒకరోజున ప్రయాణముహూర్తం కుదుర్చుకొని మాధురీకుమారు లిద్దరూ ఒకేదిక్కుకు ప్రయాణం సాగించారు. వారు ఆనందాన్వేషణకే బయలుదేరిపోయారో లేక ఎండమావులలో దాహశాంతిచేసుకోడానికే ప్రయాణమైనారో ఎవరు చెప్పగలరు?

కుమార్ దేహంవంటివాడు. మాధురి శరీరాన్ని అనుసరించివుండే ఛాయ. వారిద్దరూ ఎందుకు వెళ్తున్నారో గమ్యస్థానం ఏదో ఒకరికీ తెలియదు.

# 7

కుమార్‌కుటుంబం చాల చిన్నది. అతని ధర్మపత్ని పేరు సుషమ. నవవివాహిత. పదునారువత్సరములు వయస్సుదాటింది. నూతన యౌవనావస్థలో ప్రవేశించింది. కుమార్ ఎస్టేటుకు రాణి. అతనితల్లిదండ్రులు కొద్దిదినాల క్రిందనే పెద్దతనంకారణంగా కొంచెం ముందువెనుకగా ఇద్దరూ స్వర్గలోకం అలంకరించారు. అదిమొదలు నిరంకుశమైన యౌవనావస్థఅనే భయంకరమైన నదీప్రవాహంలో పడి కొట్టుకొనిపోతూన్న కుమార్‌నువెనుకకులాగి పట్టుకోగల శక్తి ఎవరికీ లేకుండాపోయింది. తల్లిదండ్రులు జీవించివున్నప్పుడే ఇతను ఏకైకపుత్రుడు కావడం, ఇతరసంతానం లేక

పోవడంచేత చాలా గారాబంగా, భయభక్తులులేకుండా, స్వేచ్ఛగా పెరిగేడు. పిల్లలకు తగిన శిక్షణ ఇయ్యక వాళ్ళ ఇష్టంవచ్చినట్లు వదిలిపెట్టే దాని పర్యవసానం ఏరీతిగా పరిణమిస్తుందో తల్లిదండ్రులకు తెలియనివిషయంకాదు. అందుకనే తండ్రి పిల్లవాని భవిష్యత్తును బాగుచెయ్యాలని ప్రయత్నించాడు. కొంత అదుపులోవుంచి భయంచెప్పి సన్మార్గ ప్రవర్తకునిగా చెయ్యాలని ఊహించాడు. కాని పిల్లవాని బాగోగులమీద దృష్టిలేక కేవలం మమకారమే ప్రధానంగా చేసుకొన్న జ్ఞానశూన్యురాలైన తల్లి భర్తతో "మీరు మాటిమాటికి పిల్లవాణ్ణి కసురుకోవడం, భయపెట్టడం మానండి. నేను అదిచూడలేను. ఒక్కపిల్లవాడు. ముందు వెనుక ఎవరూలేరు. వాడు దుఃఖపడితే నాకు చాలా కష్టంగావుంటుంది. ఇప్పుడు కొంచెం అల్లరితనంగా ఉంటే ఎప్పుడూ అట్లాగేవుంటాడా? మీరెప్పుడూ వాణ్ణి ఏమీ అనవద్దు." అని అన్నది.

భార్య మూర్ఖతకు మనస్సులో నొచ్చుకొని ఆమెకు అనేకవిధాలుగా నచ్చచెప్పాలని ప్రయత్నించాడు. కాని ఆమె ఎంతమాత్రమూ అంగీకరించలేదు. దానితో తండ్రికి అసహ్యత కలిగి "ఎవరికర్మఫలం వారనుభవిస్తారు. నాకెందుకీ గోల!" అనుకొని ఊరుకొన్నాడు. అదిమొదలు కుమార్ వైపు కన్నెత్తి చూడలేదు. దైవబలంవల్ల ఎట్లాగైతే నేమి బి. ఏ. దాకా చదివేడు కుమార్. తరువాత ఆ చదువు వదలి దుస్సాంగత్యప్రభావంచేత చెడుమార్గంలో ప్రవేశించే శిష్యులో అగ్రగణ్యుడైనాడు.

కుమార్‌కు చాల గొప్పజమీందారీవుంది. నగలు గాని రొక్కంగాని కొన్నిలక్షలు విలువవుంటుంది అతని ఎస్టేటుకార్యక్రమం నిర్వహించడానికి ఒక దివాను, కొంత మంది గుమాస్తాలు, బంట్రోతు, సేవకుడు, వంటమనిషి, దాసదాసీజనం ఏర్పడివున్నారు. ఇట్లాంటి వైభవంతో విశాల సంపత్తుతో తులతూగుతూ నవయవ్వనంలో విషయలాల సుడై ఊగులాడుతున్న కుమారునకు సుషమ భార్యగా నిర్ణయమైంది.

సుషమ సౌందర్యవతి. సౌమ్యత, సదాచారము, శీలము, శ్రద్ధ మొదలగు సద్గుణసంపత్తిగల భక్తిమయి. మూర్తీభవించిన ప్రేమస్వరూపిణి. అయితే ఏమి? ఆమె గుణాలు కుమార్‌కు నచ్చలేదు. తన ధర్మపత్నిలోవున్న గొప్పతనాన్ని గ్రహించలేకపోయాడు. "పొరుగింటి పుల్ల కూర రుచి" అన్నట్లు చిల్లరవిషయాలకోసం పరుగుపెట్టే అతనిహృదయం ఇంట్లోవుండి తనకోసంఎదురుచూచే భార్యా రత్నముయొక్క గంభీరమైన, అపారమైన, ప్రేమామృతాన్ని ఆస్వాదించలేకపోయింది. దీనికి ఆమె బలహీనతయో లేక అగాధమైన ఆమెహృదయభావాన్ని అర్థంచేసుకొని కలిసిమెలిసి అర్ధాంగరాజ్యలక్ష్మితో సుఖపడే శక్తిధైర్యాలు కుమార్‌కు లేకపోవడమో ఏదోఒకటి కారణమైవుంటుంది. మొత్తంమీద కుమార్‌కు భార్యమీద ఏమాత్రమూ అను రాగం లేకుండాపోయింది నిర్దోషి, నిరపరాధిని, సచ్చరిత్ర యైన సుషమయొక్క సుకుమారహృదయానికి శాంతిలేకుండా పోయింది.కుమార్ ఆమె మృదుతరమైన మనోలతను ఉపేక్ష,

ఉదాసీనత అనే వాడిఖడ్గాలతో ఖండించాడు. నిర్దయారూప దావానలాన్ని రగుల్కొల్పి దగ్ధంచేశాడు...ఆమె మెదడులో హాహాకారం, భయంకరమైన విచారమనే తుపాను చెలరేగుతోంది.

భర్త తనవిషయంలో విముఖుడుకావడానికి కారణం కొంతవరకూ సుషమ ఊహించుకోగల్గుతోంది. అందుచేత ఆమె అసావధానంగా ఉండడంలేదు. అట్లా అజాగ్రత్తతో ఉండే స్వభావంకూడా కాదు, ఆమెది. మనోవాక్కాయ కర్మలచేత భర్తను సేవించడమే పుణ్యస్త్రీకి పరమధర్మ మనే విషయాన్ని పుట్టింట ఉన్నప్పుడు శ్రద్ధగా నేర్చుకొన్నది. అందువలన పతియొక్క మంచితనాన్ని సంపాదించుకోడానికిగాను చాలాప్రయత్నంచేసింది. కాని లాభం లేకపోయింది. ఆమెలక్షణాలు అతనికి నచ్చలేదు. రాను రాను విషమపరిస్థితులు ఏర్పడి ఆమెను పడగొట్టడానికి సిద్ధపడుతూంటే సాధ్యమైనంతవరకు ఆమె పడకుండా ఉండడానికి ప్రయత్నిస్తోంది. ఎంతప్రయత్నించినా ఒకనాటికి తనకు పతనం సంభవిస్తుందేమోఅన్న భయం ఆమెకు తప్ప లేదు.

సుషమ కుగ్రామవాసినియగు గ్రామీణకన్యయగుటయే ఆమెయందుగల దోషము. కుమార్ తండ్రి పట్టణవాసపు నాగరకతా విలాసవాతావరణంలో ఊగులాడుతూండే కన్యకలవదలిపెట్టి పల్లెటూరిలోపుట్టిన,ధర్మభీరువైన, గుణవతియైన, శీలవతియైన కన్యకామణిని కోడలుగా జేసుకోడంలో ఆయన అభిప్రాయం — తనకుమారుని

చిత్తవృత్తి తెలుసునుగనుక ఎన్నటికైనా భోగవిలాసాల్లో మునిగి ఉచితానుచితాలను మరచి తిరుగుతూండే తనయుడు బాగుపడాలంటే పల్లెటూరిలోపుట్టిన సత్కులప్రసూతయగు కన్యక కోడలై తేనేతప్ప వేరుమార్గంలేదని నిశ్చయించి అట్లా చేశాడు. ఊహించడంలో ఏమీ దోషంలేదు. కాని జరిగే పర్యవసానమే వ్యతిరేకమౌతుంది. తత్రాపి ఈదినాల్లో ఆంగ్లవిద్యాధికులైన యువకులంతా "అప్ టూ డేట్ – ఎడ్యుకేటెడ్" లేడీస్టూడెంట్లనే ఎక్కువగా ప్రేమించడం జరుగుతోంది. చక్కదనంతోపాటు ఆధునిక విద్యావిధానం, అందుకు తగినశిక్ష, తదనుకూలమైన నాగరికత, విలాసలాలసత్వం కొంతవరకైనా భరతనాట్యాభినివేశము, అధమము సినిమా సంగీతమైనా పాడగల్గిఉండుట, ఇవియే ఈకాలపు నవయువకులు ప్రేమించే లావణ్యవతుల కుండవలసిన కనీసపు యోగ్యతలు. ఇట్టిస్థితిలో సుషమయందీ లక్షణాలు ఎక్కడా కనపడలేదు. పాశ్చాత్యసభ్యతయందలవాటుపడి ప్రేమఫలంకోసం వేశ్యవాటికలో కామకళాధ్యయనం సాగించిన కుమార్ భార్యనేవిధంగా ప్రేమిస్తాడు? కులస్త్రీ విరుద్ధములైన ఆ లక్షణాలు, ఈమెయందెట్లా కనపడతాయి? కనుక తండ్రిఊహ ఒకటైంది. జరిగింది వేరైంది. పర్యవసానం ఫలితం సున్నా. సుషమకు చిన్నతనంనుంచీ ఈ లక్షణాలంటేనే అసహ్యం, భారతనారీమణులకు అనాది సిద్ధంగా వస్తూండే ఆదర్శాలు, ఆ శిక్ష, మాతృదేశభాషలలోనే విద్యాభ్యాసం మొదలగు సనాతనసాంప్రదాయ వాతావరణంలోనే ఆమె పెరిగి పెద్దదైంది. సౌభాగ్యముకానీ

దౌర్భాగ్యముగానీ తల్లిదండ్రులు లామెకు విషప్రాయమైన ఆంగ్లవిద్యాసంస్కారములకు బదులుగా మాతృభాషయైన సంస్కృతంలోనే చదివించడం శ్రేయస్కరమని తలపోసి భరతఖండవాసినులగు ప్రాచీననారీమణు లనుసరించిన సనాతన సంప్రదాయాలలోనే క్రమశిక్షణ నిప్పించి పెద్దదానినిగా చేశారు. కనుక తల్లిదండ్రుల పరిశ్రమకు ఫలస్వరూపంగా సుషమయందు ప్రాచీనములైన పద్ధతులన్నీ చక్కగా ప్రతిబింబించాయి. తెల్లవారకుండా లేవడం, గృహకృత్యాలు కాలకృత్యాలు తీర్చుకోడం, పాత్రశుద్ధి, స్థలశుద్ధి చేసుకోడం, దేవమందిరాన్ని అలంకరించడం, స్నానంచేసి పెద్దవారితో పాటు వంటచేసి దేవతానివేదితాన్నమును పెద్దలకు పెట్టిన తదుపరి తాను భుజించడం, విశ్రాంతికాలంలో సద్గ్రంథ పఠనం, జగత్పితరులను గానంచెయ్యడం మొదలగు సనాతన సంస్కృతి అంతా జన్మహక్కుగా ఆమెకు ఏర్పడింది. ఇప్పుడెట్లా వదిలిపెట్టుంది?

పతి తనవిషయంలో ఎందుకు ఉదాసీనభావంగా ఉన్నాడో మొదట గ్రహించలేకపోయినా తరువాత కొంత వరకు తెలుసుకొని ఏవిధంగానైనా భర్తకు మనోనుకూలంగా ఉండాలని ప్రయత్నంచేసింది. కాని ప్రథమ శోభనరాత్రి శయనగృహంలో భార్యను కుమార్ ఏరీతిగా గ్రహించాడో ఈనాటివరకూ ఆ అభిప్రాయంలోనే ఉన్నాడు. భార్యయం దతనికి కలిగిన దురభిప్రాయంలో ఒక అంగుళమైనా వీసమాత్రమైనా పరివర్తనంరాలేదు. సుషమ సాత్త్విక, సరళస్వభావం అతనికి వెగటుగా తోచింది. ఈ

పల్లెటూరి అనాగరీకపు తరుణివలన తనకు సుఖం లభించ దని నిశ్చయించుకొన్నాడు. ఆదినం మొదలుకొని భార్య యొక్క ప్రేమఅంతా ఆడంబరమని, పూజాది వ్యవహార మంతా కపటనాటకమనీ, ఆ మొముఖంలో కనపడే మంద మధురహాసము వెక్కిరింపు వెకిలితనమనీ మనస్సులో సుస్థిరంగా నిశ్చయంచేసుకున్నాడు. భారతీయ వివాహ సంప్రదాయాలు నైతికంగా, ధార్మికంగా, సామాజికంగా దృఢములైన కట్టుదిట్టాలతో విచ్ఛిన్నంచేసుకోడానికి వీలు లేని పరిస్థితులలో బంధింపబడి ఉండడంచేత వీలులేకపోయింది గాని లేకపోతే ఉత్తరక్షణంలో విడాకులిచ్చి భార్యను ఆవ లికిపంపేవాడే. అంతేగాక ఆ మొస్థానంలో ఇంకొక ఆంగ్ల విద్యావిలాసినియగు వెన్నెలవిసినకన్నె చక్రవంటి యువతీరత్నాన్ని నిలువబెట్టేవాడు.

భర్తయొక్క స్వభావాన్ని, అతని కార్యక్రమాన్నీ అర్థంచేసుకొంటూన్నకొద్దీ సుమమకు చాలా మనోవ్యథ కలిగింది. అందువలన ఇట్లాఅనుకొంది. 'గొప్పఇంటిలోపుట్టి శిక్షితులైన పురుషులు చేయదగిన కార్యమేనా ఇది! లోక మంతా ఆయనను సజ్జనుడు, స్నేహశీలుడు, శిక్షితపురుషుడు, సద్వంశజాతుడు, సంపన్నగృహస్థు అని స్తోత్రాలుచేస్తూం టుంది. అట్టి మహాపురుషు లీవిధంగా భార్యల నుదాసీనంగా చూస్తారా! నన్ను ప్రేమించకపోవడానికి ఏమైనా కారణా లున్నాయా? అని ఆలోచిస్తే నాబుద్ధికి ఒకటైనా తోచడం లేదు. ఇటువంటిస్థితిలో ఆయన నాపక్కనిల్చోడం, నాతోమాట్లా డడం పాపమని ఎందుకు ఊహిస్తున్నారు? నాతప్పేమైనా

ఉందా? ఉంటే చెప్పవచ్చు. అది తప్పేఅయితే దిద్దుకోడానికి సిద్ధంగానేఉన్నాను. ఇల్లువదలిపెట్టి కొన్ని నెలలుగా బయటికి వెళ్ళిపోయారు. ఆదినం దివాన్‌జీ ఈవిధంగా కబురు చేశారు. "బహూరాణీ! కుమారబాబుగారిని జాగ్రత్త పెట్టాలి. లేకపోతే జమీందారీనౌక సముద్రంలో మునిగి పోవడానికి సిద్ధంగాఉంది. తర్వాత ఆయన ఎట్లా మారి పోతాడో ఊహించండి."

ఎంతమాటవిన్నాను! ఇదే నిజమైతే సర్వనాశనానికి సంకల్పసన్నాహాలు జరిగిపోయినాయన్నమాట......'

ఈవిధంగా కొంతకాలం ఊహించేసరికి ఆమె నిలువ లేక పక్కనున్న కుర్చీలో కూలబడింది కళ్ళు చీకట్లు కమ్మడంచేత నిలువలేక వెనుకకు వాలిపోయింది. ఈమారు తనభర్త వచ్చినతర్వాత ఎదుటబడి తాను విన్నసంగతులు అన్నీఅడిగి సంశయాల్ని రహితంచేసుకొందామనే నిశ్చయంలోకి వచ్చింది సుషమ.

ఎదురుచూడగా చూడగా చివరకు ఆ దినం వచ్చింది. కుమార్ ఇంటికివచ్చాడు. ఏమైనాసరే ఈదినం ఎదుటపడి భర్తను అడగాలని దృఢంచేసుకొంది. "నేను చేరదీసిన ప్రియురాలనుగాను. అగ్నిసాక్షిగ వివాహమాడిన ధర్మ పత్నిని. ఈఇంటి మంచిచెడ్డలను గురించి విమర్శించి తెలుసు వలసిన అధికారం నాకుఉన్నది" అనే నిశ్చితాభిప్రాయంతో సుషమ భర్తరాకకోసం ఎదురుచూస్తోంది. కుమార్ గది లోకివచ్చి తనపని పూర్తిచేసుకొని వెళ్ళేప్రయత్నంలో ఉన్నాడు. సుషమ సమయంకనిపెట్టి వెళ్ళేసమయంలో

దోవకడ్డంగా నిలువబడి పెనిమిటి రెండుకాళ్ళముందు మోకరించి నమస్కరించింది.

కుమార్ ఉదాసీనభావంతో కలవరపడుతూ

"ఇదేమి? ఏమి పనిచేస్తున్నావు?" అని అన్నాడు.

"నావిన్నపం ఒకటిఉంది. రెండునిమిషాలు కూర్చుని సావధానంగా వినాలి" అన్నది సుషమ.

"ఒక్కక్షణంకూడా నాకు తీరికలేదు. నన్ను బాధపెట్టవద్దు."

"నేను బాధపెట్టేదాన్ని కాను."

"అయితే నన్ను వదలిపెట్టు."

"మీరు నన్నువదలిపెట్టాలనుకొన్నా నేను మిమల్ని వదలడానికి వీలులేనిసంబంధం భగవంతుడు ఏర్పాటుచేశాడు. మీధర్మపత్నినైన నేను కొన్నిమాటలు అడగాలనుకొన్నాను. నాప్రశ్నలకు మీరు సమాధానంచెప్పితీరాలి."

"పశ్నలకు సమాధానాలకు ఇది క్లాసుగాదు. తమరు ప్రొఫెసరుగారు కారు."

"కాకేమి? నేను ప్రొఫెసరునే. మీరు చదువుకొన్న క్లాసులకంటె ఇది చాలపవిత్రమైన పెద్దక్లాసు."

కుమార్ పెదవులమీద చిన్నమందహాసరేఖ పరుగులుపెట్టింది. ఈమె ఇంతఅమాయకురాలేమి? అన్నశంక మనోగోచరమైంది.

"చిత్తం. ప్రొఫెసరుగారూ! దయచేసి అడగండి" అన్నాడుకుమార్.

"అడుగుతున్నాను వినండి, విద్యార్థి గారూ! ఇక్కడ

మీ కెదురుగా నిల్చున్న ప్రొఫెసరుగారికి మీరు ప్రస్తుతం చేస్తూన్న సంపూర్ణ కార్యక్రమం తెలియక పోలేదు. విన్నారా విద్యార్థి గారూ"

ఆ మాటవినగానే కుమార్ కలవరపడ్డాడు. భార్య ఎదుట ధైర్యంగా నిల్చోలేకపోయాడు. పక్కనున్న కుర్చీలో కూలపడి ఆలోచించడం ప్రారంభించాడు. "సుషమకు ఏమి తెలుసు? తను చేసేపని, తను ప్రస్తుతం నడిచేనడత అంతా ఈమె గ్రహించిందా! తెలుసుకొనేఉంటే చాలాప్రమాదమే. నన్ను ఏమేమి అడగాలనుకుంది? తన దుష్కార్యాచరణమంతా ఆమె గ్రహిస్తే మనస్సులో తన్ను గర్హిస్తుందిగాని గౌరవభావంతో ఎట్లాచూస్తుంది?" అని ఆలోచిస్తూ కొంత తెప్పరిల్లుకొని ధైర్యం తెచ్చుకుని అన్నాడు "ప్రశ్నలు, సమాధానాలు వాటిసంగతి అట్లాఉంచు, నా విషయం నీకేమి తెలిసిందో వివరంగా చెప్పు."

"ఆహా! నా కంతా తెలుసు." అని మళ్ళీ రెట్టించింది సుషమ.

"తెలిసిందేమో చెప్పరాదూ? అన్నాడు కుమార్.

"అంతాచెప్తాను. కడుపులో వున్నదంతా చెప్తాను. మీరు నన్ను ప్రేమించినాసరే ప్రేమించకపోయినాసరే అది మీ ఇష్టంమీద ఆధారపడివుంది. దానికోసం నే నెంత మాత్రం ఆదుర్దాపడటంలేదు. కాని ఒక్కవిషయంవుంది. ఇంత విస్తారమైన ఆస్తిని, ఎస్టేటును పోగుచేసి, అపారమైన ధనాన్ని ఆర్జించి, పాడుగాకుండా రక్షించడానికిగాను మీ పూర్వులు అనగా మీ తండ్రిగారు, తాతగారు మొదలగు

వా రెంతశ్రమపడ్డారో, చెమటోడ్చి కష్టించారో కొంచెం ఆలోచిస్తే బోధపడుతుంది. ఈనాడు ఈ విశాలసంపత్తిని, ఎస్టేటును రక్షించుకోవలసిన భాధ్యత మీ పైనవుంది. కాని మీ రేమిచేస్తున్నారు? కంచెయే చేనుమేసినట్లు రక్షించి అభివృద్ధిచేయవలసినదానికి బదులుగా దురుపయోగంచేసి క్షీణగతికి తీసుకొనివస్తున్నారు. సంవత్సరాలకొద్దీ ఆదాయ వ్యయముల (జమా ఖర్చు) లెక్కలుచూడడం మానివేశారనీ, అవసరమైన కాగితాలమీద మీ సంతకాలు లేకపోవడం చేత ఎన్నోపనులు పాడైపోయినాయని దివాన్‌జీగారు అన్నారు. ఆఖరికి మీ దృష్టి స్వంతవ్యవహారాలు, ఎస్టేటు కార్యక్రమాలు మొదలగు విషయాలనుండి పూర్తిగా తొలగిపోయింది. మీ గృహకృత్యాల్ని చక్కపెట్టుకొందామన్న బుద్ధికూడా మీకు లేకుండాపోయింది. ఇదెంత వరకు న్యాయమో, మీరే ఆలోచించిచెప్పండి. తరువాత... ఇంకాచెప్పమంటారా!... చెప్పవలసిందేనా! అయితే పర ధ్యానం లేకుండా శ్రద్ధగా వినండి. చెప్తున్నాను. ఆనాడు జరిగిన గార్డెన్‌పార్టీకి ఎవరో ఒక నర్తకిని తీసుకొని వచ్చారే! ఆమెవెంట పిచ్చివారై తిరుగుతున్నారు. మీ కార్యక్రమంచూసి లోకమంతా మిమ్మల్ని లోలోపల ఏమనుకొంటున్నారో మీరేమైనా వూహిస్తున్నారా? పోనిండి! అంతతో వదలిందా! లేదు, సురాపాన పిశాచాన్ని నెత్తిన ఎక్కించుకొన్నారు? యీఅభ్యాసం ఎవరిదగ్గర నేర్చుకున్నారు? చెప్పండి. ఈ ప్రశ్నలకన్నింటికీ మీదగ్గిర ప్రత్యుత్తరా లున్నాయా?" అన్నది సుషమ.

భార్యమాటలు వినేసరికి కుమార్ హృదయంలో కొంచెము సంచలనంకలిగింది. కాని కామపిశాచగ్రస్తుడగుటచే అతని కీ భావసంచలనం ఎంతోకాలం నిలవలేదు. తన కార్యక్రమం అంతా భార్య తెలుసుకొన్నదని గ్రహించి కూడా తాను పురుషుణ్ణి, భర్తను అనే అధికార గర్వంతో దబాయించి ఆమెవాదాన్ని కొట్టివేదామనుకొని "నువ్వు చెప్పింది కేవలం అబద్ధం. నామీద మోపిన ఈ దోషారోపణల్ని, అపవాదాలను నేను ఎన్నటికీ అంగీకరించను. తిన్నగా విచారించకుండా, తగిన దృష్టాంతం చూపించకుండా ఇతరులప్రవర్తనమీద మిథ్యాకళంకాన్ని ప్రయోగించడం చాల తప్పు. ఇది తగినపనికాదు. నువ్వువేసిన పిచ్చిప్రశ్నలకు నాదగ్గర సమాధానాలు లేవు. చెప్పవలసిన అవసరం కూడా లేదు. అర్థంలేని నీ మాటలను వింటూ కూర్చోడానికి నాకు సావకాశంలేదు. నువ్వు ఇట్లా ఎందుకంటున్నావో, వెనకవుండి ఎవరు నీచేత అనిపిస్తున్నారో అదంతా గ్రహించాను. అనవసరమైన విషయంలో జోక్యంకలిగించుకొంటే ఆ వ్యక్తికి ముష్టిపాత్ర చేతికివస్తుంది. ఏమనుకొంటున్నావో! తెలియచెప్పు. ఏదైనా నష్టంవస్తే నాదిగాని అతని తండ్రి-తాత—" అని అన్నాడు కుమార్.

"ఆపండి. తప్పుచెయ్యడం ఒకదోషం-దాన్ని కప్పిపుచ్చుకోడానికి అసత్యంచెప్పడం ఇంకోదోషం. అంతతో పోనీయక ఒక నిరపరాధిని తూలనాడడం ఇంకా గొప్ప దోషం. మీ దృష్టిలో నేను అపరాధినినైతే నన్నుశిక్షించండి. అది మీవంటివారికి తగినపని. అంతేగాని పిచ్చుక

మీద బ్రహ్మాస్త్రంవలె చిరకాలంనుంచి విశ్వాసంతో పని చేస్తూ ఎస్టేటుయొక్క అభివృద్ధికోసం పాటుపడే ఒక వృద్ధ మంత్రిమీద మీ శాసనబలాన్ని వుపయోగించడం తగిన పనికాదు." అన్నది సుషమ.

"నీ ఉపన్యాసం వినడానికి నాకు సావకాశంలేదు. ఆలస్యమౌతోంది. నేను వెళ్ళాలి" అన్నాడు కుమార్.

"ఎక్కడకు వెళ్తారు?" అన్నది సుషమ.

"నేను చెప్పకపోతే?" అన్నాడు కుమార్.

"నేను వెళ్ళనీయకపోతే?" అన్నది సుషమ.

"అసంభవం. నన్నెవరూ ఆటంకపరచలేరు" అన్నాడు కుమార్.

"మిమ్ముల్ని ఆటంకపరచనుగాని ఒక ప్రార్థన. దైవమునుచూచి మీ పద్ధతి వదిలిపెట్టండి." అన్నది సుషమ.

"ఏమి వదిలిపెట్టమన్నావు? వదలదలచుకొన్నది ఇదివరకే వదిలివేశాను. ఇక నీమనస్సులో వుండే పనికిమాలిన భావాలు......" అన్నాడు కుమార్.

"మీ మాట నమ్మవచ్చునా? నామీద ఒట్టే!" అన్నది సుషమ.

"నమ్మడం నమ్మకపోవడం నీ ఇష్టంలోవుంది. ఒట్టు పెట్టుకోవలసిన అవసరం నాకేమీలేదు. నువ్వు వూహించి నామీద ఆరోపించిన దుర్గుణాల్లో ఒకటికూడా నాదగ్గర లేదని నేను గట్టిగా చెప్తున్నాను" అన్నాడు కుమార్.

"సరే. నేనుకూడా అట్లాగేఅనుకొంటాను. ఇంతకూ

మీరు వెళ్లేది ఎక్కడికి? తిరిగి ఎప్పుడువస్తారు." అన్నది సుషమ.

"ఈ పిచ్చిప్రశ్నలకు నాదగ్గర సమాధానాలు లేవు." అంటూ తొందరగా వెళ్ళిపోయాడు కుమార్.

అతనికి వినపడేటట్లు గట్టిగా కేక వేసింది సుషమ. "దుర్మార్గంగా నడవడం, ఇతరుల కష్టాలకు కారకులు కావడం; ఈ రెండూ వదిలిపెట్టండి" అన్నది సుషమ.

ఆమె ఈ మాట అనేసరికి కుమార్ చాలాదూరం వెళ్ళిపోయాడు. భార్య అన్నమాట అతనికి వినపడిందో లేదో ఎవరికీ తెలియదు.

కుమార్ వెళ్ళిపోయి నెలదినాలుకాలేదు. చిరకాలం నుంచీ పనిచేస్తూన్న వృద్ధదివాన్ పనిలోంచి - తొలగింపబడ్డాడు. ఆ స్థానంలో "విజయకుమార్" అనే నూతనవ్యక్తి ప్రవేశపెట్టబడ్డాడు. పాతదివాన్‌గారి పరిపాలన గతించిన తర్వాత కొత్తదివాన్‌గారువచ్చి వెనుకటి పద్ధతులు మార్చివేసి కొత్తమార్గాలు నియమించారు. ఆ జమిందారీ భవనంలో యజమానురాలైన సుషమకు నోరెత్తడానికైనా అధికారం లేకుండాపోయింది. ఆమెమాటకు పిసమాత్రమైనా విలువలేదు. వృద్ధదివాన్‌జీ తొలగింపబడినందుకు సుషమ చాలా విచారపడ్డది. అంతకన్న ఆమెచేయగలిగినదేమున్నది. తనజమీందారిణికి కలిగిన అవమానాన్ని తలచుకొని పాప మావృద్ధుడుకూడా దుఃఖపడుతూనే ఉన్నాడు.

కొత్తదివాన్ వచ్చినతర్వాత సుషమకు ఒకదాసితో సమానమైన స్థితివచ్చింది. అయినప్పటికి ఆమె నిరాశపడ

లేదు. తనభర్తను సరియైనస్థితిలో పెట్టడానికి మార్గమేమిటా అని ఆలోచిస్తూనేఉంది. ధైర్యసాహసాలు ఆమెహృదయం లోంచి తొలగిపోలేదు.

కొన్నినెలలు గడిచినాయి. భర్తరాలేదు సరిగదా ఆయనఉండే జాడకూడా తెలియలేదు. సుషమ విచారంలో మునిగిపోయింది. తన యోగక్షేమవార్తలనుగూర్చి జాబు వ్రాయకపోయినాసరే, ఇంటికైనా రాకపోతాడా అన్న నమ్మకంతో ఎదురుచూచింది. ఎంతచూచినా ఆమెఆశ సఫలంకాలేదు. వేరుగతి లేకపోవడంచేత ముదుసలిదివాన్ జీకి జాబువ్రాసి పిలిపించి ఆయనతో తనకష్టమంతా చెప్పు కొంది. పాపమా వృద్ధుడామె కన్నీరుచూడలేక కుమార్ జాడ తెలుసుకొనివచ్చి, మీతో చెప్తానని వాగ్దానంచేసి వెళ్ళి పోయాడు.

కొంత ప్రయత్నంమీద స్వామిభక్తిగల ఆ వృద్ధుడు కుమార్ యావద్వృత్తాంతము తెలుసుకొని సుషమపేర తు. చ. తప్పకుండా జాబువ్రాసి పంపించాడు. ఆ జాబును చదువుకొని ఆమె పొందినదుఃఖానికి అంతులేదు. శరీరంలోని ప్రతినరం హాహాకారంచేస్తోంది. తనభర్త కుమార్ వారాం గనామోహమగ్నుడై భోగవిలాససముద్రంలోపడి గుటకలు వేస్తున్నాడన్న వార్త తెలుసుకొన్నతర్వాత కొంతసేపు కొయ్యబారిపోయింది. ఆ దినంఅంతా అట్లాగేపడుండి ఆలోచనచేసింది. ధైర్యమును చిక్కబట్టుకొని దైవమంది రం ఎదురుగా మోకరించి భగవానునిగూర్చి మహాభక్తితో పూజించి ధ్యానంచేసింది. అక్కడనుండి బయలుదేరి తన

ఏకాంత ప్రదేశంలోకి వెళ్ళి కుర్చీలో కూర్చుని జాబు వ్రాయడం ప్రారంభించింది.

## 8

ఆ దినం సేవకుడు పోస్టాఫీసుకు వెళ్ళి టపా తెచ్చి గదిలో బల్లమీద పెట్టి వెళ్ళిపోయాడు. మాధురి వచ్చి వానిని శ్రద్ధగా, సావకాశంగా, ఒక్కొక్కటిగా తీసిచూస్తోంది. చూడగా చూడగా ఆమె దృష్టిని ఒక కవరుమీద వ్రాయబడిన నీలాక్షరాలు ఆకర్షించాయి. దస్తూరి అచ్చొత్తినట్లు చాలా సుందరంగా ఉంది. కవరుమీద వ్రాసినవారి పేరు లేదు. ముత్యాలకోవవలె ఉన్న ఆ వ్రాత చూచినకొద్దీ ఎవరు వ్రాశారు? అందులోని సంగతులేమి? ఎక్కడనుంచి వచ్చింది? అన్న సంశయాలు ఆమెకు కలిగినాయి. దానితోపాటు విప్పి వెంటనే చదవాలన్న కుతూహలంకూడా అధికమైంది. మాధురి ఆ కవరును ప్రత్యేకంగా ఉంచి మిగిలిన ఉత్తరాలన్నీ తీసి చదువుకొన్న తర్వాత వాటినికట్టకట్టి దూరంగా ఉంచి తాను ప్రత్యేకంగా దాచిన కవరుతీసి చించింది. లోపల గులాబిరంగుతోనున్న లెటరుపేపరు కనపడింది. పైకితీసి చూసేసరికి ముద్రించినట్లు సుందరవర్ణములతో గూడిన కొన్నిపంక్తులు కనపడ్డాయి. ముందుగా తన్ను చాల గౌరవంతో పేర్కొనబడ్డ ఒకసంబోధన – చివర 'అభాగిని – సుషమా' అన్న మాటలను చూచి ఎవరో ఒక స్త్రీ వ్రాసినట్లు గ్రహించింది. "అభాగిని! ఎవరీ అభాగిని? ఏమి వ్రాసిందో! తినబోవుకూరకు రుచిఅడగడం ఎందుకు?

చదివితే తెలుస్తుందిగా!" అనుకొని చదవడం మొదలు పెట్టింది.

స్నేహయోగ్యవగు ప్రియసోదరీ!

నువ్వు నన్ను ఎఱుగవు - కాని నేను నీసద్గుణాలను విన్నాను. అపరిచితనగు నేను నీకీవిధంగా జాబు వ్రాసినందుకు ఆశ్చర్యపడిఉంటావు. కొంచెంఆలోచిస్తే ఇందులో ఆశ్చర్య పడవలసిన విషయం ఏమీలేదని నీకే తెలుస్తుంది. నేను చాలా దుఃఖంలోఉండడంచేత తప్పనిసరిగా భిక్షార్థినినై నీదగ్గరకు రావాలనుకొంటున్నాను. నువ్వుకూడా ఆడుదానవుగనుక నీహృదయం చాలా సుకుమారంగా ఉంటుందని నిశ్చయించాను. నేనుకూడ ఒక దురదృష్టవంతురాలనగు స్త్రీ నగుటచే నేనువ్రాసిన జాబునుచదవగానే పారవేయక అందులోని విషయాన్నిగూర్చి ఆలోచిస్తావని నమ్ముతున్నాను. ఆపదలోనున్న నాకు యుక్తాయుక్తపరిజ్ఞానం - ఆలోచనాశక్తి లోపించడంచేత దుఃఖితనైన నేనువ్రాసిన ఈజాబులో నాహృదయంలోఉండే విచారానికి అనుగుణ్యంగా అక్కడక్కడ ఏవైనా ఒకటిరెండు నిష్ఠుర వాక్యాలు పడిఉంటాయి. అందుకై నామీద ఆగ్రహపడక క్షమించు. నీ తోబుట్టువుగాని నీ బిడ్డగాని అజ్ఞానవశంచేత ఏదైనా పొఱపాటుచేసినా క్షమించడం నీధర్మంకాదా, సోదరీ!

నేను భిక్షాపాత్రనుధరించి నీదగ్గరకు వస్తున్నాను. అది ఎటువంటి భిక్ష? నీశక్తికి మించిందికాదు. నీదగ్గరలేనిది, నీవుఈయరానిదికాదు. నేను కోరరానిదగు వస్తువునెప్పుడూ

అడగను. నువ్వు నాట్యాంగనవే. కాని నాట్యజీవితంగడిపే వారాంగనలకుకూడా హృదయమనేది ఉంటుందనీ. మంచి చెడ్డలవిమర్శన, ఆర్తులవిషయంలో సానుభూతి మొదలైన సద్గుణాలు ఉంటాయన్నసంగతి నాకు తెలుసును. నీదగ్గిర కూడా ఆ సద్గుణాలన్నీ ఉన్నాయని విన్నాను. అందుచేత నాఆశ విఫలంకాదనీ, నేనుకోరే ఈ స్వల్పవాంఛను తీరుస్తావనీ నా విశ్వాసం.

"సోదరీ! నువ్వు ప్రాణాలకంటే ఎక్కువగా ప్రేమించి దాచుకొన్న వస్తువును ఎవరైనా దొంగతనంగా తీసుకొని వెళ్తే నీ కెట్లావుంటుంది? ఇంకొక భారతరమణి నీ సౌభాగ్య సింధూరాన్ని బలవంతంగా తుడిచివేస్తుంటే నువ్వు సహించ గలవా? అట్లాచెయ్యడం నీకిష్టమౌతుందా! నువ్వు ఎంతో మక్కువపడి చేయించుకొన్న కంఠాభరణాన్ని ఎవరైనా బలవంతంగా లాక్కొంటే నీకు కష్టంగావుండదా? నువ్వు గుణవతివి. బుద్ధిమంతురాలవు. బాగా ఆలోచించి సమాధానం చెప్పు. ఏం చెప్తావు? నేనే నీస్థానంలో వుంటే పరుల సొత్తును ఆశించడం, దాన్ని స్వాధీనంచేసుకోడం మానవత్వం కాదనీ, రాక్షసకృత్యమనీ, స్పష్టంగా చెప్తాను. సోదరీ! నువ్వుకూడ మనుష్యాంగవనీ, మాయావినివి కావనీ, దయాధర్మములు ఆర్తులయందు సానుభూతి గలదానవనీ నమ్ముతున్నాను. కనుక నేను వ్రాసిన విషయాలనుగూర్చి ఆలోచించడానికి నీకేట్టి అభ్యంతరం వుండకూడదు.

"నువ్వు నాభర్తను అపహరించావు. నేనాయనకు భార్యను. వారికి సంభవించిన విపత్తుల నెదుర్కొని రక్షిం

చడం, ఆయన అనురాగాన్ని సంపాదించుకోడం నా ధర్మం. ఒకవేళ నువ్వు ఆయనను నాకంటే అధికంగా ప్రేమించవచ్చును. నువ్వు ఆయనకు నాకన్నా ప్రియురాలవు కావచ్చును. కాని ధర్మపత్ని అన్నపదం నాకేగాని నీకు రాదు. ఆయన కష్టసుఖాలలో ఆయనచేసే పుణ్యపాపాలలో భాగం పంచుకో నేదాన్ని నేనే. ఇట్లా అన్నానని నాపై కోపించవద్దు. ప్రస్తుతం నాకు సంభవించిన ఆపదనుండి రక్షించగలదానవు నువ్వే. సోదరీ! నా యీ ప్రార్థన నంగీకరించి నన్ను కాపాడలేవా?

"ఇంకో సంగతి వ్రాస్తున్నాను. వారి ధనాగారంలో ఉండే నిలువధనమంతా మాయమైపోయింది. ఎస్టేటంతా హాహాకారాలతో నిండిపోయింది. జమీందారీ కార్యక్రమమంతా దోవ, తెన్నూ లేకుండా నడుస్తోంది. స్వార్థపరులంతా ప్రవేశించి దొరకినంత దోచుకొనిపోతున్నారు. ఈ విషయాలు నీకు తెలియకపోవచ్చును. ఈ దురవస్థంతా చూచేవారెవరు? చూడవలసినవారి చూపు మారిపోయింది. సర్వనాశన మహావ్రతానికి సంకల్పించడమే కాదు. మూడు వంతులు పూర్తిఅయింది: సోదరీ! నీకు వారిమీద నిజమైన ప్రేమ వున్నట్లైతే తప్పక ఈవిషయాలనుగూర్చి పర్యాలోచన చేస్తావని వారిదృష్టిని మరలించడానికిగూడా ప్రయత్నిస్తావని నమ్ముతున్నాను. పరుల సంసారసుఖాలను పాడుజేసి వారిగృహారామక్షేత్రాదులను నామరూపాలు లేకుండా చేస్తే అందువల్లకలిగే లాభంగాని సుఖానందాలుగాని

ఏమీ వుండవు. కొంచెంకాలం పరమార్థదృష్టితో ఆలో చించు. తప్పక ఆలోచించాలి.

"నిన్ను వారిని ప్రేమించవద్దని నే నెప్పుడూ శాసిం చను. ప్రేమసామ్రాజ్యంలో ప్రవేశించడానికి, ప్రేమా నందం అనుభవించడానికి అందరికీ అధికారంవుంది. కాని అది స్వార్థపూర్ణమై వాసనామయమై పరబాధకంగా వుండ కూడదు.

"ఒకమాట చెప్పదలచుకొన్నాను. నేను ఆపదలో ఉన్న పల్లెటూరి వనితను. నా అభిప్రాయాన్ని వెల్లడించ డంలో పొరపాటుంటే క్షమించు. నీ వాసనాపరిపూర్తికి స్వార్థాపేక్షకు, లోకంలో ధనాఢ్యవ్యక్తులు చాలామంది ఉన్నారు. కాని భార్యకుమాత్రం పతి ఒక్కడే గతి. అతడే సర్వస్వం. అతడే పరమేశ్వరుడు. నీ పాదములు పట్టుకొని ఈ భిక్ష కోరుతున్నాను. నా భర్తను నాకు అను గ్రహించు. భగవంతుడు నీకు సర్వదా అనేకమంగళము లను ప్రసాదిస్తాడు. నాకు పతిలభిస్తే నీకు నేను సోదరినై సర్వోపచారాలు చేస్తాను. అంతకన్న నీకు నేనేమీ ఇయ్య లేను. నాకున్నది భర్తయే. నేను వారిదాసిని. నాకుగల సర్వస్వం వారిదేగాని నాకుగా ఏర్పడ్డ స్వత్వం ఏమీలేదు. అప్పుడు వారి ఆజ్ఞానుసారంగా నా యీ భౌతికదేహాన్ని నీకు కానుకగా సమర్పిస్తాను. ఈవిధంగా నీకొక ప్రియసో దరి లభిస్తుంది. ఇంతకన్న నేను చెప్పకలిగింది నీకు ఇయ్య గలిగిందీ ఏమీలేదు. కనుక నా ప్రార్థనను దీర్ఘంగా ఆలో

చించి నా ఆశను సఫలంచేస్తావని త్రికరణశుద్ధిగా నమ్ము తున్నాను.

ఇట్లు
అభాగిని-సుషమ.

మాధురి గుండెలుగట్టిచేసుకొని ధైర్యంగా జాబంతా చదివింది. వెంటనే ఒకవిధమైన కోపం, తిరస్కారం రెండూ కలిగినాయి. అప్రయత్నంగా ఆమె నోటినుండి ఈ మాటలు బయలుదేరినాయి. "ఈ రీతిగా నాకీ జాబువ్రాసిందంటే ఆశ్చర్యంగావుంది. ఎంత దుస్సాహసం! ఓ అభాగినీ! సుషమా! నీ జీవితకాలమంతా తల మీద చేతులుపెట్టుకొని రోదనం చెయ్యవలసిందే. నన్నేం చెయ్యమంటావు? నీ పతి నిన్ను ప్రేమించకపోతే ఆ తప్పు నాదా? దుఃఖించు. భగవంతుడు నీకదేవ్రాశాడు."

అంటూ కొంతసేపు ఆ ఉత్తరాన్ని కోపంతో చూస్తూ ఆలోచించడం ప్రారంభించింది. కడుపులో రోషాగ్ని ప్రజ్వరిల్లుతోంది. కన్నులు నిప్పులుకక్కుతూన్నట్లు ఎఱ్ఱ పడిపోయినాయి. శరీరమంతా చెమటలుపట్టినాయి. ఆవేశం తో లేచి పండ్లుకొరుకుతూ ఆ జాబును నేలమీద విసిరిపారేసి కాళ్ళతో తొక్కి నలిపి చిత్తుకాగితాలబుట్టలోకి విసిరేసింది. ఇక అక్కడ వుండలేక వసారాలోకివచ్చి అటుఇటు తిరగడం ప్రారంభించింది.

నిజానికి ఆ జాబు మాధురిహృదయంలో అగ్ని హోత్రాన్ని రగుల్కొల్పింది. మనస్సులోంచి ఆవిషయాన్ని తోసిపారవేసి శాంతిపొందాలని ఊహించింది. కాని ఆమె

అట్లా శాంతిని పొందాలనుకొంటూన్నకొద్దీ అశాంతి, ఆరాటం, హృదయంలో విజృంభించడంచేత కడుపులో పెద్ద తుఫాను చెలరేగుతూన్నట్లుంది.

ఒక పావుగంటకాలానికి మాధురి బలవంతంగా అతికష్టంమీద తన మనస్సును మరల్చుకొని లేనినవ్వు తెచ్చుకొని గదిలోకిపోయి తంబురా తీసుకొని పాడడం ప్రారంభించింది. రెండుమూడు కీర్తనలు ఆలాపనచేసి పాడ గానే మనస్సులో కొంతమార్పు వచ్చింది. వెంటనే కాచిన పాలు త్రాగి శయ్యమీద పరుండేసరికి వెనుకటి ఉద్రేక మంతా శాంతించి మనస్సుచల్లపడ్డది. ఉత్తములకోపం తాటాకులమంటవలె భగ్గునమండి వెంటనే చల్లారిపోతుం దన్నసంగతి సుప్రసిద్ధమే.

కాలంగడిచినకొద్దీ మనోగతి మారిపోయింది. మాధురియొక్క అంతరాత్మ ఆమెను అహంకారాగ్ని లోంచి తప్పించి పునర్విచారణచేసుకొమ్మని ప్రబోధించింది.

మాధురి పరుండియే సుషమాదేవివ్రాసిన జాబులోని విషయాలనుగురించి ప్రశాంతమైనమనస్సుతో ఆలోచించడం మొదలుపెట్టింది. ఆలోచించినకొద్దీ ఆజాబులోని మాట లలో కొంతవరకూ నిజంలేకపోలేదు అన్నఊహ ఆమెకు తట్టింది. సుషమ హృదయతంత్రులలోంచి బయలుదేరిన విచారాత్మకములైన ధ్వనితరంగాలు శబ్దరూపంగా ఆమె హృదయంలో సంచారంచేస్తున్నాయి. కన్నులుతెరిచి నలు దిక్కులుచూచి ఇట్లాఅనుకొంది. "కాలం ఎంతవేగంగా

ముందుకునడిచిపోతోంది? మానవకోటియొక్క చిత్తవృత్తులు, దశలు అన్నీ కాలానుసారంగా మారిపోతున్నాయి. కాని అభాగినులైన వారకాంతల దుర్దశమాత్రం ఏమీమారలేదు. ఈ కామవాసనఅనే అగ్నిహోత్రానికి ఎంతోమంది ధనాఢ్యవ్యక్తులు, కోటీశ్వరులు, కుమార్ వంటి జమీందారులు ఆహుతిఔతున్నారు. సుషమ ఏమని వ్రాసింది? "నువ్వు నాకన్నను నాభర్తకు ప్రియురాలవు కావచ్చును. కాని 'ధర్మపత్ని' అను శబ్దము నాకే చెల్లుతుంది.

ఆయనచేసే పాపపుణ్యాలలో భాగంపంచుకొనే దాన్ని నేనే" అని వ్రాసింది. అట్లావ్రాయడంలో తప్పేముంది? చేరదీసినవేశ్య భార్య ఎట్లాఔతుంది? ఆమె వ్రాసిన వాక్యాలలో ఎంతకరుణాభావం స్పష్టపడుతోందో ఇప్పుడు ఊహించుకోగలుగుతున్నాను. తుదకు ఆదేవి పడే మనోవ్యాకులానికీ అనుభవించే అవస్థలకు కారణం నేనా? "కుమార్! విద్యావంతుడవైన నీబుద్ధి ఈవిధంగా భ్రష్టమైపోయిందేమి? రత్నాన్నివదలిపెట్టి చిల్లపెంకు తీసుకొన్నావేమి? నీ ఎస్టేటు, నీ ఐశ్వర్యము ఏరీతిగా భగ్నమైపోతోందో ఆలోచించుకో... వెళ్లు...నీభార్యదగ్గిరకుపోయి ఆమెకష్టాలను నివారించు. ధర్మపత్నియొక్క కన్నీటిని తుడిచివేసి ఆమె దుఃఖమయజీవితాన్ని ఉద్ధరించి సుఖవంతంగా చెయ్యి. ఆమె కడుపులో రగుల్కొనే విచారాగ్నిని నీప్రేమామృత వర్షధారలతో చల్లార్చి అనుకూలభర్తవై ఉద్ధరించు. జమీందారీవ్యవహారాలు పాడుకాకుండా రక్షించుకో," అంటూ

మాధురి తనలోతానే మాట్లాడుకొంది. దీర్ఘవిమర్శన చేసినకొద్దీ సుషమవ్రాసిన జాబులోని నిగూఢభావాలన్నీ అర్థమౌతున్నాయి. ధర్మపత్ని అనే పదవి ఎంత ఉన్నత మైనదో, భారతనారీమణుల హృదయాలు పతిప్రేమకోసం ఎంతపరితపిస్తూంటాయో, భర్తలనెంత శ్రద్ధాగౌరవాలతో పూజిస్తూంటారో-ఈ మొదలైన విషయాలన్నీ సముద్రతరంగాలవలె ఒకదానివెంట ఒకటిగా ఆమెకు హృదయగోచర మైనాయి.

సుషమవ్రాసిన జాబును ఇంకోమాటు చదవాలనే ఉద్దేశ్యం మాధురికి కలిగింది. వెంటనే చిత్తుకాగితాల బుట్టలో నలిపి తొక్కిపారవేసిన ఆ జాబును తీసి దానిపైన ఉన్న మన్నంతాతుడిచి శుభ్రంచేసింది. కుర్చీలోకూర్చుని జాబును ఆద్యంతాలు సావకాశంగా చదివింది. ఇంతసేపటికి ఆమెకు యథార్థం బోధపడింది. సుషమ ఈజాబువ్రాయడానికి కేవలం పతివియోగం, విరహవ్యాకులమేగాక కర్తవ్యానురోధంకూడా పెద్ద కారణమేనని గ్రహించుకొంది. జమీందారీలోని కష్టనష్టాలు ఒకవైపున, గృహకల్లోలం ఇంకోవైపున - పరివారజనంచేసే స్వైరవిహారం అనగా కాతుకొద్దీగుట్టమన్నట్లు కొత్తదివానుగారి అండచూచుకొని ఏవిధంగా ద్రవ్యాదులను అపహరించేది...ఇట్లాంటి దుర్వ్యవహారాలన్నీ ఆమెను చుట్టుముట్టడంచేత వేరుగత్యంతరంలేక తనపేర ఈజాబును సుషమ వ్రాసిఉంటుందన్న నగ్నసత్యాన్ని మాధురి ఇప్పటికి గ్రహించింది. ఇంకా తనలో తాను ఇట్లా అనుకొంది.

"నేను నిన్ను బిచ్చమడుగుతున్నాను" ఈ అన్నమాటలో ఆమె కడుపులో ఎంత వేదన ఉందో అదంతా తెలిసింది. నేనామె సంపద నపహరించిన దొంగను. ఆమె సర్వసుఖాలనూ పాడుచేసిన శత్రువును. అయినప్పటికీ స్నేహయోగ్యవగు సోదరీ!" అని నన్ను సంబోధించి పతిభిక్ష పెట్టమని కోరుతోంది. ఆలోచిస్తే ఈమె సంబోధనలు, అనునయవాక్యాలు మెత్తని పాదరక్షా ప్రహారణాలవలె, నాకు తగుల్తూనే ఉన్నాయి. ఇంకా ఏమని వ్రాసింది? "నీకు సర్వోపచారాలు చేస్తాను. వారి ఆజ్ఞానుసారంగా నా యీ భౌతిక దేహాన్ని నీకు కానుకగా సమర్పిస్తాను."—ఈ వాక్యాలలో ఆమె సౌజన్యం, త్యాగశీలత స్పష్టపడుతోంది. సుషమ ఎక్కడ - నేనెక్కడ - స్వర్గానికి, నరకానికి ఎక్కడనైనా పోలికలు సంబంధబాంధవ్యాలు ఉంటాయా? సుషమా! ఇంతకాలానికి, నువ్వు నాకు మార్గదర్శినివైనావు. నా దృక్పథాన్ని పవిత్రంచేశావు. ప్రయత్నంచేసి చూస్తాను........

మాధురి ఇట్లా ఆలోచనా ప్రవాహంలోపడి కొట్టుకొనిపోతోంది. ఇంతలో ద్వారపుతలుపులు ఎవరో చప్పుడు చేశారు. వెంటనే మాధురి "లోపలికిరావచ్చును." అన్నది. కుమార్ లోనికివచ్చాడు.

"మాధురీ! కులాసాగాఉన్నావా?"

మాధురి జవాబుచెప్పక మౌనంగా కూర్చుంది.

"ఇవాళ పిక్నిక్ పార్టీ ఉంది. నువ్వుకూడా రావాలి?."

"మీరు వెళ్ళండి. నేను రాలేను."

"ఏం! ఒంట్లో కులాసాగా లేదా! అట్లాఅయితే నేనూ వెళ్ళను."

"మనస్సు సరిగాలేదు. టీ తాగుతారా?"

"నీ చేతిమీదుగా ఇచ్చింది వద్దంటానా?"

వెంటనే లోపలికి కబురు వెళ్ళింది. మాట్లాడుతూండగానే సేవకుడు టీ వగైరా బల్లమీదపెట్టి వెళ్ళిపోయాడు. మాధురి కప్పులలో టీ కలుపుతూంటే కుమార్ పడకకుర్చీలో కూర్చుని ఆమెను చూస్తున్నాడు.

టీ కప్పులలో తయారుచేయగానే ఒకటి కుమార్ కిచ్చి రెండవది తాను తీసుకొంది. ఇద్దరూ ఏవేవో కబుర్లు చెప్పుకొంటూ టీకప్పులు ఖాళీచేశారు. తరువాత మాధురి కుమారబాబుతో,

"కాశ్మీర్ వదిలిపెట్టదగిన ప్రదేశంకాదు. కాని నాకు ఎందుచేతనో ఇక్కడనుండి వెళ్లాలని బుద్ధిపుట్తోంది" అని అన్నది.

"అదేమిటి, అట్లాఅంటున్నావు? మనకింకా కాశ్మీర్ వదిలిపెట్టేకాలం రాలేదు. ప్రకృతివిలాసానికి స్థానమైన ఈ ప్రదేశాన్ని వదలిపెట్టాలన్న బుద్ధి నీకెట్లాకలిగింది? నువ్వు పొరబడుతున్నావు." అన్నాడు కుమార్.

"నాకు యింటిమీదకు దృష్టిమళ్ళింది. నీకు యింటికి పోవాలనే బుద్ధిపుట్టలేదా?" అన్నది మాధురి.

"ఇంట్లో ఏముంది?"

"ఉండవలసినవారే ఉన్నారు. ఇల్లాలులేదా! చూచుకోవలసిన వ్యవహారాలు లేవా?"

"ఆహాహా! ఇల్లూ ఉంది, ఇల్లాలూ ఉంది. అడగనా! చాలుచాలు, ఇక వ్యవహారాలంటావు? వానితో నాకంత తొందరేమీ లేదు. ఎవరో గుమాస్తాలున్నారు. దివాన్‌జీ ఉన్నాడు. వాళ్ళు చూస్తుంటారు. సరేకాని ఇవాళ ఇట్లా మాట్లాడడం ప్రారంభించావేమి? నన్ను చివాట్లు పెట్టి ఇంటికి పంపుదామనుకొన్నావా? నేను నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో తెలుసుకొన్నావా? నీ ప్రేమముందు నాకు ఇల్లు, ఇల్లాలుగూడ తృణప్రాయం."

"వెనుకటి పిచ్చిపాఠం మళ్ళా ప్రారంభించారు. అవన్నీ కట్టిపెట్టి నేను అడిగినదానికి సమాధానం చెప్పండి. మీకు మీ ఇల్లాలిమీద ఎందుకు అయిష్టం కలిగింది? ఆమె మిమ్మల్ని ప్రేమించటంలేదా! సరిగా చూడదా?"

"మాధురీ! ఈదినం ఇట్లా మొదలుపెట్టావేం? నీ దగ్గిర నేనుదాచినది నీకు తెలియనిది ఏముంది?"

"నాకు తెలుసును. అందుకే అడుగుతున్నాను. చెప్పరాదూ! మీ భార్య మిమ్మల్ని గౌరవించదా?"

"గౌరవించకేం?"

"అయితే మరి—"

"అయితే ఏమంటావు?"

"నావెంటపడి ఆమెనెందుకు దుఃఖపెడుతున్నావు?"

"మాధురీ! ఇవాళ నీకు మతిపోయినట్లుగా ఉంది. నీకు పిచ్చికాకపోతే ఈవిధంగా మాట్లాడుతావా? చాలించు, ఇట్లా మాట్లాడడం నీకు తగదు. నా మనస్సుకు బాధగా ఉంది."

"నామాటలు బాగాఉండనీ లేకపోనీ-నీకు బాధకలిగినాసరే. దీనివల్ల నాకువచ్చేది పోయేది ఏమీలేదు. నాకు ఎటువంటికష్టమూ కలగదు. నువ్వు నీధర్మపత్నిని ఉపేక్షాభావంతో వదలిపెట్టి ఆమెను కష్టపెట్టడం ధర్మంకాదు. నీవంటివానికి తగనిపని. ఆమె ఎట్టిదైనాసరే, తనస్వజనాన్ని వదలిపెట్టి నిన్ను నమ్ముకొని నువ్వుకట్టిన మంగళసూత్రం మీద తనజీవితాన్ని ఆధారంచేసుకొని మీఇంటికివచ్చింది. తప్పులుంటే చెప్పి సరిచేసి దిద్దుకొని ఏలుకోడంధర్మం. అంతేగాని పరిత్యాగంచెయ్యడం మహాపాపం. ఆమె జీవితకాలమంతా నీమనిషిగాఉండాలి. ఆమెహక్కులను తుడిచిచెయ్యకూడదు."

మాధురి ఈవిధంగా తనవంటిదాని కనుచితమైన ప్రసంగం, అనగా వారాంగనాజనవిరుద్ధమైన సంభాషణ ఎందుకుచేస్తోందా! అని కుమార్ ఆలోచనలో పడ్డాడు. ఆమెమాటలు అతనికి మిక్కిలి అసమంజసంగా తోచాయి. అట్లామాట్లాడడానికి తగినకారణంకూడ కనపడలేదు. దీనికి కారణమేమిటాఅని ఆలోచిస్తూంటే మాధురి సుషమవ్రాసిన జాబును కుమార్ ముందు పడవేసింది.

కుమార్ దానినితీసి పూర్తిగాచదివేశాడు. చదవడం సమాప్తమయ్యేసరికి అతని ముఖలక్షణాలు మారిపోతున్నాయి. కాని దానిని మాధురి ఎక్కడకనిపెట్టుందో అన్న ఊహతో ఎట్టిభావపరివర్తనంకూడా ముఖమందు కనపడనీయకుండా చెయ్యాలని ప్రయత్నించాడు. మామూలుగానే నవ్వుతూ మాట్లాడుతూన్నట్లు నటించాలనిచూశాడు.

కాని అతనిప్రయత్నం చాలా అస్వాభావికమేఅయింది. సూక్ష్మగ్రహణశక్తిగల మాధురియొక్క నిశితవీక్షణ ప్రసారముముందు అతనిప్రయత్నం ఏమీ పనిచేయలేదు. కుమార్ ఏస్థితిలోఉన్నాడో గ్రహించింది. కొన్నిక్షణములకాలం నిశ్శబ్దంగా నడిచింది. తదుపరి నిశ్శబ్దస్థితికి భంగంకలిగిస్తూ, "ఏమిటి ఆలోచన?" అని అడిగింది మాధురి.

"అసంభవం. ఆమె ఈవిధంగా వ్రాయలేదు."

"వ్రాయలేదా? ఈజాబు ఆమెవ్రాసింది కాదా?"

"కాదు."

"నువ్వుచెప్పింది అబద్ధం."

"నేను చాలాగట్టిగా చెప్తున్నాను. ఇది ఆమెవ్రాయలేదు."

"వ్రాసిందో వ్రాయలేదో అది నీమనస్సుకు తెలుసును. ఇంతకూ నీఉద్దేశ్యం ఏమిటి?"

"ఏముంది? నీకు తెలిసిందే. నిన్నువదలి నేను ఎక్కడా ఉండలేను."

"నేను నిన్ను ఉండనీయకపోతే—"

"ద్వారందగ్గిర పడిఉంటాను."

"అక్కడకూడా ఉండనీయకపోతే—"

"ఇంటికెదురుగా రోడ్డుమీద పడిఉండి నిన్ను చూస్తూంటాను."

"కుమార్! మత్తులో పడిపోతున్నావు. కళ్లుతెరిచి చూసుకో. పిచ్చివాడవు కావద్దు. అవతల నీ జమీందారీ అంతా సర్వనాశనంఅవుతోంది."

"అబద్ధం. ఇదంతా జాబు వ్రాసినవారు కల్పించిన అభూతకల్పనేగాని నిజం ఏమీలేదు."

"ఆమె అబద్ధం వ్రాసిందంటావా?"

"అబద్ధం అనే నా విశ్వాసం."

ఆకస్మికంగా మాధురినోటినుండి స్వల్పమైన హాహాకారము బయలుదేరింది. ఒకదీర్ఘమైన నిట్టూర్పు విడిచింది. కుమార్ వైపు చూడకుండా వెంటనే ముఖం తిప్పుకొంది. కుమార్ ఏదో చెప్పాలని అనుకొన్నాడు. మాధురి వెంటనే లేచి వెళ్లబోతోంది.

"ఎక్కడకు వెళ్తున్నావు?" అని అన్నాడు కుమార్.

"శరీరంలో స్వస్థతగాలేదు, ఎక్కువగా మాట్లాడలేను." అంటూ మాధురి లోనికివెళ్ళిపోయింది. కుమార్ లేచి కొంతసేపు అక్కడే నిలువబడిన తదుపరి విచారంతో తనగదిలోకి వెళ్ళిపోయాడు.

## 9

సుషుమ వ్రాసిన జాబును చదువుకొని తీవ్రవిమర్శన చేసుకొన్నతర్వాత మాధురికి హృదయపరివర్తనకలిగి మనస్సు తిరిగిపోయింది. నేను సుషుమకు అన్యాయంచేస్తున్నానా? అన్నప్రశ్న ఒకటే అహోరాత్రులు ఆమెమనస్సులో ఊగులాడుతోంది. పరున్నా, కూర్చున్నా, సర్వావస్థలయందు ఆమెకీ విచారమే బాధాకరమైంది. రాత్రులు నిద్రపోకుండా ఆలోచిస్తోంది.

"సుషమకుకలిగిన మనస్సంతాపానికి, అన్యాయానికి,

నేనే కారకురాలనా? అదినిజమైతే నాకర్తవ్యం ఏమిటి? కుమారబాబును ప్రేమించే అధికారం నాకులేదా? అతనిని వదలిపెట్టాలా? అది నాకు సాధ్యమా?...లేదు, లేదు. ఎప్పటికీ అట్లాచెయ్యలేను. కుమార్ నాహృదయనిధి. ప్రాణాధికంగా ప్రేమిస్తున్నాను. నాజీవితానికి కుమారబాబు ఒక దివ్యజ్యోతి-అతనినివదిలిపెడ్తే నేను జీవించడమే దుర్లభం. బుద్ధితెలిసింది మొదలు నాహృదయస్థానాన్ని ఆక్రమించుకొన్నది కుమార్ ఒకడే.అన్యులకు ఆస్థానంలభించదు. ఇట్టిస్థితిలో కుమార్ లేకుండా నేను ఒకగడియకూడా గడపలేను. అతన్ని త్యాగంచేయడం నాకు సాధ్యంగానిపని.

అయితే సుషమసంగతి! ఆమెతో నాకేమి? నన్ను గూర్చి ఆమె ఏవిధంగా భావనచేసినాసరే కుమారబాబును ఎందుకు వదిలిపెట్టాలి? అతనిని మరచిపోవడమనే అపరాధం ఏవిధంగా చెయ్యగలను? లేదు. అట్లాఎంతమాత్రం చెయ్యలేను. అది చాలా అన్యాయం. కుమార్ విషయంలో చాలా ద్రోహంచేసినట్లౌతుంది. ఆ దినం ఎంతకఠినంగా, వ్యంగ్యంగానో ప్రసంగించాను. పరిహాసంచేసి అతనిప్రేమను తృణీకరించినట్లు నటించాను. అదెంతపాపిష్టిదినం, అతనెంతనొచ్చుకున్నాడో, మనస్సెంతకష్టపడ్డదో, ఊహించలేకపోతున్నాను అదిమొదలు కొన్నిదినాలవరకు ఈవైపుకురాలేదు. ఆ వియోగాన్ని భరించడం దుర్భరమైపోయింది. అట్టిప్రేమమూర్తిని వదలడంకంటె విశ్వాసఘాతుకత్వం ఇంకొకటిఉంటుందా?"

—మాధురిహృదయంలో తుపాను చెలరేగుతోంది. విచారసాగరంలో ఆలోచనాతరంగాల మధ్య దెబ్బలు

తింటూన్న ఆమె మనోనౌక ఏమైపునకూ సుస్థిరంగా నిలవ బడలేకపోతోంది. సుషమకోసం త్యాగంచేయాలని అను కొంటూన్నప్పటికీ తత్పూర్వము కుమార్‌తో తా ననుభ వించిన భోగవిలాసస్మృతి ఝంఝూమారుతంవలె విజృంభించి ఆమెనిశ్చయాన్ని చెదరగొట్టడంచేత ఆ చంచలహృదయం కుమారబాబుయొక్క దృఢాలింగనసౌఖ్యాన్నే కోరుతోంది. తరువాత చెప్పవలసిన దేమీలేదు. యథాప్రకారంగా కుమార బాబుతో పరిహాసాలు, సరససల్లాపాలు, భోగవిలాసాలు- అన్నీ మామూలుగానే—.

అప్పుడప్పుడు సుషమసంగతి జ్ఞాపకంవస్తూండేది. ఆ సమయంలో మాధురి ఆకస్మికంగా త్రుళ్లిపడుతు-ండేది. స్త్రీజాతికి సహజమైన సానుభూతి, సామరస్యం, కరుణారసం, తాత్కాలికంగా ఆమెహృదయంలో ప్రవహిస్తూండేవి. ఒక వేడినిట్టూర్పు, విచారసూచకమైన ఒక హాహాకారము ఆమెకు తెలియకనే బహిర్గతమౌతూండేవి. వెంటనే కిందకూర్చుని రెండుచేతులతో గుండెలనదుముకొంటూ వేదనపడు తూండేది.

మాధురిలోకలిగిన ఈ భావపరివర్తనం కుమార్ ఎంత మాత్రమూ గ్రహించలేదు. ప్రియురాలి బాహుపంజరంలో బంధింపబడిఉండడమే తనజీవితానికి పరమావధి అని ఊహిం చాడు. మానవహృదయం ఎంత దుర్బలమైపోయింది? మాధురిలో అప్పుడప్పుడు కనపడే ఈ భావపరివర్తనానికి పర్యవసాన మేవిధంగా పరిణమిస్తుందో గదా!

దైవవశంచేత కుమార్ ఇంటికిరావడం సంభవించింది.

అంటే మనస్కూరిగా రాలేదు. తన అవసరాన్ని బట్టి వచ్చాడు. భార్యతో కలిసి మాట్లాడడం అతనికిప్పుడు ఎంతో కంటకంగా ఉంది. తన కార్యక్రమమంతా భార్య తెలుసుకోడమేగాక మాధురికి జాబు వ్రాయడంచేత తనరహస్యం వెల్లడి అయింది. అందుచేత భార్యనుచూడడానికి సిగ్గుపడడమేగాక ఈవిషయాన్ని ఇంతవరకూ తెచ్చినందుకు ఆమెను దండించాలనికూడా ఆలోచిస్తున్నాడు.

కుమార్ ఇంట్లోకిరావడంచూచి సుషమ సంతోషపడింది. ఆమెకన్నులలోంచి ఆనందాశ్రుధారలు ప్రవహిస్తున్నాయి. పులకితహృదయంతో సగౌరవంగా వినయవిధేయతలతో భర్తకు ఎదురువెళ్ళి ఆహ్వానించింది. కుమార్ ఆమెఇచ్చిన స్వాగతాన్ని చాలా తిరస్కారదృష్టితో చూశాడు. కామాంధకారంలోఉన్న అతనికంటికి భార్య ఇచ్చినగౌరవం డాంబికంగా, ఆడంబరంగా కనపడిందంటే ఆశ్చర్యం ఏమీలేదు. కామెర్లరోగికి లోకమంతా పచ్చగా కనపడినట్లు వారాంగనాభోగముగ్ధుడై కులస్త్రీలక్షణాలను లేశమాత్రమైనా గుర్తించలేని కుమార్ బుద్ధికి భార్య మాయావిని, రహస్యమయి, కపటహృదయ, మోసకత్తెగా కనపడింది. దగ్గరకు రాగానే భార్యనుజూచి కర్కశస్వరంతో,

"మాధురికి జాబువ్రాయమని నీకెవరు చెప్పేరు?" అని అన్నాడు.

"ఇతరులు చెప్పవచ్చును, చెప్పకపోవచ్చును. అట్లా వ్రాయడం మీకు తప్పుగా తోచిందా?"

"నా ప్రవర్తనను విమర్శించడానికి నీకేమి అధి కారం ఉంది."

"అధికారం ఉన్నదో లేదో ఆ విషయం అట్లా ఉంచండి. మీరీవిధంగా ఇంటికి దొంగలై లోకవిరుద్ధంగా ప్రవర్తించడం నాకేమీ బాగుండలేదు. మీ వెనుక లోకం మిమ్మల్ని గూర్చి ఏమనుకొంటుందో ఊహించుకొంటున్నారా ?"

"మళ్ళా అదే ప్రసంగం చేస్తున్నావు. నా విషయంలో నువ్వు జోక్యం కలిగించుకోవద్దని, నా పనిపాటలను విమ ర్శించవద్దని చాలా సార్లు చెప్పేను. మళ్ళా చెప్తున్నాను. ఇక మీద ఎప్పుడైనా ఇట్లా చేస్తే దాని పర్యవసానం చాలా విప రీతంగా పరిణమిస్తుంది, తెలిసిందా ? ఆలోచించుకో."

"తెలుసుకోవలసిందీ, ఆలోచించుకోవలసిందీ-మీరా నేనా! మీరీవిధంగా నాకెందుకు ప్రబోధం చేస్తున్నారో నాకేమీ తెలియడంలేదు. ఇక పర్యవసానముయొక్క పరిణామదశ అంటారా! అదేదో ఇదివరకే గ్రహించాను. మీరనుకొన్న పరిణామం ఇంతకన్న అధమంగా ఉంటుందా?"

"ఇప్పుడేముంది ? ఇంకా ముందున్నది."

"ఉండనీయండి. మరేమీ భయంలేదు. సరేగాని వృద్ధదివాన్‌జీగారిని తీసివేయవలసిన అవసరమేమొచ్చింది ? ఆయన చేసిన తప్పేమిటి ?" సూటిగా ప్రశ్నించింది సుషమ.

"నీ ప్రశ్నలకు జవాబు చెప్పదలచుకోలేదు. చెప్పవల సిన అవసరంకూడా లేదు. ఆ దుర్మార్గుడు నిన్ను ఆకాశానికి ఎక్కించాడు. నిన్ను స్వాధీనం చేసుకొని ఒక ఆట ఆడాలని

ఆలోచించాడు. వాడి ఆటంతా మట్టిలోకలిపేస్తాను. ఇంతే కాదు—"

అంటూ ఇంకా ఏదో చెప్పబోయి ఏమిజ్ఞాపకం వచ్చిందో అంతతో ఆగిపోయాడు కుమార్.

సుషుమకు మనస్సంతా చెదిరిపోయింది. కుమార్ మాటలు ఆమె హృదయానికి గొడ్డలిపెట్టువలె తగిలాయి. అతికష్టంమీద ఆమె ధైర్యంచేసి "మధ్యలో ఆగిపోయారేం? చెప్పదలచుకున్నది పూర్తిగా చెప్పండి. అదేమో శ్రద్ధగా వింటాను" అని అన్నది.

"నా మనస్సును దుఃఖపెట్టవద్దు. నన్ను వాగించవద్దని అనేకసార్లు నీతో అన్నాను. దీని పరిణామం భయంకరంగా వుంటుందని ఇంతకుముందే తెలియజేశాను"

"మీరు అనదలచుకొని మానేసిన మాటలేవో నాకు తెలిసినవే. కొత్తవి కావు. మీరు చెప్పడానికి ఎందుకు సంకోచపడుతున్నారో నాకు తెలియలేదు."

"నీతో ఇదివరలో అనేకసార్లు చెప్పాను. నా విష యంలో జోక్యం కలిగించుకోవద్దని, నా దోవకు నా కార్య క్రమానికి అడ్డంరావద్దని తెలియచెప్పినా వినక ఎదురుతిరుగు తున్నావు. అంతటితో వూరుకోక మాధురికి జాబుకూడా వ్రాశావు. అట్లా వ్రాయడంలో నీ అభిప్రాయ మేమిటి? ఉత్తరాలతోనన్ను నీ స్వాధీనంచేసుకొందామనుకొన్నావా! ఇటువంటివాటిని నేను లెక్కచెయ్యను. ఆఉత్తరంకారణంగా అవతలిమనస్సు ఎంతదుఃఖపడ్డదో నీకేమి తెలుస్తుంది?"

"నే నింతవరకూ చేసినపని మంచిచెడ్డలు ఆలోచించే

చేశాను. ఇకముందు చెయ్యదలచుకున్నదికూడ నా కర్త వ్యంగా భావించి చేస్తూంటాను. ఇందువల్ల ఎవరికైనా కష్టం కలిగిందంటే దానికి నా జవాబుదారీ ఏముంది? నే నీ ఇంటి కోడలిని. పత్నీధర్మం పెద్దలవల్ల ఇదివరకే తెలుసుకున్నాను. ఈఇంటి మంచిచెడ్డలను గూర్చి విమర్శించే అధికారం లేక పోయినా అవకాశంవుంది. అందుచేత ప్రస్తుత పరిస్థితులలో నా కర్తవ్యం చాలా కఠోరమన్న సంగతి తెలుసుకొన్నాను. ఇందువల్ల కొందరి మనస్సులు చాలా దుఃఖపడతాయని, వారికి చాలా కష్టంగా వుంటుందని నాకు తెలుసు. నేను వ్రాసిన జాబు మీకుకూడా దుఃఖకారణమైందని గ్రహిం చాను. నావలన మీమనస్సు దుఃఖపడ్డదంటే అది నా దుర దృష్టమే. నా కర్తవ్యం నాచేత అట్లాచేయించింది. ఇప్పటి కైనా ఆలోచించుకోండి. నేను గట్టిగా చెపుతున్నాను. మీరు ఏ మార్గంలో నడుస్తున్నారో, దాని భవిష్యత్తు ఏ రీతిగా ఉండబోతుందో బాగా ఆలోచించండి. అంధమార్జాల మూషిక న్యాయంగా మీరు ఏర్పాటు చేసిన కొత్త దివాన్‌జీగారు మీ పరోక్షంలో ఎస్టేటును ఏ స్థితికిలోకి తీసుకొనివస్తున్నారో; దాస దాసీజనం, కార్యస్థానంలోని ఉద్యోగులు వారి ధర్మాలను ఏవిధంగా నిర్వహిస్తున్నారో, కోశాగారంలో నిలవ ఏమైనా ఉందో లేదో బాగా యోచించండి. కాలుజారిపడితే వెక్కిరించే వారేగాని లేవదీసేవారు లేరు. మీరు చేసేపని మంచో, చెడో, మీరు వెళ్లేమార్గం కంటకమో, నిష్కంటకమో దీర్ఘంగా ఆలోచించుకోండి."

సుషుమ మాటలు కుమార్ హృదయంలో రగులుతూ ఉండే కోపాగ్నిలో ఆజ్యంపోసినట్లయింది. పట్టలేని కోపంవచ్చింది. భర్తయెదుట ఆమె అపరాధినివలె లేదు. బడిలో అల్లరిచేసే విద్యార్థిని దండించే ఉపాధ్యాయునివలె పతి సన్నిధిలో ధైర్యంగా నిలువబడి ప్రశ్నిస్తోంది ఈదినంతో అటో ఇటో తేలిపోతే తన కర్తవ్యమేమో నిర్ణయించుకో వచ్చుననే స్థిరాభిప్రాయంతో ఉంది. తన మాటలవల్ల భర్తకు కోపంవచ్చినాసరే, మనస్సుకు కష్టంతోచినా సరే వెనుకడుగు వేయకుండా ఆయనను సరియైన మార్గంలో ప్రవేశపెట్టితీరాలనే దృఢసంకల్పంతో ఉంది. కుమార్ భార్యమాటల కేమి జవాబుచెప్పవలెనా అని ఆలోచిస్తున్నాడు. సుషుమ తిరిగి హెచ్చరించింది. "ఊరుకున్నారేం? జవాబుచెప్పండి. మీఅభిప్రాయం ఏమోవెల్లడిచెయ్యండి." మితిమీరిన కోపంతో కుమార్, "చెప్తున్నాను. నీ వరస చూస్తే ఈ ఇంట్లోఉండే యోగ్యత నీకున్నట్లు కనిపించడం లేదు. ఎంత శాంతించినా ప్రయోజనం కనపడలేదు. అంతకంతకు నీనోరు హెచ్చుతోంది. తగినశిక్ష విధిస్తేగాని నీ నోరు కట్టుబడదు. నువ్వు ఈ ఇంట్లో ఉండడానికి వీలులేదు. నీ పుట్టినింటికి జాబువ్రాసి ఎవరినైనా పిలిపించుకో. వారు నిన్ను తక్షణం తీసుకొనివెళ్ళిపోతారు. నా ఇంట్లో నువ్వు ఉండడానికి వీలులేదు" అన్నాడు.

సుషుమ ధైర్యంవహించి పెనిమిటి అన్న మాటలన్నీ విన్నది. అంతమాత్రంచేత ఆమెముఖాన భయవిచారాలకు సంబంధించిన లక్షణాలేమీ కనపడలేదు తనభర్త ఈ

విధంగా అనగలడని ఆమె ముందే ఆలోచించుకొని తద నంతర కర్తవ్యమేమో అదికూడా నిశ్చయించుకొనేఉంది. ఈస్థితిలో తాను పతిపాదములమీదబడినా ప్రయోజనం లేకపోగా తన భర్తకు సంభవించనున్న దుస్థితితోపాటు తన జీవితంకూడా దుఃఖభాజనమై నిష్ప్రయోజనమౌతుంది. కాలిలో ముల్లుతీయడానికి సూదిని ఉపయోగించినట్లు అధోగతిపాలౌతున్న భర్తను కాపాడాలంటే దైన్యభావం వదలిపెట్టి కాఠిన్యం వహించకతప్పదు. ఈ శత్రుగణంమధ్య తానుండి చేయగలిగినదీ లేదు. వెంటనే అవతలికివెళ్ళి ఏదైనా మార్గం ఆలోచించవచ్చును అన్నఊహతో వెంటనే భర్తతో "ఇక్కడనుంచి ఉత్తరంవ్రాయడం-అది అంది అక్కడనుండి మనిషివచ్చేసరికి మూడునాలుగు దినములు తప్పకపట్తుంది. అంత ఆలస్యమెందుకు? ఒక్కఘుడియకూడా నేనుండడం మీకు ఇష్టంలేనప్పుడు ఈపని మంచిదికాదు. ఎవరినైనా వెంటఇచ్చి తొందరగా పంపించండి. వెళ్ళిపోతాను. మీఆజ్ఞ తొందరగా నిర్వహింపబడడం - నేను మీకు కనపడకుండా వెళ్ళిపోవడం, మీఉద్దేశ్యం సఫలంకావడం అన్నీ జరిగి పోతాయి. ఏమంటారు. నేను చెప్పింది సరిగాఉందా?" అని అన్నది.

తన ఆజ్ఞవినగానే భార్య వెంటనే భయపడి తన రెండుకాళ్ళమీదపడి క్షమార్పణ కోరుతుందనీ, కన్నీరు కారుస్తూ బతిమాలుకొంటుందనీ ఊహించాడు కుమార్. అంతేగాని తను శాసించినదే తడవుగా ప్రయాణానికి సిద్ధపడుతుందని అనుకోలేదు. అతనికి మనస్సునందు ఒకవిధ

మైన చింత, అనుమానం బయలుదేరినాయి. "తననుగూర్చి భార్య ఎట్లా అనుకొంటుందో? ఈవిధంగా చెయ్యడం తనకు తగినపనేనా! బయటికి చెప్పకపోయినా మనస్సులోనైనా బాధపడకుండా ఉంటుందా? నిజానికి ఆమె అన్న మాటలలో తప్పేమిటి?" ఇటువంటి శంకలన్నీ హృదయంలో సంచారం చేస్తున్నాయి. రెండునిముషా లట్లా ఆలోచించేసరికి ఝంఝామారుతంవలె అలవాటుపడిన పాతపద్ధతులన్నీ ఒక్కమారుగ విజృంభించి ఆక్రమించుకున్నాయి. దానితో చాంచల్యం చెలరేగింది. తాత్కాలికంగా కలిగిన క్షణిక మైన సద్బుద్ధి అంతర్ధానమై, దుర్బుద్ధి దానిస్థానాన్ని ఆక్ర మించుకొని కుమార్ మనస్సుకు ఈవిధంగా బోధచేసింది "వెళ్లేదాన్ని వెళ్ళనీయకుండా ఎందుకు ఆపుతావు? పోయే పెనుభూతాన్ని తలకెక్కించుకొంటావేం? వెళ్ళనీ. ఆమె ఉండడం నీకు ఆటంకమే"—వెంటనే అన్నాడు కుమార్, "సరే అట్లాగే జరుగుతుంది"—అని.

సుషమ అక్కడనుండి ఇంకోవైపుకువెళ్ళి గృహ కార్యాలలో నిమగ్నురాలైంది. స్నానం, వంట, భోజనం, మొదలగు పనులన్నీ పూర్తిచేసుకొని ప్రయాణసన్నాహం కోసం పెట్టెలు సర్దుకొంటోంది. కుమార్ ఆ దినమంతా భార్యకు కనపడకుండా తప్పుకు తిరగసాగాడు. పగలంతా ఎట్లాగో గడిపి రాత్రి తొమ్మిదిగంటలకు ఇంటికి వచ్చాడు. భోజనంచేసి బయటికివెళ్లే ప్రయత్నంలో ఉండగా సుషమ వచ్చి భర్తను అడిగింది "నన్నెందుకు ఆపుతున్నారు? పంపించండి." అని.

కుమార్ కొంచెంసేపు భార్యనుచూస్తూ నిశ్చేష్టుడై నాడు. చివరకు ఆలోచించి "ఇప్పుడుకాదు. రేపు ఉదయం వెళ్ళవచ్చును." అని అన్నాడు.

"ఇప్పుడు ఎందుకు పంపించకూడదు? నేను ఇప్పుడే వెళ్ళిపోదామనుకొంటున్నాను. రాత్రి పదకొండుగంటలు దాటినతరువాత బండివస్తుంది. ఇప్పుడు తొమ్మిదిదాటింది. తోడుగా ఎవరినైనా పంపిస్తే వెళ్ళిపోతాను." అని కొంచెం బాధతో అన్నది సుషమ.

"అట్లాగే." అన్నాడు కుమార్.

తరువాత ఒకగంటసేపటికి ప్రయాణసన్నాహం పూర్తిఅయింది. కుమార్ తనకు విశ్వాసపాత్రుడైన సేవకుణ్ణి తోడుగా పంపించాడు. వాడుగాక ఇంకొక దాసి కూడా ఆమెను వెంటఉండి పంపిరావడానికై నియమింపబడింది. సుషమ సన్నాహం పూర్తిచేసుకొని పెట్టెసర్దుకొని బయలుదేరి వెళ్ళబోయేముందు భర్తకు నమస్కరించి అనుమతి తీసుకోవాలని ప్రయత్నించింది. కాని కుమార్ అంతకు ముందే ఇంట్లోంచి అంతర్ధానమైనాడు. సుషమ కన్నుల నుండి ప్రవహించే దుఃఖభాష్పాలను తుడుచుకొంటూ పూజామందిరంలోకి వెళ్ళి గోడకు వ్రేలాడగట్టబడిన పతి యొక్క ప్రతిబింబముముందు తలవంచి మోకరించి వందనం చేసింది. హృదయం దుఃఖంతో నిండిపోయింది. ఎక్కడనైనా పతిరూపం ప్రత్యక్షమౌతుందేమోఅని కన్నులు నలుదిక్కుల పారచూస్తున్నాయి. లాభమేముంది? పతియొక్క ప్రతిబింబాన్నితీసి బట్టలోచుట్టి భద్రంచేసుకొని పూజామందిరం

దాటి వెలుపలకువచ్చింది. ఛాయవలె దాసి వెంటవస్తోంది. సేవకుడువచ్చి ఆమెకు నమస్కరించి "అమ్మగారూ! సామాను బండిలోపెట్టించాను. తమరుకూడ బండి ఎక్కండి" అని ప్రార్థించాడు. కాని సుషమ అందుకు అంగీకరించక సామానుమాత్రం బండిలోఉంచి తాను పాదచారిణియై వెళ్ళడానికే నిశ్చయించుకొంది.

గడియకాలంలో ఈవార్త ఊరంతా పాకిపోయింది. జమీందారు కుమారబాబు భార్యను పుట్టినింటికి పంపించి వేస్తున్నాడన్న సంగతి అందరికి తెలిసింది. గ్రామవాసినులగు స్త్రీలకు పురుషులకు సుషమయందు హద్దుమీరిన శ్రద్ధా గౌరవాలున్నాయి. ఆతల్లి వెళ్ళగొట్టబడిందన్నమాట వినగానే అందరిహృదయాలు ద్రవీభూతమైనాయి. కన్నీరు కార్చారు. కొందరు కుమార్ ఇట్టిపనిచెయ్యడం బాగుండలేదని విమర్శించారు. కాని అతని ఎదుటికివెళ్ళి నీకిది తగదని చెప్పగలవారెవరు? ఒకరుచెప్తే వినేస్వభావమా!

పుట్టినింట రాణివలె సుఖపడడంకన్న అత్తవారింట్లో భర్తసన్నిధిలో దాసిగానైనా ఉండడం ఉత్తమధర్మం అన్న సంగతి సుషమకు తెలియకపోలేదు. అయినప్పటికి పతిగృహం వదలి వెళ్ళడానికి ఆమె ఏకారణంతో అంగీకరించిందో ఆమెకే తెలియాలి. ఇతరులకేమి తెలుస్తుంది.

గమ్యస్థానంచేరగానే సుషమ సేవకునిద్వారా భర్తకొక జాబుపంపించింది. దానిలో ఈ క్రిందిసంగతులు వ్రాయబడిఉన్నాయి.

పూజ్యులైన ప్రాణేశ్వరుల చరణసన్నిధికి—

అదృష్టముకానిండు, దురదృష్టముకానిండు. మీ మార్గానికి నేనిప్పుడు కంటకంగాలేను. సర్వవిధములా నేనుండడం ఆటంకమనే ఊహించి మీరు నన్నుదూరం చేశారు. మీఊహ నిజమే. మీస్వేచ్ఛామార్గానికి నేను సర్వదా కంటకంగానే ఉంటాను. మీ చిత్తవృత్తి మారకుండావున్నంతవరకూ ఈబాధ మీహృదయంలోంచి పోయేదికాదు. మీరు నాకు జాబువ్రాస్తారని తలంచను. వ్రాయవలసిన అవసరమేముంది? ఒకమనవి. వెనుకటవిష యమే మళ్ళా ప్రార్థనాపూర్వకంగా విన్నవించుకుంటున్నాను. మీరు ఇకమీదనైనా మీకర్తవ్యాకర్తవ్యములు మంచిచెడ్డలు బాగాయోచించమని, యుక్తాయుక్తపరిజ్ఞాతలై సావధానులై ఉండాలనీ, మోహావశులై కామాంధకారమగ్నులై దురవస్థలకు, ఆపదలకు గురికాకుండావుంటారని ప్రార్థిస్తున్నాను. నేను ఎక్కడఉన్నా మీసుఖాన్ని కోరుతూ ఆనందంగానే జీవయాత్ర గడుపుతాను. నన్ను మీరు దూరంగాతోసివేసినా నేను మీభార్యనే. నేను పరిత్యక్తనైనా మీకే నాసర్వస్వం. మీ క్షేమంకోరేది నేనే. విశ్వసించండి.

ఇట్లు,

తమ చరణదాసి—సుషమ.

# 10

కుమార్ సేవకుడిచ్చినజాబును ఒకవిధమైన ఉన్మాద స్థితిలో అందుకున్నాడు. వెంటనే చదవాలనిబుద్ధిపుట్టి కవరు చించి అందులోని కాగితాన్ని పైకితీశాడు. భార్య హస్తాక్షరాలనుగురించి తన్ను క్షమాపణకోరుతూ వ్రాసిందేమో అన్న భావోద్రేకంతో జాబంతా ఒక్కగుక్కలో చదివేడు. ఏమిలాభం? అతనిఊహకు వ్యతిరేకమైంది. తాను విధించిన శిక్షకు భార్య దుఃఖపడుతూ క్షమాభిక్షయాచించే సూచన అందులో ఏమీ కనపడలేదు సరిగదా ఎదురు తన్నే సావధానంగా ఉండమని చేసే హెచ్చరికలు దృగ్గోచరమైనాయి. ఉత్తరమంతా చదివేసరికి అతనికి తిరస్కారపూర్వకమైన నవ్వువచ్చింది. గబగబా ఇట్లా అనేశాడు. "పల్లెటూరిగబ్బిలాయి! ఇంట్లోంచి వెళ్ళగొట్టినతర్వాతకూడా నామీద అధికారం చెలాయించాలని హెచ్చరికలుచేస్తోంది. మూర్ఖురాలా! నేనుచాలా జాగ్రత్తగాఉన్నాను. నువ్వు ఏమౌతావో, నేను వెళ్ళగొట్టినతర్వాత నీ భవిష్యత్తు ఎట్లాఉంటుందో ఆలోచించుకో. ఏమిచెయ్యాలని ఆలోచించుకుని అంతధైర్యంగా వెళ్ళిపోయావో, నీ భవితవ్యం ఎట్లా పరిణమించబోతుందో సావకాశంగా యోచించు. నావిషయం నీకక్కరలేదు. బుద్ధిహీనురాలా! చింతచచ్చినా పులుసుచావలేదన్నట్లు ఇంట్లోంచి వెళ్ళగొట్టినా దర్పంపోలేదు. ఓహోహో ..." అంటూ నవ్వుకున్నాడు. కొంతసేపైనతర్వాత ఎక్కడికో వెళ్ళిపోయాడు.

యథాప్రకారంగా మాధురి అతనికంఠానికి చుట్టు

కొంది. భోగవిలాసాలు, నాట్యకలాపాలు, సురాపానాది కార్య క్రమం మామూలుగా నడిచిపోతోంది. కుమార్ మహాసము ద్రంలో మునిగి గుటకలు వేస్తున్నాడు. మాధురి అందుకు దోహదమిస్తోంది. యౌవనపు పొంగు, సౌందర్యోన్మాదం రెండుపక్కల ప్రకాశిస్తూంటే దృగ్బలం తగ్గిపోకుండా ఉంటుందా!

ఈరీతిగా సంవత్సరాలు గడిచినాయి. స్థితిగతులు ఏమౌతున్నాయో ఎట్లా మారుతున్నాయో ఎవరికీ తెలి యడంలేదు.

* * *

"అమ్మాయీ! సోమా! నువ్వు నానాటికి కృశించి పోతున్నావేమి?"-మాధవచంద్రుడు సుషమకు మేనమామ. చిన్నప్పటినుండి ప్రేమతో పెంచి పెద్దదాన్ని చేశాడు. చాలా సజ్జనుడు. ఔదార్యబుద్ధి, ఉపకారస్వభావంగల సుహృద యుడు. సుషమయందున్న సదాచారసద్గుణసంపత్తికి చిన్న తనంనుంచి మేనమామ ఇచ్చిన శిక్షణ, చేసినబోధయే కార ణం. అందుచేతనే మాధవచంద్రునియందు ఆమెకు గొప్ప పూజ్యభావం - అపరిమితమైన శ్రద్ధ. మేనమామ అండనుండి తనకు సంభవించిన ఆపత్తునుండి రక్షణపొందాలన్న నమ్మ కంతో సుషమవచ్చింది. మేనగోడలియందు వ్యక్తమౌతూన్న మార్పులనుచూచి కొంతవరకు ఊహించుకొన్నాడు. ఇక ఆగలేక ఆమెను ప్రశ్నించాడు. మేనమామప్రశ్నకు సుషమ ఈవిధంగా సమాధానంచెప్పింది. అతివేగంగా వస్తూండే కన్నీటిని బలవంతాన ఆపుకొంటూ లేనినవ్వును తెచ్చుకొని

జవాబు చెప్పింది. "లేదు మామా! కృశించడానికి తగినంత పెద్దవిచారం ఏమీ లేదు. ఏదైనాఉంటే నీదగ్గిర దాచగలనా ?"

మాధవబాబు నవ్వుతూ "చాలా బాగాఉందమ్మా, నీజవాబు! కడుపులోఉన్న విచారాన్ని దాచాలని నువ్వు ఎంతప్రయత్నించినా నీముఖంలో నీకుగల మనోవిచారమంతా గోచరిస్తూనేఉంది. మనోభావాలను నాదగ్గర గోప్యం చేస్తావా? నేనెవర్నో గుర్తించావా?" అని అన్నాడు.

"మామా! నిన్నే గుర్తించలేకపోతే ఇంతకన్న కృతఘ్నత ఇంకొకటిఉండదు. నువ్వు నా ఆశ్రయదాతవు. నా రక్షకుడవు. నాపాలి—"

"పిచ్చిదానా! అంతటితో చాలించు. ఆశ్రయమిచ్చేవాణ్ణి నేనా? నాకా శక్తిలేదు. అందరికీ ఆశ్రయదాత భగవంతుడు. మామా! అని పిలిచావు. అదిఒకటే ఒప్పుకోతగిన విషయం. నీకు నేను మేనమామనుకావడం ఒకటే నిజం."

"నేను అనడంకాదు. ప్రపంచకమంతా ఈమాటే అంటోంది. నువ్వు నాకు ఆశ్రయమీయకపోతే నాగతి ఏమికావాలి? నేను ఏమైపోయేదాన్నో, ఆయన ఈ విధంగా—"

సుషమ రెండుకళ్ళవెంట దుఃఖాశ్రువులు అవిరళంగా ప్రవహిస్తున్నాయి. కంఠం బిగిసిపోవడంచేత మాట సరిగా రావడంలేదు. కుర్చీకి చేరగిలబడి వెనుకకు ఆనుకొని విచారంలో మునిగిపోయింది.

మాధవచంద్రుడు "అమ్మా! దుఃఖపడకు. ఆపత్కాలమందు ధైర్యం తెచ్చుకోవాలి. నీవిషయంలో అతను చాలా అన్యాయంచేశాడు. ఇందుకు తగినఫలం అనుభవిస్తాడు. నిరపరాధినివి, గుణవతివగు నీపరితాపం, నీకన్నీరు—" అని ఓదారుస్తుండగా,

"ఆ పైమాట అనవద్దు మామా! నేను వినలేను. వారికి అనర్థాన్నిసూచించే ఒకమాటకూడా నేను వినలేను. ఆయన నన్ను విసర్జించినాసరే, నే నాయనకు దాసినే. వారి పాదసేవకురాలినే. కాని పితృపితామహార్జితమైన ఆస్తి,ఎస్టేటు అంతా చాలవరకు దుర్వ్యయంచేశారు. ఇంకా చేస్తున్నారు. నాకు పూటకూటికి గతిలేకపోయినా, బిచ్చమెత్త వలసివచ్చినా ఏమీ విచారంలేదు. విచారించను. ఆగర్భ శ్రీమంతుడైన నాపతి కటికదరిద్రుడై, అన్నవస్త్రాలకు ఎడమై తిరుగుతూండడం నేనెట్లా చూస్తాను? అక్కడనుండి రావడం నాకెంతమాత్రం ఇష్టంలేదు. కాని ఏంచెయ్యగలను? పరిస్థితులు పూర్తిగామారి తలక్రిందైనపుడు, ఆ ఇంట్లో నాకెంతమాత్రము అధికారముగాని పలుకుబడిగాని లేనిసమయంలో నేనింకా ఎటువంటి దుర్గతికి, దురవస్థకు పాల్పడతానోనన్న భయంచేత తప్పించుకుని ఇవతలకు, నువ్వేదైనా ఉపాయంచెప్తావన్నఆశతో వచ్చాను. మామా! ఈవిధంగా ఉన్నసర్వస్వం నాశనమైతే ఆయనగతి ఏం కావాలి?"—అంటూ సుషమ ఒక పెద్దనిట్టూర్పువిడిచి కన్నీరు తుడుచుకొంటూ కూర్చుంది. ఆమెహృదయంలో చెప్పశక్యంగాని విచారాగ్ని ప్రజ్వరిల్లుతోంది.

"నీవంటి పవిత్రచరిత్రకు, గుణవంతురాలికి తగిన ఆలోచనే ఇది. కాని నేనుకాకపోతే ఇంకొకరైనా చేయ గలిగిందేముంది? నీభర్త చేతులార అగ్నిగుండం తయారు చేసుకొని అందులో దూకడానికి సిద్ధపడుతూంటే ఎవరు రక్షి స్తారు? తనకురానున్న దుర్గతిని గ్రహించుకోలేక గోతిలోపడ బోయే వ్యక్తిని కాపాడడం కష్టం. లేశమాత్రమైనా తన అవ స్థను తాను తెలుసుకొని రక్షింపబడాలనే భావం అతనికి ఉంటే ఏదైనా ఒకదోవ ఆలోచించవచ్చు" అని అన్నాడు మాధవబాబు.

"మామా! నువ్వుకూడా ఇట్లాఅంటే నాగతేమిటి? ఏదైనా దారిచూపిస్తావని కొండంత ఆశపెట్టుకొనివస్తే నాకు నిరాశకలిగిస్తే నేనేమైపోవాలి? ఆయనగతేమిటి?"

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. మార్గం దొరికితే వదుల్తానా?"

"కాలయాపనచేస్తే లాభంలేదు మామా! ఈ ఆప త్కాలంలో భగవంతుడు నాకు నిన్నే చూపించాడు. నీకన్న ఇంకో ఆధారంలేదు. ఈ నమ్మకంతోనే నేను నీదగ్గి రకు వచ్చాను. నాకేదైనా దోవచూపించకపోతే—" తల్ల డిల్లింది కొంతసేపు సుషమ.

మేనగోడిలి దైన్యస్థితిజూచి మాధవబాబు ఆలోచ నలో నిమగ్నుడైపోయాడు. పదినిముషాలు గడిచినతర్వాత "సరే. నువ్వు అధైర్యపడవద్దు, సుషమా! నీకన్న నాకు ఆప్తి యులు ఎవరున్నారు. నాశక్తినంతా వినియోగపరచి ప్రయ త్నిస్తాను పైన దేవుడున్నాడు. అంతకన్న మనం చేసేదేమీ

లేదు. ఇంతకూ నీఅదృష్టం బాగాఉంటే అంతా చక్కబడు తుంది. కాని ఒకవిషయం అడుగుతాను. అతణ్ణి ఇంతవరకూ తీసుకొనివచ్చిన ఆ మాయావిని ఎవరు? ఆమెనుగూర్చి నీకేమైనా తెలుసునా!" అని అన్నాడు.

సుషమ కన్నీరుకారుస్తూ తనకు తెలిసినంతవరకూ జరిగినవృత్తాంతమంతా మాధవబాబుకు తెలియజేసింది. అతను యావద్వృత్తాంతము విని నిశ్చేష్టుడై శిరఃకంపనంచేస్తూ "సుషమా! ఒకపని చేస్తావా!" అన్నాడు.

"ఒకటేమిటి! నువ్వు ఎన్నిచెప్పినా చేస్తాను. ఏం చెయ్యమంటావు మామా!"

"ఆ రాక్షసిపేర ఒక జాబు వ్రాయవమ్మా."

"ఇదివరలో నేను వ్రాశాను. కాని—"

"పర్యవసానం ఏమైంది! జవాబు వ్రాయలేదా?"

"లేదు."

"నీకష్టమంతా వెల్లడిస్తూ ఇంకోజాబు వ్రాస్తావా!"

"లాభం ఏమిటి మామా!"

"ఆమెలో స్త్రీత్వమనేది ఉంటే, దయాభావం ఏమాత్రమైనా ఉండివుంటే ఈమారైనా నీదుఃఖితహృదయాన్ని గుర్తించకపోదు. నామాటవిని ఇంకోజాబు వ్రాసి పంపించు. దీనివలన చెడిపోయేది ఏమీలేదు..." అన్నాడు మాధవబాబు.

సుషమ సరేనని తలఊపింది. మాధవబాబు తిరిగి విచారతరంగాల్లో కొంతసేపు మునకలువేస్తూ కూర్చు

న్నాడు. తరువాత హటాత్తుగా లేచి పకపకనవ్వుతూ సుష మనుచూచి—

"సుషమా! ఆలోచించాను. అట్లాచేసి చూస్తాను" అంటూ లేచి వెర్రివానివలె అటుఇటు పచార్లుచేయడం సాగించాడు. సుషమ మాధవబాబు అన్నమాటలోని భావం గ్రహించలేకపోయింది ఏమో ఆలోచించుకుంటూ గృహ కార్యాలలో మునిగిపోయింది.

* * *

"మాధురీ!"

"మాధురీ!...మిస్ లిలీ! ఏదీ! ఒక్కమాట."

"చాలుచాలు. మాధురి ఇటువంటి సోమరులతో వ్యర్థులతో మాట్లాడదు."

పై సందర్భాన్నిబట్టి వారిద్దరూ మాధురీకుమార్ లని తెలుస్తూనేఉంది.

"సోమరి - వ్యర్థుడు - చాలా బాగాఉంది. సాహ సంతో అనేశావు. ఔను ఎందుకు అనవూ! ఈనాడు జమీం దారీఅంతా వేలాముకువచ్చింది. స్తోత్రాలుచేసుకొంటూ వెంటతిరిగే స్నేహితులెవరూలేరు. అందుచేత ఈనాడు నీ దృష్టిలో సోమరిపోతు, వ్యర్థుణ్ణి అయినాను. వెనుకటి కుమారబాబును కాలేకపోయాను. కనకవర్షం నీఎదురుగా కురిపించలేని నేను వ్యర్థుణ్ణే. నువ్వు అట్లాఅనడంలో తప్పే ముంది?" అని అన్నాడు కుమార్.

"చాలుచాలు. కనకవర్షం కురిపించడానికి చాలా మంది ఉన్నారు. వారిలో నీవంటివాళ్లెవరూ లేరు."

"కానీ. ఇంకా ఏమి అనదలచుకొన్నావో అను."

"నేనేమీ అనదలచుకోలేదు. నీతో అనవసరంగా మాట్లాడుతూ కూర్చోడానికి నాకు సావకాశంకూడా లేదు. నాప్రాణంతియ్యక నన్నువదిలి నీ ఇష్టంవచ్చినయింటికి వెళ్ళు" అని కసిరింది మాధురి.

"మాధురీ! నీఇంట్లో నాకు స్థానంలేదా?"

"లేదు. ఎంతమాత్రమూ లేదు."

"మాధురీ! నీది హృదయమా! లేక పాషాణమా!"

"వెనుకటివిషయం వదిలిపెట్టు. ఇక్కడినుంచి నాది హృదయంకాదు. నల్లరాయి."

"ఆహా! మాధురీ! నిన్ను నేను ఎంతపొరపాటుగా అర్థంచేసుకొన్నాను?"

"నువ్వేకాదు. నేనుకూడా చాలా పొఱపాటు చేశాను. మాయమాటలకు ఇచ్చకాలకు మోసపోయి ఒక అయోగ్యునికి నాగౌరవాన్ని సమర్పించి ఎంత తప్పుచేశానా అని అనుకొంటున్నాను."

"మాధురీ! పుండుమీద కారంచల్లినట్లు మాట్లాడుతున్నావు. ఇంతకాలానికి నీకు నేను అయోగ్యుణ్ణిగా కనిపించానంటే ఆశ్చర్యం ఏముంది? ఈనాడు నేను దరిద్రుణ్ణి. జమీందారీఅంతా పోయింది. గౌరవంఅంతా నాశనమైంది. పరివారం, మిత్రగణంఅంతా మాయమైంది. అందుచేత నీ దృష్టిలోంచికూడా నేను తొలగింపబడ్డాను. నీచేత ఈదినం సోమరిపోతు - వ్యర్థుడు - అయోగ్యుడు, ఇంకా ఏమేమో మాటలు పడుతున్నాను. కాని, మాధురీ! ఆలోచించి

చూడు, నిన్ను ఎంత ప్రేమించానో, నీకోసం ఎంత త్యాగం చేశానో కొంచెం జ్ఞాపకం తెచ్చుకో. ఉన్నంత కాలము సర్వమూ త్యజించి నీ సౌందర్యాన్ని ఆరాధించాను. నీ కోర్కెలన్నీ తీర్చాను. ఈనాడు నా ఎస్టేటు అంతా పోతూన్నప్పటికీ విచారం లేదు. ఈస్థితిలో నాకు అది దక్కుతుందనే విశ్వాసం లేదు నిజం చెప్తున్నాను. నీ హృదయంలోంచి నేను తొలగింపబడిన తరువాత జీవించడం కష్టం. మాధురీ! నన్ను కఠినంగా చూచి తిరస్కరించవద్దు. నా ప్రేమను తోసివెయ్యక ఒకసారి వెన్నెలకంటె చల్లగా ఉండే నీ మందస్మితవదనాన్ని నాకు చూపించి కడుపులో ఉండే ఆవేదనను చల్లార్చు"— దీనంగా చెప్పాడు కుమార్.

కుమార్ మాటలు వినగానే మాధురికి కనుబొమలు ముడిపడ్డాయి. చెక్కిళ్లు రంగుమారిపోయినాయి.

రెండునిమిషాలు నిదానించి చూచి కోపంతో "చిరునవ్వు ఎందుకు? నిన్ను చూస్తే పెద్దనవ్వొవస్తోంది. కుమార్! చింతవిరిగినా పులుపు చావలేదు ఆ మాటలు కట్టిపెట్టు. నేను వినదలచుకోలేదు. ఒకటేమాట చెపుతున్నాను. నువ్వు నీ గౌరవాన్ని కాపాడుకోదలచుకొంటే నన్ను వదిలిపెట్టి దూరంగా వెళ్ళిపో. నేను నీముఖం చూడదలచుకోలేదు. నేను వేశ్యనన్న సంగతి నీకు తెలుసు. వేశ్య డబ్బునుగాక దేనినీ ప్రేమించదు. విటుని ధనముతోగాక వాడి అందచందాలతో వేశ్యకెట్టి సంబంధం ఉండదు. వారాంగనా సాంగత్యం అంటే డబ్బుతోగూర్చిన ఆట. నాకు డబ్బు కావాలి. వెలలేక వెలయాలు దొరకదు. ఈ సంగతి నీకూ

లోకానికీకూడా తెలిసిన విషయమే. వివరంగా చెప్తున్నాను. నా ఇంట్లో నా సమీపంలో నీకు స్థానంలేదు. నిన్ను నిముషం కూడా వుండనియ్యను. నువ్వు వుంటే నాపని సాగదు. నువ్వు ఎంత తొందరగా వెళ్తే అంతక్షేమం.” అన్నది మాధురి.

తానొక మహాపర్వతంనుండి కిందకు తోయబడ్డానని కుమార్ తెలుసుకొన్నాడు. మొదట పరిహాసమనుకొన్నాడు. వ్యవహారం ముదుసపాకంలో పడుతూన్నకొద్దీ మాధురిమాటలను వింటూ తనచెవులను తానే నమ్మలేకపోయాడు. తన్ను నిరంతర ప్రేమసముద్రంలో ముంచి తేలుస్తూండే తన ప్రియురాలే ఇట్లా మాట్లాడుతోందా! అని ఆశ్చర్యపడ్డాడు. వెంటనేలేచి నిరాశతో “మాధురీ! నువ్వు అన్నమాటలు హృదయపూర్వకంగా అంటున్నావా? నిజమేనా! నాపైగల ప్రేమంతా నశించినట్లేనా!” అని అన్నాడు కుమార్.

“ముమ్మాటికీ నిజం. లేచి త్వరగా వెళ్లిపో. నీకుగా నువ్వు వెళ్తేనే గౌరవం. లేకపోతే నౌకరుని పిలిచి—” అన్నది మాధురి.

అమాయకుడు మోహాంధుడగు కుమార్ మాధురి ఏదో పరిహాసం చేస్తోందనే భావిస్తూ ఆమెను దగ్గరకుతీసుకోవాలనే ఊహతో సమీపిస్తున్నాడు. మాధురి వెంటనే లేచి పక్కనున్న అలారంస్విచ్ నొక్కింది. వెంటనే ఒక పంజాబీ పహిల్వాన్ వచ్చి నిల్చున్నాడు. అతన్ని చూపిస్తూ, “కుమార్! త్వరగా వెళ్లిపో. పొఆబడికూడా

ఈవైపుకు రావద్దు, తెలిసిందా? లే! ఇక్కడనుండి వెళ్ళిపో." అంది కుమార్‌నుద్దేశించి.

కుమార్ కళ్ళనీళ్ళుతుడుచుకుంటూ ఆమెముఖాన్ని భావగర్భితమైన చూపులతో చూశాడు. వెనుకటిప్రేమ ప్రణయలీల మొదలగు చిహ్నాలు కడిగివేయబడ్డాయి ఇక లాభంలేదనుకొన్నాడు. గతదినం తన్ను అశేషగౌరవంతో చూచిన ప్రియురాలు ఈనాడిట్లా మారిపోయి తన్ను వెళ్ళ గొట్టడానికి కారణం ఊహించుకోలేకపోయాడు. ఎక్కువ సేపు నిలిస్తే సేవకుడువచ్చి తోసివేస్తాడేమో అన్న భయంతో కన్నీరిడుతూ గదివదిలి వెళ్ళిపోయాడు. మెట్లుదిగి వెళ్తూండగా దుఃఖావేశం అధికమైపోవడంచేత కళ్ళుమూసు కొని దుఃఖాశ్రువులు తుడుచుకొంటూ ఒకమెట్టువదిలి కిందమెట్టుమీద కాలువేయడంలో జారి కిందపడి "అమ్మో!" అని కేకవేశాడు.

మాధురి పైననిల్చుని కుమార్ ఆవేదన, అతని నిష్క్రమణ, కాలుజారిపడడం, అన్నీ గమనిస్తూనే వుంది. కాని ఈనాడామెహృదయం శిలాసమమైంది. అతని దుర వస్థ చూస్తూ లోపలికి వెళ్ళింది. కాని ఆదరించలేదు. కుమార్‌యందు ఆమెకుగల మమత, ప్రేమ, సానుభూతి అన్నీ తొలగిపోయాయి.

కుమార్ మెల్లిగా లేచి కాలు స్వాధీనంచేసుకొని నడిచి వెళ్ళిపోతున్నాడు. అతనిచెవులకు మేడమీద గదిలో మాధురి నవ్వడం, సంగీతం పాడడం అన్నీ వినిపిస్తున్నాయి. ఒక్కమారా మేడను శూన్యదృక్కులతో చూచి అంధకా

రంలో ప్రయాణం సాగించాడు. ఎక్కడికి వెళ్తున్నాడో అతనికే తెలియదు. మాధురీ! మాధురీ! మాధురి ఎంత పనిచేసింది! జమీందారు కుమారబాబును దురదృష్టదేవత ఈనాడు ఒక దరిద్రునిగా, శక్తిహీనునిగా, అగతికునిగా చేసి సాగనంపుతోంది. ఆహా! కాలమెంతలో మారిపోయింది!

కుమార్ దురవస్థచూచి కన్నీరువిడిచేవారెవరూ ఆసమయంలో లేకపోయారు.

# 11

మాధురి దయార్ద్రహృదయంకల ప్రేమమయి. మూర్తీభవించిన పరమసుస్వభావ. ఇట్టి సుగుణవతికీ కాఠిన్యభావం ఎట్లా వచ్చింది? అని ప్రశ్నించుకొంటే కారణం దొరకక పోదు. ఏదో నిగూఢమైన కారణం వుంటేనేగాని ఆమె కుమార్ విషయంలో అట్లా ప్రవర్తించివుండదు. అతనివిషయంలో అంత అమానుషంగా రాక్షసభావం కనపరచిందంటే గొప్పరహస్యం ఇమిడివుందని గ్రహించాలి. ఆమె వేశ్యగానే లోకంలో వ్యవహరింపబడుతోంది. అయితే ఏమి? వేశ్యలకుమాత్రం హృదయం వుండదా? కేవలం ధనమే ప్రధానమా? విటులను వంచించి ధనసంగ్రహణం చేస్తూండడమే వారికార్యక్రమమా!......అట్లాఎప్పుడూ ఊహింపకూడదు. సమాజం వారినెంత తిరస్కారంతో హేయదృష్టితో చూస్తూన్నప్పటికీ వాళ్ళకుకూడా దయాహృదయం, ఆత్మసన్మానం, పరోపకారబుద్ధీ మొదలైన గుణాలుంటాయని గ్రహించాలి. వాళ్ళసదాశయాలు-సద్గుణాలు లోకా

నికి వెల్లడికావడానికి సంఘం ఎంతమాత్రం సహకరించడం లేదు. మాధురి ఎంత దూష్యవాతావరణంలో పెరిగినప్పటికీ తనలోవున్న మానవత్వాన్ని ఆమె పోగొట్టుకోలేదు. కాని కుమార్ విషయంలో అట్లా ఎందుకు ప్రవర్తించింది? ...అని విచారించితే ఆసమయంలో ఆమె చూపిన కాఠిన్యభావం హృదయపూర్వకంగా కలిగిందికాదని స్ఫురిస్తూంది. అప్పటి ఆమెస్థితి క్షంతవ్యమే.

తాను చేసినపనికి మాధురి విచారించకపోలేదు. ఆమెకు ఎంతో సంతాపంకలిగింది. ఆమె పురోగమించాలనుకొన్న మార్గానికి స్థిరచిత్తంతో అభిముఖురాలైంది. తన కర్తవ్యం ఎంతకఠినమైనా, మనస్సంతాపకరమైనాసరే దీక్షతో ఆత్మవిజయాన్ని సంపాదించి కృతార్థురాలు కావాలనుకొంది. ఒకవిధమైన తుఫానుగాలి చెలరేగి ఆమె మస్తిష్కాన్ని కంపింపజేసింది. ఏకాంతంగాకూర్చుని రోదనం చెయ్యడం ప్రారంభించింది. గంటలకొద్దీ కాలంగడిచినా దానివలన ఆమెకుశాంతికలగలేదు. బైటికివచ్చి నిరావరణ ప్రదేశంలో చాలాసేపు తిరిగింది. అప్పటికీ ఆమెమనస్సుకు స్థాయీభావం లభించలేదు ఎందుచేత? ఆమె కుమార్‌ను ప్రేమిస్తోంది. ఆప్రేమలో ధనవాంఛగాని కుమార్‌ను నాశనంచెయ్యాలన్న దురుద్దేశ్యంగాని ఏమీలేదు. త్రికరణశుద్ధిగా అతని పవిత్రప్రేమనే వాంఛించింది. దానిఫలితం ఏమైంది? కుమార్ పతనుడైపోయాడు. ఎస్టేటుపోయింది. నిర్ధనుడైనాడు. గౌరవం అంతా మట్టిపాలైంది. దీనికి మాధురి ఎంతమాత్రం కారణంగాదు. అతని తెలివితక్కువతనం,

భోగలాలసత్వం, నీతివిరుద్ధమైన ప్రవర్తన, మొదలైనవే కారణాలు. ఎట్లాగైనాసరే కుమార్‌ను కాపాడాలనే తలంపుతో మాధురి హెచ్చరించినా అతను వినేస్థితిలోలేడు. వ్యసనాభిముఖమైన మార్గంలోంచి తప్పించడానికి ఆమెకు సులభమైనమార్గమే గోచరించడంలేదు. అధోగతికి పాల్పడే కుమార్‌ను రక్షించాలనే తలంపు గాఢంగానేఉంది. కాని అందుకుతగిన ఉపాయమే కనపడలేదు.

ఈదినం మాధురిహృదయం ఈరీతిగా పరివర్తన మైందంటే అందుకుదగినకారణం మేనమామచెప్పిన ప్రకారం సుషమవ్రాసిన రెండవజాబే. మేనమామ స్వయంగా తెచ్చిఇచ్చాడు. కుమార్ ఆవిధంగా నిర్దాక్షిణ్యంగా వెళ్ళగొట్టబడడానికిదే హేతువు. విధిలేక వేరు ఉపాయం కనపడకపోవడంచేత మాధురి గుండెరాయిచేసుకొని కుమార్‌ను వెళ్ళగొట్టింది. శాశ్వతంగా కుమార్ ఆమె దృక్పథానికి కనపడకుండా వెళ్ళిపోయాడు. ఆనాడు తాను ఆలోచించినప్రకారం మేనగోడలువ్రాసిన జాబుతీసుకొని మాధవబాబు మాధురినికలుసుకొని ఉత్తరం ఇయ్యడమేగాక అనేకవిధాలుగా సుషమయొక్క దీనావస్థను ఆమె యెదుట వివరించాడు. అందుచేత దయాస్వభావంగల మాధురి సుషమకష్టంవినలేక కుమార్‌ను బలవంతంగా వెళ్ళగొట్టింది. మాధవబాబు తనబుద్ధికుశలతను ఉపయోగించి పన్నినపన్నాగం బ్రహ్మాస్త్రంగా పనిచేసింది. ఏదోవిధంగా మాధురిమీద విరక్తికలిగితే తరువాత నెమ్మదిగా కొంత

కాలంజరిగినపిదప కుమార్‌ను భార్యాభిముఖునిగా చేయ వచ్చునని అతని విశ్వాసం.

కుమార్ వెనుకటికుమార్ కాడు. ఏకాకి. నిరాశ్రయుడు. చింత, శోకం, మనస్తాపం మొదలగువానిచే దగ్ధహృదయుడైనాడు. ఎక్కడికి వెళ్లేడో, ఏవైపుకు పోయాడో, పిచ్చివాడివలె ఏసందుగొందులు తిరుగుతున్నాడో ఎవరికీ తెలియదు. విషాదపూర్ణమైన అతనిస్థితినిచూస్తే ఎంతో జాలి విచారం కలుగుతుంది.

*   *   *

తనభర్త మాధురిచేతులనుండి తప్పింపబడ్డాడన్న వార్తనువిని సుషమ ఎంతో ప్రసన్నురాలైది. కాని అతను ఎక్కడికివెళ్లేడో ఏమికష్టపడుతున్నాడో అన్నదీర్ఘవిచారం కూడా ఆమెకుకలిగింది. అయినప్పటికీ తనమేనమామ ఏదోవిధంగా తనభర్తను తీసుకొనిరాగలనని, వచ్చిన వెంటనే జమీందారీవిషయాలను పతి స్వయంగా విమర్శించుకోగలడన్న ఆశకూడా మనస్సులో అంకురించింది. కాని కాలంగడచినకొద్దీ ఆ ఆశ నిరాశగా పరిణమిస్తోంది. కుమార్ వ్రణితుడైనాడు. ఒకదేహంమీద గాయమేకాదు. మనస్సుకూడా గాయపడ్డది. ప్రియురాలు పరిత్యజించింది. భార్య అతనిదృష్టిలోనే లేదు. నాఅన్న బంధువులెవరూ లేరు. ఉన్నా ఈస్థితిలోఆదరించరు. చెయ్యిదాటిపోతూన్న జమీందారీని కాపాడుకోడానికైనా ఈస్థితిలో భయంకర దురవస్థకుచిక్కి పతనుడై ఏమొహంపెట్టుకొని ఇల్లుచేరుకొంటాడు? వేశ్యాసాంగత్యమే అతని నీ దుర్గతికి తెచ్చింది.

చేతులార చేసుకొన్న పనికి, ప్రతిఫలం లభించిందనే పశ్చాత్తాపం, వేదన హృదయాన్ని దహిస్తూంటే, కర్తవ్యజ్ఞాన శూన్యుడై ఏవైపుకో వెళ్ళిపోయాడు. అతనిని రక్షించేవారెవరు?

సుషమ మనోవ్యధతో బాధపడుతోంది. తనకష్టాలను పోగొట్టి శుభాలను కలుగచెయ్యమని భగవంతుని ప్రార్థిస్తూంటుంది. మనసులో చెలరేగుతూన్న తుపాను గాలిని భరించలేక ఒకనాడు మేనమామతో అన్నది. "మామా! నువ్వునాసంగతి ఏమీ ఆలోచించడంలేదు. నాకష్టాలు తొలగిపోయే ఉపాయమే నీకు తోచలేదా!"

"అమ్మాయీ! నేను నిశ్చింతగా ఊరుకొంటున్నానని ఊహిస్తున్నావా?"

సుషను కన్నీరువిడుస్తూ "నేనట్లా అనగలనా? మామా! రానురాను ఈజమీందారీఅంతా పోతుందేమో అన్నభయం పీడిస్తోంది. భగవంతుడేమిచేస్తాడో" అన్నది.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. భగవంతునిమీద భారమువేసి మనపనిమనంచేస్తే తరుపరి ఈశ్వరాధీనం."

"ఇంతవరకూ ఏమీ ఉపాయంతోచలేదు. అయిదారు దినాలలో మనకు మూడులక్షలరూపాయలెట్లాదొరుకుతాయి? ఎవరిస్తారు? ఏవిధంగా పోగుచెయ్యాలి? మామా! మామగారినాటి ఆ భవనం, ఆ పూజామందిరం చెయ్యిజారి పోవలసిందేనా?" ఉద్రేకంపట్టలేక సుషమ దుఃఖించడం ప్రారంభించింది. తనజీవితమనే దుఃఖాంతనాటకంలోని అంతిమదృశ్యాన్ని ఊహించుకొని కన్నీరుకారుస్తోంది. మేన

గోడలి దుఃఖంచూడలేక మాధవబాబు సమీపించి ఓదార్పు మాటలతో "అమ్మాయి సోమా! నువ్వు చాలా బాధపడు తున్నావు. కష్టాలలోంచి ఒడ్డునపడాలంటే ఏడిస్తేలాభం లేదు. ఇంతడబ్బు ఎట్లా పోగవుతుంది! అని భయపడు తున్నావు. కాని మానవప్రయత్నానికి అసాధ్యంలేదు. దైవానుగ్రహముంటే ఏదోవిధంగా సమకూడుతుంది. నువ్వు విచారపడవద్దు. ఏదోఒక ఆలోచనలో బుద్ధిని ప్రవేశపెట్టి ముందడుగువెయ్యాలిగాని దుఃఖపడితే మనస్సుచెడిపోయి సమకూడేకార్యంకూడా చెడిపోతుంది. అందుచేత పర మాత్మని నమ్మి ధైర్యంగావుండు" అన్నాడు.

సుషమహృదయం సంశయాలతో ఊగులాడి పోతోంది. మేనమామమాటలవల్ల మనస్సుకొంచెం శాంత పడినా ఆ మాటలను విశ్వసించలేకపోతోంది. నాలుగుతాళ్లు తెగిన ఉట్టి ఏరీతిగా నిలువలేక కిందపడుతుందో ఆధారంలేని ప్రయత్నాలుకూడా అట్లాగే వుంటాయన్న నమ్మకం ఆమెకు కలిగింది. అయినప్పటికీ మాధవబాబు మాట యందు ఆమెకు విలువలేకపోలేదు. అందుచేత శిరఃకంపనం చేసి ఊరుకొన్నది. మాధవబాబువైపుకు కృతజ్ఞతాపూర్ణ మైన వీక్షణములతో చూస్తూ తలవంచుకొంది. ఆమె నేత్రాల్లో ఆ సమయంలో నైరాశ్యం, బుద్ధిమాంద్యం ఏమీ లేదు. శ్రద్ధాపూర్వకమైన రెండు నీటిబొట్లు కనురెప్ప లమీంచి జారిపోయాయి.

# 12

కుమార్ అవమానితుడై, తిరస్కృతుడై మాధురి ఉండే మేడనుండి వెళ్ళగొట్టబడి చాలా విచారంతో బయటకి దాటిపోయాడు. ఎక్కడకు వెళ్తాడు? ఎక్కడకి వెళ్ళాలి? అన్న ప్రశ్న తుఫానుగాలివలె మనస్సును కదిలించేస్తోంది. ఆ చీకటిరాత్రిలో సందుదాటి రోడ్డుమీదకు వచ్చాడు. విద్యుత్ కాంతిలో తన్ను తాను చూసుకొన్నాడు. ప్రపంచకాన్ని చూశాడు. ఎక్కడచూచినా అశాంతి చెలరేగుతోంది. హృదయంలో దావాగ్ని ప్రజ్వరిల్లుతూన్నట్లుంది. మాధురి అన్నమాటలు-ఆమెవల్ల పొందిన అపమానంతో మర్మాహతుడై తనసంగతిని గురించి తానే ఆలోచించుకోడం ప్రారంభించాడు. తనజీవితం ఎంత పెడమార్గంలో నడిచిందో, ఎంత అజాగ్రత్తతో సంచరించాడో అతనికిప్పుడు బోధపడుతోంది. ఒకప్పుడు తన్నెంతో గౌరవించిన జనాకీర్ణమైన నగరమంతా ఇప్పుడెంతో భయంకరంగా కొట్టవస్తూన్నట్లు అతనికి కనబడుతోంది. స్వయంకృతాపరాధం కారణంగా తనఇంటికి తనఎస్టేటుకు తానే దొంగయైనట్లు భావించుకొని పరులకంటబడకుండా అతిరహస్యంగా వెళ్లిపోతున్నాడు. మధ్యమధ్య తన్నెవరేనా చూస్తున్నారో లేక తన్ను వెంటాడి వస్తున్నారో అన్న సంశయంతో మాటిమాటికి నాల్గుదిక్కులు, ముందు వెనుక చూస్తూ వెళ్తున్నాడు. ఆలోచిస్తూన్నకొద్దీ అతని మానసికవ్యథ అధికమైపోతోంది. అంతా అంధకారమయమైపోవడంచేత తనభవిష్యత్కర్తవ్యాన్ని నిర్ధారణచేసుకోలేకపోతున్నాడు. నడిచి

నడిచి ఊరిబయట ఉండే ఒకపార్కులోకి వెళ్ళి నిర్జనప్రదేశంలోవున్న ఒక బల్లమీద చతికిలబడ్డాడు.

చేతిలోవున్న స్థిరచరాస్థులు, ఇళ్ళు మేడలు అన్నీ దాటిపోయినాయి. ఉన్ననాడు వెంటతిరిగిన స్నేహితులంతా మాయమైపోయారు. కుమార్ ఈసమయంలోనిస్సహాయుడు; నిర్ధనుడు, నిరాశ్రయుడై తన భావికార్యక్రమము ఎట్లా అని దీర్ఘంగా ఆలోచించడం ప్రారంభించాడు.

అత డావిధంగా ఆలోచనానిమగ్నుడై ఎంతసేపు కూర్చున్నాడో అతనికే తెలియలేదు. ఎంత యోచించినా అతనికక్కడ ఏదీ ఏమార్గం ఏమీ తోచలేదు. ఆ రాత్రి అంతా అక్కడనే గడపాలని నిశ్చయించి బల్లమీద పరున్నాడు. కొంచెంసేపటికి నిద్రపట్టింది. కాని నిస్సహాయుడు, అవమానితుడు, నిరాధారుడు, పీడితుడైన వ్యక్తికి నిద్రవస్తే మాత్రం ఎంతసేపుంటుంది? ఒకగంటసేపు గడిచినతరువాత మనోవ్యాకులం కారణంగా ఒక దుస్స్వప్నంవచ్చి వెంటనే త్రుళ్ళిపడి లేచికూర్చున్నాడు. స్వప్న సారాంశమేమనగా— "కొంతమంది పోలీసులువచ్చి చేతులుకట్టి బంధించి తనను నేరస్థునిగా నిశ్చయించి తీసుకొనిపోతూంటే తాను వారితో పెనుగులాడుతూ నేను నిర్దోషినని కేకలువేస్తున్నా వారు వినిపించుకోక లాఠీలతో కొట్టూ, తన్నుతూ లాక్కుపోతూన్నట్లు" కలగన్నాడు. మెలకువవచ్చి చూసుకొని తాను పార్కులో బల్లమీద పరున్నట్లు తెలుసుకొన్నాడు. కలవరపడిలేచి నాలుగుప్రక్కల పరిశీలించిచూశాడు. కంటి కెవరూ కనపడలేదు. అక్కడనుండి వెళ్లిపోదామనుకొన్నాడు.

ఎక్కడికి వెళ్ళాడు? అందులో ఇంత రాత్రివేళ! ఏ స్నేహితుని ఇంటికో లేక తనఇంటికో వెళ్ళగలడనుకొన్నా ఏవిధంగా వెళ్ళాడు? మార్గాలైతే వున్నాయి. ఏవూరువెళ్ళాలనుకొన్నా బండ్లున్నాయి, రైళ్ళున్నాయి. సౌకర్యాలు చాలానే వున్నాయి. ఉంటే ఏమిలాభం? ఏ మొహంతో వెళ్ళాడు? ఈ స్థితిలో నల్గురిఎదుటపడి మాట్లాడే సాహసం ఏది?... ఆలోచిస్తూన్నకొద్దీ తనకు సంభవించిన దుర్గతివలన శరీరం మీద జీవితంమీద అసహ్యభావం కలుగుతోంది. ఇంటికి వెళ్ళాలనుకొన్నాడు. అక్కడేమున్నది? ఎక్కడివస్తువు లక్కడే అంతరించిపోయాయి. ఎవరిచేతికిచిక్కింది వారు అపహరించారు. అప్పు పెట్టిన మహాజనులు (వర్తకులు) కోర్టులో దావావేసి తలుపులకు తాళాలుపెట్టించారు. కొద్దిదినాలలో ఆస్తి వేలంవేస్తారు. కనుక అక్కడకు పోయే సావకాశం ఏముంది? నెలజీతాలు లేకపోయేసరికి సేవకులంతా ఎక్కడివా రక్కడే సర్దుకొన్నారు. ఆత్మగౌరవం చంపుకుని వెళ్ళినా ఆదరించేవారు లేకపోగా ముఖంఎదుటనే అవమానపరచాలని వచ్చేవారు చాలామందివుంటారు. అందుచేత స్వగృహం అంతర్ధానమైపోయింది. భార్యయైన సుషమయొక్క స్వరూపం ఒకసారి క్షీణరేఖమాత్రంగా కుమార్‌కు భావగోచరమైంది. ప్రయోజనం ఏముంది? వృధా! ఆమెను స్మరించే అధికారం అతనికెక్కడవుంది? అన్ని ఆశలు అడుగంటేసరికి కన్నులు చీకట్లుకమ్మినాయి. నిల్వలేక బల్లమీదనే కూలిపోయాడు. కొన్నినిముషాలు నిశ్చేష్టుడై అట్లాగే పడివున్నతర్వాత తెలివివచ్చింది. తిరిగి

యథాప్రకారమే...ఆ భయంకర స్థితిలో అతనెంత మరచి పోవాలనుకొన్నా మరపుకురాకుండా తన ధర్మపత్ని సుషమ యొక్క సాత్వికస్వరూపం జ్ఞాపకంవస్తూనేవుంది. ఆమె అన్నమాటలు తలంపుకువస్తూనే వున్నాయి. ఆమెయొక్క ప్రేమ, మమత, తనమీాదగల భక్తి, అన్నమాటలు ఒక్కటొక్కటిగా, తలచుకొంటున్నాడు. ఎంత బతిమాలింది? కాళ్ళమీాదపడి కంటనీరుపెట్టుకొని ఎంతబోధించింది? ఆమెమాట ఒకటైనా విన్నాడా! వింటే తనకీగతి పట్టేదా? తనకట్టి మధురమైన, క్షేమకరమైన వుపదేశాన్ని ఇచ్చినందుకు ఆమెకు ప్రతిఫలం ఏమిటి? గృహబహిష్కారశిక్ష? ఎంతక్రౌర్యము! ఎంతనైచ్యము!... ఆమె ఎక్కడవున్నది? ఏవిధంగావెళ్ళాను? ఎక్కడదాకుకుతుంది? నా కష్టవార్తను ఆమె కెవరుచెప్తారు? అభిమానంచంపుకొని నిష్కారణంగా శిక్షితురాలైన ఆ సాధ్విని ఏ మొహంపెట్టుకొని పలకరిస్తాను? ......అని విచారించడం సాగించాడు. ఆసమయంలో అతనిహృదయనౌక మహావిచారసముద్రంలో భయంకర తుఫానుల రాపిడికి ఊగుతూ దొర్లుతోంది. ఎట్టినిశ్చయానికి రాలేకపోతున్నాడు. పొలం, ఆస్తి, ఇళ్ళు, ఎస్టేటు అంతా దావాలో చిక్కింది. డిక్రీఅయింది. వేలాంపాటకు రావడానికి సిద్ధంగావుంది ఆవిషయం జ్ఞాపకంరాగానే శరీరం గజగజ వణకిపోయింది.దుఃఖాశ్రువులు అవిరామంగా కళ్ళవెంట కారుతున్నాయి. హృదయవేదన పట్టలేక గబాలున నిల్చున్నపాటుగా నేలమీాద కుప్పగా కూలిపోయాడు.

కొంతసేపటికి తెప్పరిలి లేచినిల్చుని అట్టు ఇటూ

తిరుగుతూ ఆలోచిస్తున్నాడు. బ్రహ్మాండమైన తుపాను అతని మనసులో చెలరేగుతోంది. భయంకరవాతావరణం ప్రళయతాండవంచేస్తోంది. కాలం గడిచినకొద్దీ అతని హృదయంలోఉన్న దుఃఖమంతా కోపంగా మారిపోతోంది. హింసాభావం అంకురించింది. తనసర్వస్వాన్ని అపహరించి వెడలగొట్టిన మాధురిపై పగతీర్చుకోవాలనే సంకల్పం బలపడుతోంది.

ఆ దుర్మార్గురాలిని చిన్నతనంలోనే చేరదీసి భార్యకన్న అధికంగా ప్రేమించి సమస్తభోగాలుకలిగించి నాట్య సంగీతాలలో పేరుప్రఖ్యాతులు కలుగజేసి చివరకు కట్టుకున్న భార్యనుకూడ వెడలగొట్టి నా హృదయమందిరానికి రాణినిచేసి ఆరాధించినందుకు ఆ మాయావిని, పాపిని, విశ్వాసఘాతుకురాలు, ఈవిధంగా అవమానించి బయటికి పంపి నన్ను నిరాధారుణ్ణిచేసినందుకు వెంటనే పగ సాధించుకొంటేనేగాని కడుపులోమంట చల్లారదు. నాకుగల సర్వస్వాన్ని అపహరించి చివరకు నన్నుకాదని ఇంకొకపురుషుని ఎట్లా ప్రేమిస్తుందో చూస్తాను. శత్రుత్వం సాధించుకోవలసిందే. అప్పుడుగాని కడుపులోమంట చల్లారదు. నాకు కాకుండా ఇంకొక డామెను ప్రపంచంలో పొందలేడు. కసి తీర్చుకుంటాను.

ఈవిధంగా ఉద్రేకం హెచ్చినకొద్దీ కుమార్‌కు శరీరంలో ఉత్సాహం, నాడులలో శక్తి విజృంభించింది. లేచి షికారుచేస్తూ తనపగసాధించుకొనే ఉపాయమేమిటా అని ఆలోచించడం ప్రారంభించాడు. విచారమంతా క్రౌర్యంగా

హింసారూపంగా మారిపోయింది. పిడికిలిబిగించి పళ్ళుకొరుకుతూ అవమానంతీరే విధానంకోసం యోచించడం ప్రారంభించాడు. ఇంతలో కొంతమంది త్రాగుబోతులు గుంపుగా గూడి కుమార్ కూర్చున్న బల్లకు ప్రక్కగావస్తూన్నారు. వాళ్ళను చూడగానే మనస్సులో ఒకవిధమైన ఆశారేఖ చిత్రితమైంది. తనపగ దీర్చుకోడానికి మార్గం దొరికిందనుకొన్నాడు. ఈ గుంపుతో కలిసి కొంత ప్రయత్నిస్తే మనపని సానుకూలమౌతుందనే నిశ్చయానికి వచ్చాడు. వారు సమీపానికి రాగానే కుమార్ లేచి గబగబానడిచి ఆ గుంపులో చేరిపోయాడు.

* * *

మాధురి ఆనాడు మాధవబాబుతో అన్నమాట ప్రకారం సుషమకోసం గుండె రాయిచేసుకొని తనకు ఎంత కష్టంగాఉన్నా సహించి కుమార్‌ను ఇంట్లోంచి వెళ్ళగొట్టింది. అతడు మెట్లుదిగుతూ కాలుజారి కిందబడి దెబ్బ తగలడంచేత బాధపడుతూండడం చూచికూడా చూడనట్లు నటిస్తూ బలవంతంగానే లేనిఉత్సాహం తెచ్చుకొని సంగీతంపాడడం మొదలుపెట్టింది. అట్లాచేయటంలో ఆమె అభిప్రాయం — "తనకు కుమార్‌గాక మరికొంత మంది గ్రాహకులున్నారనీ, అందుచేత తాను వెళ్ళిపోయినా మనస్సు కేమీ కష్టంలేదు, అని కుమార్ మనస్సుకు తోచి నట్లైతే తనమీద అతనికి విముఖత్వంకలిగి భార్యదగ్గిరకు వెళ్ళగలడు" అని మాధురి ఊహించడమే. కుమార్ పూర్తిగా కనుచూపుమేర దాటిపోయినతర్వాత పాట చాలించి మంచం

మీద కూలబడింది. ప్రాణంపట్లా కాపాడుకొంటూన్న వస్తువుపోయినట్లు విచారపడుతోంది. మనస్సులో ఈవిధంగా అనుకొంటూ కన్నీరువిడిచింది.

కుమార్ నన్ను ఎంతగా ప్రేమించాడు? నాకోసం తన జమీందారీనంతా నాశనంచేసుకొన్నాడు. ఏది కావాలని కోరినా ఇచ్చాడు. చివరకు నన్నుగురించి భార్యను కూడా వదిలివేశాడు. అట్టి కుమార్ విషయంలో నేనెంత దుర్మార్గురాలనై, కృతఘ్నురాలనై వ్యవహరించాను? ఇంతచేసినా చివరకు వేశ్యకు జాతిస్వభావం ఎట్లా పోతుంది? వేశ్యగానే వ్యవహరించింది అనుకొని చాలా బాధపడిఉంటాడు. నన్ను ప్రేమిస్తే తానీస్థితికి వస్తానని ఎప్పుడైనా ఊహించాడా? తన బాగోగులనుగూర్చిన ఆలోచనకూడా కలిగిందా? ఎక్కడికి వెళ్ళిఉంటాడు? ఛీ! ఛీ! వేశ్యావృత్తి ఎంత నీచమైపోయింది? అతనిమంచికోసమే, అతనిభార్యయొక్క దుఃఖనివృత్తికొఱకే నేనీవిధంగా చేశానని ఎప్పుడూ ఊహించుకోలేడు. అతనిని నేను మోసగించాననీ, తన బీదస్థితినిచూచి ఇంకొక ధనికుని చేబట్టి తన్ను వెళ్ళగొట్టాననే అభిప్రాయమే కలిగిఉంటుంది.

ఈవిధంగా చాలాసేపు ఆలోచనాపరంపరలో మునిగి కుమార్‌ను తలచుకొని కన్నీరుకారుస్తూ దుఃఖించింది. ఆమెకు తనవృత్తిమీదనేగాక జీవతంమీందా రోత కలిగింది. ఇందుకు ప్రతీకారమేమిటా? అని తలపోసింది. ఎంత తలపోసినా దారి దొరకలేదు. కొంతసేపటికి నిద్రాదేవి ఆవహించి కొంత ఉపశమనం కలిగించింది. సూర్యోదయం అయ్యే

వరకూ అట్లాగే నిద్రపోయింది. మెలకువవచ్చేసరికి ఉదయం ఏడుగంటలైంది. లేచి మెల్లిగా ఆవలించి కన్నులు తుడుచుకొని కాలకృత్యాలు తీర్చుకొని ముందుకార్యక్రమంఏమిటా? అని ఆలోచిస్తూ కూర్చుంది. ఏవిధంగానైనా సుషమకు భర్తసాహచర్యం కలిగించి ఆమెకు సుఖజీవితాన్నికలిగించాలి. అదెట్లా సంభవమౌతుంది? కుమార్ ఎక్కడ ఉన్నాడో ఎట్లా తెలుస్తుంది? అతనిని సులభంగా వెళ్ళగొట్ట గలిగిందేగాని, వ్యథితహృదయుడై దారితప్పిన బాటసారివలె వెళ్ళిపోయిన కుమార్‌జాడ తెలుసుకోడం మాటలా? విశ్వ ప్రయత్నంచేసి ఒకవేళ తెలుసుకోగలిగినా ముందు తన కర్తవ్యం ఏమిటా అని ఆలోచిస్తూ కూర్చుంది.

# 13

చేసినపాపానికి ప్రాయశ్చిత్తం ఏమిటా? అని మాధురి అనేకవిధాలుగా ఆలోచిస్తోంది. మానవజన్మమెత్తిన ప్రతి వ్యక్తీ ఏదోతప్పు చేస్తూనేఉంటాడు. తెలిసో తెలియకో తప్పు చెయ్యనివా రెవరూలేరు. బుద్ధిప్రమాదంచేత చేసినప్పటికీ అదితప్పు అని తెలిసికొన్నతర్వాత చేసినందుకు విచారపడడం, భవిష్యత్తులో అట్టిపొరపాటు చెయ్యకుండా జీవితాన్ని సక్రమమార్గంలో ప్రవేశపెట్టడం ఉత్తమలక్షణం అనే సిద్ధాంతానికి వచ్చింది మాధురి. చివరకు ఆమెకొక మార్గం తోచింది. ప్రస్తుతం కుమార్‌నిగురించిన ఆలోచన వదలి సుషమను ప్రసన్నురాలినిగా జేసుకొని ఆమె మనస్సు సంతోషించేటట్లు ప్రత్యుపకారంచేయడం తన

ప్రస్తుతకర్తవ్యం అనే నిశ్చయానికి వచ్చింది. అందుకేమి చెయ్యాలి? మాధవబాబును కలుసుకొని ఆయనతో సంప్రదిస్తే తగినమార్గం చూపిస్తాడు. ఇదేపద్ధతి. అని నిశ్చయించి ఆయనపేర జాబు వ్రాయడానికి ప్రారంభించింది.

"పూజ్యులగు మాధవబాబుగారి చరణములకు వందనములు. నేను పాపాత్మురాలనని త్రికరణశుద్ధిగా అంగీకరిస్తున్నాను. ఈవిధంగా ఒప్పుకోడంలో నాకేమీ కష్టంలేదు. నేనుచేసినపనికి చాలాలజ్జపడుతున్నాను నేను దుర్మార్గురాలనని అంగీకరించి విచారాన్ని వెల్లడించినంతమాత్రాన నాకు పాపవిముక్తి కలుగుతుందని ఎప్పుడూ అనుకోను. సుషమాదేవి నాపేర తొలిగా జాబువ్రాసినప్పుడే నేను తగినజాగ్రత్త తీసుకొంటే ఎంతో బాగా ఉండేది. పరిస్థితి ఇంత విషమించేదికాదు. జరిగినదాన్నిగూర్చి విచారిస్తే లాభంలేదు. ఆదినం తాము నాతో చెప్పిన ప్రకారం కుమారబాబును—అయ్యా! తప్పుగాతోస్తే క్షమించండి. సోదరి సుషమాదేవియొక్క ఆరాధ్య స్వరూపం, నాప్రేమైకనిదానమైన కుమార్‌ను హృదయం రాయిచేసుకొని, మానవత్వాన్ని నాశనంచేసుకొని బలాత్కారంగా బయటికి పంపించాను. తర్వాత నేను చేసిన పనికి ఎంతదుఃఖపడుతున్నానో, నాహృదయం ఎంత దగ్ధమౌతోందో అనేవిషయం భగవంతునకే తెలుసు. తిరిగి ఆయననుచూచేభాగ్యం లభించదేమోఅనికూడా అనుమానపడుతున్నాను. అంతేగాక నేను చూడాలనికోరడంలేదు. ఏమంటే దానివలన అంతరించిపోతూన్న పరస్పరప్రేమలు

తిరిగివృద్ధిపొందడానికి అవకాశంకలగడం ఒకటేగాక ఇంకా చాలా బాధలున్నాయి. అందుచేత ఆవిషయం వదలిపెడితేనే బాగుంటుంది.

“ఆయననుగూర్చి కొన్నిసంశయాలు బాధిస్తున్నాయి. కుమార్ ఇంటికివెళ్ళేరా? స్వవిషయాల్ని విమర్శించుకొంటున్నారా? సోదరి సుషమా దేవి ఆయనను కలుసుకొన్నదా లేదా? జమీందారీనిగూర్చిన వ్యవహారాలు ఎట్లా ఉన్నాయి? ఋణదాతలు దావావేసి డిక్రీపొందినట్లు, వేలంకు సిద్ధముగాఉన్నట్లు తామే చెప్పినారు. దానిని తప్పించగల ఏర్పాట్లేమైనా జరిగాయా? తాము ఎక్కడ ఉన్నారు? ఏమిచేస్తున్నారు? ఏ ప్రయత్నంలో ఏ ఆలోచనలోఉన్నారు? ఈ శంకలన్నీనన్ను బాధిస్తున్నాయి. నాయందు దయయుంచి పైన వ్రాసిన విషయాలకు తగు సమాధానాలు వ్రాస్తారని నమ్ముతున్నాను.

“నన్నుగూర్చి నేనేమీ వ్రాయదలచుకోలేదు. కాని ఒకమారువచ్చి ఈనిర్భాగ్యురాలికి తమదర్శనభాగ్యం కలిగించలేరా? ఇష్టంలేకపోయినా ఒకమారు తామురావలెనని కోరుతున్నాను. తమదర్శనంవల్ల నావిచారం కొంత తగ్గుతుందన్న విశ్వాసముంది. తమకు ఇట్టి కష్టంకలిగించకుండా నేనే రావాలని అనుకొన్నాను. కాని నాకా సాహసం కలగలేదు. నా రాకవల్ల తమకు, విశేషించి సోదరి సుషమాదేవికి మనోవ్యాకులం కలగవచ్చును. లోగడచేసిన అపరాధానికి తోడు ఇది ఇంకోమహాపరాధం అవుతుంది. కనుక రాలేక

ఈ విధంగా వ్రాసినందుకు క్షమించండి. తమ ప్రత్యుత్తరం కోసం ఎదురుచూస్తూంటాను. అనుగ్రహించండి......

అభాగిని,

మాధురి."

ఈవిధంగా వ్రాసి తిరిగి రెండుమూడుసార్లు పూర్తిగా చదివింది. ఈజాబు వ్రాయడం సార్థకమౌతుందనీ - సోదరి సుషమను తాను సంతోషపెట్టే అవకాశం లభిస్తుందని ఊహించుకొని ఆనందించింది. తాత్కాలికంగా విజృంభించిన భావావేశంలో నిమగ్నురాలై కొంతసేపు పసుపు మీాద ఆలోచించుకొంటూ పడున్నది తదుపరి ఒక అర గంటకాలానికి లేచి జాబుసాంతంగా మళ్ళా చదివి మడిచి కవరులో పెట్టి పోస్టుబాక్సులో వేయడానికై బయటికివచ్చింది.

జాబు తపాలపెట్టేలో వేసివచ్చిందేగాని ఆమె మనస్సులో రగులుతూన్న జ్వాల, విజృంభిస్తూన్న తుపానుగాలి శాంతించలేదు. కుమార్ విషయంలో తానుచేసినపని జ్ఞాపకం వచ్చినకొద్దీ అతివిచారంచేత ఆత్మహత్యచేసుకొందామా అన్నంత ఉద్రేకం కలుగుతోంది. ఆ దీనావస్థలో కొంత సేపు ఆత్మనింద, మరికొంతసేపు కుమార్ చేసినపనికి కోపం, కర్తవ్యాన్నిగురించిన యోచన మొదలగు భావపరంపరలు సముద్రతరంగాలవలె ఘోషిల్లుతూ విజృంభిస్తున్నాయి. ఒకవిధమైన ఉన్మాదావస్థలోబడి మాధురి ఉక్కిరిబిక్కిరిఅవుతోంది. మధ్యమధ్య ఒకొ్కక్కమాటు సుషమవ్రాసిన జాబుతీసి చదివి కన్నీరు విడుస్తూ పడక

కుర్చీలో కూలబడి నిశ్చేష్టురాలౌతోంది. ఈ విధంగా మాధురి అనిర్వచనీయమైన ఆవేశంలోపడి కొట్టుకొంటోంది.

లోకంలో ప్రతివ్యక్తికీ కాలం ఒకరీతిగా జరగదు. దశాపరివర్తనం జరుగుతూనేఉంటుంది. ఆ పరివర్తనం సంభవించినప్పుడు గతకార్యక్రమం లభియించడం, భావికార్యక్రమానికి ప్రారంభదశ రావడం జరుగుతోంటుంది. మాధురి జీవితంలోకూడా అదేవిధమైన మార్పువచ్చింది. వేషంలో, అనుభవంలో, ప్రకృతిలో, కార్యక్రమంలో, అత్యంతమైన మార్పువచ్చింది. ఇతరవిషయాలన్నీ ఆమెకు గోచరించడంలేదు. తానువ్రాసిన జాబుకు ఎట్టిసమాధానం వస్తుందో, ఎప్పుడువస్తుందో అని దినమొక సంవత్సరంగా భావించి ఎదురుచూస్తోంది. ఏదోవిధంగా తనమూలాన భగ్నమైపోయిన సుషమయొక్క జీవితాన్ని సుఖవంతంచేసి, ఆమెకు భర్తసాంగత్యం కలిగించితీరాలి. అట్టి దివ్యావకాశం ఎప్పుడు లభిస్తుందాఅని ఎంతో ఆదుర్దాతో ఉంది.

చూస్తూండగానే కాలం మారిపోయింది. మాధవబాబు,సుషమ ఇద్దరూవ్రాసిన ప్రత్యుత్తరాలు చేతికి అందినాయి. వానిని గబగబా చదువుకొని మాధురి ఎంతో ఆనందాన్ని పొందింది. జాబులు ఈవిధంగా వ్రాయబడి ఉన్నాయి.

"చిరంజీవి మాధురీ!

నువ్వువ్రాసిన జాబును చదువుకొని ఎంతో ఆనందించాను. నామనస్సుకు ఎంతో శాంతికలిగింది. లోకంలో పొరపాటు చెయ్యనివా రెవరూలేరు. అందరిలోనూలోపమునేది

ఉంటుంది. కాని దానిని సరిజేసుకొని పశ్చాత్తాపపడడమే గొప్పసంగతి. నువ్వు నీ దృష్టిమరల్చుకొని జీవితాన్ని సక్రమ మార్గంలో నడపడానికి అభిముఖురాలవైనావన్న సంగతిని తెలుసుకొని ఆనందించాను. నీకు ఈశ్వరానుగ్రహం కలుగు తుంది. మానవుడెంత దుర్మార్గుడైనా ప్రయత్నిస్తే మంచిస్థితి లోకి రావచ్చును. భగవంతుణ్ణి నమ్ముకొని నువ్వు సత్కా ర్యాలే ఎప్పుడూ చేస్తూ దుస్సంకల్పాలను పూర్తిగావదిలిపెడ్తే ఎంత పైకివస్తావో, ఎంత లోకోపకారం చెయ్యగల్గుతావో, దైవానుగ్రహం నీకు ఏవిధంగాకలుగుతుందో తెలుసుకో గలుగుతావు.

"కుమార్ ఇంతవరకు రాలేదు. అతను కనపడకుండా ఎక్కడనో దాగిఉండడం విచారకరమే. ఇందులో నా పొఱ పాటుకూడా ఉంది. ఆ సమయంలో నేనుకనిపెట్టిఉండి వెంట తీసుకొనిరావలసిఉన్నది. అట్లా చేయకపోవడం తప్పైంది. ఇక్కడసంగతంతా చాలా గందరగోళంగా ఉంది. జమీాం దారి రక్షింపబడడానికి ఎట్టిఅవకాశం కనపడడంలేదు. అనేక విధాలుగా ప్రయత్నించి వ్యర్థుణ్ణిఅయినాను. నేను స్వయంగా అశక్తుణ్ణి అన్నవిషయం నీకుతెలిసిందే వేలాం వాయిదా నాలుగుదినాలే ఉంది. ఇంక వాయిదాపడదు ఆ దినం మాకందరికీ ఎంత భయంకరదినమౌతుందో ఆలోచించుకో. కుమార్ఎస్టేటుఅంతా వేలంపాటలో కొట్టివేయబడుతూంటే నేను చూడవలసిన దుర్గతి పట్టుంది.

"సుషమ నాదగ్గిరనేఉంది. ఆమెకు ఇంకొక శరణ్యము ఏమీాలేదు. నానాటికి ఆమెపడే దుఃఖాన్ని చూడలేకుండా

ఉన్నాను. భవిష్యత్తులో ఏమికానున్నదో, భగవంతుడేమి చేస్తాడో తెలియదు. ఈస్థితిలో భగవానునికన్న వేరురక్షకులు లేరు.

“నువ్వు వ్రాసిన జాబు ఆమెకు చూపించాను. నీ విషయమై సుషమకు ఎట్టిభిన్నాభిప్రాయమూ లేదు. ఒకమారు నువ్వే బయలుదేరివస్తే చాలా బాగాఉంటుందని అనుకొంటున్నాను. ఆమె నీకువ్రాసిన జాబుకూడా ఇందుతో పంపించాను. చదువుకో. నీమనస్సు ప్రసన్నమౌతుందని నమ్ముతున్నాను.

ఇట్లు,
నీ శుభాకాంక్షి,
మాధవబాబు.

కుమార్ ఇల్లు చేరలేదు. దేశముమీాద కనపడకుండా పోయినాడన్నవార్త చదవగానే మాధురికి కలవరం, గుండెదడ, విచారం కలిగింది. అయినప్పటికీ మనస్సు కుదుటపరచుకుని సుషమ ఈవిధంగా వ్రాసినజాబును చదువుకుంది.

“సోదరీ! స్నేహశీలవైన మాధురీ!

నీకు నేను ఏవిధంగా ధన్యవాదాలు తెలుపుకోగలనో ఊహించలేకుండా ఉన్నాను. ఈసమయంలో నేను ధనహీనురాలనేగాక శబ్దహీనురాలనుకూడా అయినాను. అందుచేత కృతజ్ఞతనుకూడా తెలుపుకోలేకపోయాను. నీ గంభీరహృదయానికి నీ పవిత్రప్రేమకూ నేను వందనాలు సమర్పిస్తున్నాను. నాయందు వాత్సల్యంతో సానుభూతివాక్యాలు చెప్పి నాజీవితాన్ని నిలువపెట్టేవారు దొరికితే చాలునని

ఎదురుచూస్తున్నాను. అట్టివా రెవరున్నారు? భగవంతుడు నిన్ను చూపించాడు.

నేను అధికంగా వ్రాయవలసిన దేమీ లేదు. మామయ్య వ్రాసిన విషయాలను చదువుకొన్న తర్వాత సంగతి అంతా నువ్వు తెలుసుకునే ఉంటావు. నువ్వొస్తే నాకు విచారం కలుగుతుంది అనే అభిప్రాయం నీకు కలగడం నా దురదృష్టమే. సోదరీ! నన్ను అటువంటిదానినిగా నువ్వు ఊహిస్తావా? వద్దు. అట్లా ఎన్నడూ అనుకోవద్దు. నిన్ను చూడాలని నేను త్రికరణశుద్ధిగా కోరుతున్నాను. ఈ జాబు చూచిన వెంటనే నువ్వు బయలుదేరివస్తే నీ సాన్నిధ్య, సహచర్యాలు నాకు ఎంతో మనశ్శాంతిని ఇస్తాయని ఆశపడుతున్నాను. నీ హృదయంలో ఉన్న అనుమానాన్ని దూరం చేసుకుని వెంటనే వచ్చి నీ దర్శనభాగ్యాన్ని నాకు కలగచెయ్యి సోదరీ! నీకు స్వాగతం ఇయ్యడానికై ఎదురుచూస్తూంటాను.

ఇట్లు,
నీ సుషమ."

మాధురి ఒక్క గుక్కలో జాబంతా చదివేసరికి ఆమెకెంతో విస్మయం కలిగింది. ఈవిధంగా అనుకొన్నది- ఆహా! ఎంత దయామయి! ఎంత ఉదారహృదయం! ఎంత సహనశీలత! నన్నీవిధంగా క్షమించడమేగాక సోదరీ! అని పిలుస్తూ ఆహ్వానించిందంటే ఆమె శాంతస్వభావం, సౌజన్యం, క్షమ ఎంత అమూల్యమో బోధపడుతోంది. ఇహ నేను......ఊహుఁ.

మాధురి ఆ జాబును అనేకసార్లు చదివింది. ఎంత

చదివినా తృప్తితీరడంలేదు. పక్కమీాదపడుకుని నిద్రాహారాదులుమాని భావికార్యక్రమాన్నిగూర్చి ఆలోచిస్తోంది. ఈవిధంగా రెండుదినాలు ఆలోచించినతరువాత ఒక అభిప్రాయానికి వచ్చింది. ఉదయం నిద్రలేవగానే సత్వరం కాలకృత్యాలుతీర్చుకొని కాలయాపనచెయ్యకుండా అవసరమైన బట్టలు, సామాను పెట్టెలోసర్దుకొని వంటమనిషితో ప్రయాణమై వెళ్ళిపోయింది. సుషమనుచూడాలనే కోరిక ఆమెశరీరంలోఉండే ప్రతినరంలోను వ్యాపించి ఉద్రేకపరుస్తోంది. అందుచేత ఎప్పుడువెళ్ళి సుషమదగ్గర వాలిపోతానా అన్న ఆదుర్దాతో ప్రయాణంచేస్తోంది. శరీరం బండిలోఉన్నదేగాని మనస్సుమాత్రం సుషమదగ్గరఉంది. ఆమెకు అంత దురవస్థ కలిగించి ఇప్పుడేవిధంగా ముఖంఎత్తి మాట్లాడాలి అన్నవిచారం మనస్సులో మెదులుతూనేఉంది.

* * *

మధ్యాహ్నం పదకొండుగంటలకు మాధవబాబు ఇంటిముందు గుఱ్ఱపుబండి ఆగింది. గుండెలు కుదుటపరచుకొని ధైర్యంతెచ్చుకొని మాధురి బండిదిగి సింహద్వారం దగ్గిరకువచ్చి చూడగా తలుపులు తాళంవేసిఉన్నాయి. పాపమామెకు చాలా విచారంకలిగింది. ఎంతో ఆశపెట్టుకొని వచ్చినందుకు ఆశాభంగమైనదే అని వ్యాకులపడ్డది. విచారించగా మాధవబాబు సుషమతోకలిసి న్యాయస్థానమునకు వెళ్ళినట్లు తెలిసింది. మాధురికి కళ్ళనీళ్ళపర్యంతం అయింది. తానువచ్చినపని, తననిర్ణయం అంతా నిష్ఫలమైపోయిందా అని నిరుత్సాహంతో ఆలోచిస్తోంది. జమీాం

దారివేలాం ఈ దినమేనన్న సంగతి ఇప్పుడే ఆమెకు బోధపడింది. ఏమిచేయవలెనా అని అనుకొంటూ నిల్చుంది. ఇంతలో కొంతమంది గ్రామస్థులు స్త్రీపురుషులు వచ్చి గుమ్మంముందు నిల్చున్న మాధురినిచూచి ఆశ్చర్యపడి ఈవిధంగా వారిలోవారు అనుకోడం సాగించారు.

"ఈమె ఎవరో గొప్పఇంటిమనిషివలె ఉంది. చాలా సౌందర్యవతి. గొప్పవంశంలో పుట్టింది. వెంట మగవారెవరూ లేరే! ఒంటరిగా ఎట్లా రాగలిగింది? మాధవబాబుగారి కుటుంబానికీ ఈమెకూ ఏమైనా సంబంధబాంధవ్యాలున్నాయా! ఒంటరిగా సాహసించి ప్రయాణంచేసివచ్చింది. ఈమెరాకకు కారణం ఏమైఉంటుంది?" అని గుసగుసలాడుకొంటున్నారు. ఒకరికైనా ఆమె వేశ్యఅన్న అనుమానం కలగలేదు. ఎందుచేతనంటే ఆ సమయంలో ఆమెశరీరంమీద వేశ్యలకుండే వస్త్రాలంకారభూషణాదులుగాని, తత్సంబంధమైన భావభంగిమలుగాని వారికి కనపడలేదు. సామాన్యంగా కొద్దివిలువగలిగిన జరీపువ్వులుఅంచుగల పట్టుచీర-అందుకుతగిన బ్లౌజు - కాళ్ళకు మధ్యతరగతివారు ధరించే పాదరక్షలు, మొఖాన సింధూరరేఖ, కొద్దిగా నగలు - ఇదే ఆమెవేషం. రూపాన్నిచూచి ఆ నిరాడంబరవేషాన్ని గమనించి ఎవరో, ఏమిపనిమీదవచ్చిందో తెలుసుకోవాలనే తలంపుతో వచ్చిన పెద్దమనుష్యులలో ఒకవ్యక్తి సాహసించి "మీరెవరు? ఏ ఊరు? ఏంపనిమీద వచ్చారు? ఎవరు కావాలి?" అని అడిగాడు.

మాధురి కా ప్రశ్న ఏమీ వినపడలేదు. జరగబోయే

పరిస్థితి ఆమెఎదుట చిత్రించినట్లు కనపడుతోంది. ఈవిధంగా ఇక్కడనిల్చుని ఆలోచించడం, వీరిమాటలకు సమాధానాలు చెప్పడం కాలయాపనయేగాక కార్యభంగానికి కారణమని ఊహించి మాట్లాడకుండా బండిలోకూర్చుని బండివానితో న్యాయస్థానానికి పోనిమ్మని చెప్పింది. బండివాడు గబగబా బండిని తోలుకుపోయాడు.

* * *

ఆరోజున న్యాయస్థానానికి ఎదురుగాఉన్న విశాలమైన మైదానంఅంతా జనంతో నిండిఉంది. వారిలో సామాన్యులు, ధనవంతులు, కోటీశ్వరులు అంతా ఉన్నారు ఆ గుంపులో ఎవరినైనా కలుసుకోవాలంటే సాధ్యమైనపని కాదు. అంతమంది మహాజనం ఒకచోట జేరినప్పుడు కావలసినవ్యక్తి కనపడడం చాలా కష్టకార్యము. అయినప్పటికీ మాధురి మాధవబాబుకోసం ఆ గుంపులో సాధ్యమైనంత వరకు వెతికింది. కాని ఆమెప్రయత్నం ఫలించలేదు. సరిగా ఆ సమయంలోనే వేలంపాటజరుగుతోంది.ఆఫీసుబంట్రోతు బల్లమీదనిల్చుని లక్షఏబదివేల రూపాయలు అని కేకవేస్తున్నాడు. మాధురి ఆకేకవిని కంగారుగా అటుఇటు తిరిగి కుమారబాబుఎస్టేటుకు సంబంధించిన వేలంపాట అని తెలుసుకొని నిశ్చేష్టురాలైంది. ఒకసారి — రెండోసారి — కొట్టివేస్తా, లక్ష ఏభై వేలరూపాయలు అన్న కేకలు మాధురిని మతిలేనిదానినిగా చేస్తున్నాయి. ఏమిచేస్తుంది? తనదగ్గర గల నిల్వనగలు అన్నీకలిపితే లక్షపాతిక వేలకన్నా మించవు. మిగతాడబ్బు ఎట్లా తెస్తుంది? ఇంకా పాటపెరిగే సూచనలు

కనిపిస్తున్నాయి. ఏమిచెయ్యాలో తోచడంలేదు. బండిలో కూర్చుని ఆలోచిస్తోంది. ఇంతలో లక్షఅరవై వేలు రూపాయలు అన్న కేక వినిపించింది. మాధురి ఇక నిలువలేక పోయింది. బండిని బార్ అసోసియేషన్ లైబ్రరీరూముదగ్గిరకు పోనిమ్మని చెప్పింది. క్షణకాలంలో బండి గమ్యస్థానం చేరింది. మాధురి ఒక్కగంతులో కిందకుదిగి లోపలికి వెళ్ళి ఒక సుప్రసిద్ధన్యాయవాదిని సలహాఅడగాలని ఆలోచిస్తోంది. అంతలో "లక్షడెబ్బై వేలరూపాయలకు కొట్టివేస్తాము, పాడేవారు పాడండి" అన్న కేక చెవినిపడింది.

మాధురి శరవేగంతో ఒక ప్రసిద్ధన్యాయవాదివద్దిరకు వెళ్ళి నమస్కరించి ఇట్లా అన్నది. "అయ్యా! తాము దయచేసి రెండులక్షలరూపాయలైనాసరే పైపాట పాడి కుమారబాబుగారిఎస్టేటును నాపేర కొట్టివేయించే సదుపాయం చెయ్యండి. మీకు రెండువందలరూపాయలు ఫీజుకింద ఇచ్చుకొంటాను. తొందరగా వెళ్ళండి" అంటూ పర్సులోంచి నూరురూపాయలనోట్లు రెండుతీసి ప్లీడరుగారికిచ్చింది. మాధురియొక్క ఆదుర్దాచూచి ప్లీడరు ఆశ్చర్యపడుతూ ఆమెను విమర్శించిచూస్తూ ఒకఆడుది నిర్భయంగా ఎంత సాహసంచేస్తోందా? అని అనుకొంటున్నాడు. మాధురి అన్నది: "అయ్యా! ఆలస్యంచెయ్యకండి. మీకు పుణ్యం ఉంటుంది. త్వరగావెళ్ళి పైపాట పాడండి. నాలుగోవంతు డిపాజిట్టుకు ఏభైవేలరూపాయలకు చెక్కు వ్రాసిఇస్తాను. దానిని డిపాజిట్టుచేసి ఈ చీటీలో వ్రాసిన వారిపేర పాట కొట్టి

వేయించండి" అంటూ చెక్కుబుక్కుతీసి ఏభై వేలరూపాయలకు చెక్కువ్రాసి ప్లీడరుగారిచేతిలో పెట్టింది.

వకీలు రెండువందలరూపాయలు, డిపాజిట్టుతాలూకు చెక్కు భద్రపరచుకుని ఒక్కమాటు నిదానించి మాధురిని చూశాడు. సౌమ్యత, కార్యశూరత, అమాయకత్వము మొదలగులక్షణాలు గనపడ్డాయి. వెంటనే నమ్మకంతో బయలుదేరి వేలాంపాటజరిగే ప్రదేశానికి వెళ్ళాడు.

ఆరగంట అయినతర్వాత గవర్నమెంటుప్లీడరువచ్చి మాధురితో "మీ ప్రయత్నానికి చాలా ధన్యవాదాలు. కార్యం సఫలంఅయింది. లక్షఏభై వేలరూపాయలకు మీపేర కొట్టివేశారు" అన్నాడు.

ఆమాటవినగానే మాధురికి ఎంతో సంతోషంకలిగింది. అనుకొన్నపని సక్రమంగా నెరవేరితే సంతోషించనివారెవరుంటారు! కాని ఆమె తనసంతోషాన్ని మనస్సులోనే ఇముడ్చుకొని శాంతభావంతో గవర్నమెంటుప్లీడరుగారికి వందనంచేసింది.

ఆ సమయానికి మాధురిపంపిన ప్లీడరుగారుకూడావచ్చి ఆమెకు వందనాలు సమర్పించాడు. జరిగినవృత్తాంతమంతా చెప్పి ఏభై వేలరూపాయల డిపాజిట్టురశీదు చేతిలోఉంచగానే మాధురి ఆయనకు నమస్కారంచేసి కృతజ్ఞతను వెల్లడించింది. మిగతాపైకం నెలదినాలలో కోర్టులోచెల్లించవలసిన విషయంకూడా వకీలువల్ల తెలుసుకొని బండిమీాద వెళ్ళిపోయింది. నెలదినాలలో ఆమెకు బకాయి మొత్తం ఎట్లా వస్తుంది? ఈ సమస్య ఆమెమనస్సును బాధిస్తోంది. ప్రస్తుతం

శరీరవైభవంతో నిలునబడిఉంది. భగవంతు డామె ప్రయత్నాన్ని ఏంచేస్తాడో.

బండిమీద మాధవబాబుఇంటికి వచ్చింది. మాటి మాటికి "వాయిదా మొత్తం ఏవిధంగా పూర్తిచెయ్యాలి?" అన్న శంక ఆమెహృదయాన్ని బాధిస్తోంది.

# 14

సుషమ తనసొత్తు తనయెదుటనే గవర్నమెంటువారు వేలాంపాటవెయ్యడం చూడలేక, వినలేక ముందుగానే ఇంటికివచ్చి గదిలో పడుంది. మాధవబాబుమాత్రం చివరంటా ఉండి తనమేనగోడలి ఎస్టేటును లక్షఎనభై వేలరూపాయల కెవరో ఒకఆడుదానిపేర కొట్టివేయబడిందన్న వార్తను విని పాపమావృద్ధుడు నిరాశతో ఇంటికి బయలుదేరాడు. అతని ప్రయత్నాలన్నీ వ్యర్థమైనాయి. తాను నిర్ధనుడు. అతనినినమ్మి ఇంతద్రవ్యం అప్పు ఎవరిస్తారు? కన్నీరు కారుస్తూ ఇంటికివస్తున్నాడు. గుండె రాయిచేసుకొని ఈ వృత్తాంతాన్ని సుషమకు చెప్పాలి? ఎట్లా చెప్పగలడు? చెప్తే ఆమె ఎంత దుఃఖపడుతుందో! "భగవంతుడా! పరమ యోగ్యురాలైన నాబిడ్డకీ దుఃఖం ఎందుకు తెచ్చిపెట్టేవు?" అని విచారపడుతూ స్వగ్రామంచేరి ఇంటిదగ్గిరకు వచ్చేసరికి గుమ్మంముందు ఒకగుర్రపుబండి నిలువబడిఉంది. బండిలో ఎవరువచ్చారు? అని అనుమానిస్తూ నిదానించి చూశాడు. ఒక స్త్రీ, సౌందర్యవతి శాంతరూపిణియై కూర్చునిఉంది.

ఆమె ఎవరు? అని తనలోతానే ప్రశ్నించుకొంటూ దగ్గరకు వచ్చి చూడగానే బండిలోనున్నవారెవరో గుర్తించాడు.

మాధురి మాధవబాబునుచూచి వెంటనే బండిదిగి అతనిపాదాలకు నమస్కరించింది. తన మనోవ్యాకులాన్ని కూడా మరిచిపోయి మాధవబాబు సగౌరవంగా ఆమెను లోపలికి తీసుకొనివెళ్ళి కూర్చొబెట్టి కుశలప్రశ్నలడిగాడు. పరస్పరక్షేమవార్తలనంతరం మాధురి అన్నది. "మామగారు! అతికష్టంమీద మిమ్మల్ని చూడగలిగినందుకు చాలా సంతోషంగాఉంది. పడినకష్టం సఫలమైంది. సోదరి సుషమా దేవిని చూడాలని ఎంతో ఆశపడుతూ వచ్చాను. ఇంతవరకు ఆమెను చూడలేకపోయాను. నా కామెదర్శనం లభించదా?"

మాధవబాబు ఒకసారి చిరునవ్వునవ్వి అన్నాడు. "మాధురీ! నిరాశపడవద్దు. నీకోర్కె నెఱవేరుతుంది, సుషమనుచూచి ఆమెతో మాట్లాడగలవు అందుల కెట్టి ఆటంకంలేదు. ఇప్పుడే చూస్తావు. చాలాసేపటినుండి బయటనే ఉండి మాకోసం కనిపెట్టుకొని నిరీక్షిస్తూఉండడంచేత నీకు ఎంతో కష్టంకలిగిఉంటుంది. కొంచెం విశ్రాంతితీసుకో. నేను ఇప్పుడే లోపలికివెళ్ళి వస్తాను."

—అంటూ మాధురిని కూర్చొబెట్టి మాధవబాబు లోపలికివెళ్ళాడు. వెళ్ళగానే అక్కడివాతావరణంలో చాలా మార్పు కనిపించింది. ఎక్కడచూచినా దైన్యలక్షణాలు కనపడుతున్నాయి. ఇల్లంతా చిన్నపోయినట్లు కళావిహీనంగా ఉంది. సుషమ మామూలుగా తనరాకకోసం ఎదురు చూస్తూన్నట్లు కనపడలేదు. ఎక్కడవక్కడనే పడిఉన్నాయి.

ఏమూలచూచినా శోకదేవత నగ్నతాండవం చేస్తోంది. వంటఇల్లు శూన్యంగాఉంది. భోజనపదార్థాలు తయారుచేయ లేదు సరిగదా పొయ్యికూడా అంటించలేదు. ఇంటిస్థితి అంతా చూడగా అతనికి భయంకలిగింది. సుషమ కాన రాలేదు. మేనగోడలిని పిలిచాడు. జవాబు రాలేదు. శంకిత హృదయంతో సుషమపరుండే గదిలోకివెళ్ళి పరిశీలించాడు. సుషమ చాపమీద శరీరస్మారకంలేకుండా పడిఉంది. మేన గోడలిస్థితి చూడలేక కన్నీరుకారుస్తూ దగ్గరగా వెళ్ళి పక్కను కూర్చుని ఒంటిమీద చేయివేసిచూచేసరికి బాగా జ్వరం వచ్చినట్లు ఒళ్ళంతా వేడిగాఉంది. మాధవునిమనస్సంతా తునకలైనట్లుండి నెమ్మదిగా "సుషమా! సుషమా! నా తల్లీ!" అని పిలిచాడు. ఆ పిలుపుతో సుషమకు స్పృహా వచ్చి కన్నులుతెరిచి "మామా! వచ్చావా? ఏమైంది? నా కోసం ఏ వార్త తీసుకొనివచ్చావు? వేలాంవాయిదా ఏమైంది? ఈదినంతో జమీందారీఅంతా......" సుషమ ఇహ మాట్లాడలేక మేనమామఒడిలో తలపెట్టి దుఃఖపడు తోంది.

ఆమెను ఊరడించాలంటే మాధవబాబుదగ్గర మాటలే లేకపోయినాయి. ఎంతో దుఃఖాన్ని కడుపులో దిగమింగి ఇంటికివచ్చాడు. మేనగోడలిప్రశ్నలకు సమాధాన మేమని చెప్తాడు. విచారపడుతూ మౌనంవహించి కూర్చు న్నాడు. సుషమ మళ్ళాఅడిగింది. "మామా!మాట్లాడవేమి! నా హృదయసర్వస్వమే నాకుదూరమై అదృశ్యమైపోయింది. ఈ చంచలస్వభావముగల లక్ష్మి స్థిరంగాఉంటుందన్న

విశ్వాసం ఏముంది? నేను అంతా గ్రహించాను. ఇక మీాద నీకు ఎట్టికష్టాన్నీ ఈయలేను. నన్నుగూర్చి ఇంత వరకూ నువ్వు ఎంతో కష్టపడ్డావు. భారంఅంతా శిరస్సున వహించి నానాఅవస్థలు అనుభవించావు. ఒకదినమైనా నా మూలాన నీకు శాంతిలేకుండాపోయింది......మామా! ఒక మాట చెప్పు. జమీాందారీని వేలంలో ఎవరుకొన్నారో తెలుసుకొన్నావా?"

మాధవబాబు ఈమారు జవాబుచెప్పకపోతే ఆమెకు దుఃఖం హెచ్చిపోతుందని ఊహించి మెల్లిగా ఓదార్పు మాటలతో అన్నాడు. "అమ్మా! ఎందుకంత దుఃఖం? ధైర్యంతెచ్చుకొని కార్యరంగంలో ప్రవేశించు. భగవంతు డేదిచేసినా మనమంచికే చేస్తాడు. దానిఫలితం సుఖప్రదం గానే పరిణమిస్తుంది. ఇవన్నీ దేవుడిచ్చే పరీక్షాపత్రాలు. పిల్లవానినిగిల్లి ఏడ్పిస్తేనేగాని ముద్దురానట్లు కష్టాలతో పరీక్షిస్తేనేగాని అనుగ్రహించడు. సుకర్మలో దుష్కర్మలో ఏవోఒకటి యెప్పుడో చేసిఉంటాము. అది ప్రారబ్ధరూపంగా మనవెంట పడుతుంది. దానిని అనుభవించి నశింపచేసుకొంటేనేగాని ఈశ్వరానుగ్రహపాత్రులం కాజాలము. నువ్వు ప్రతిదినం భగవద్గీతార్థం మననంచేస్తూంటావు. శ్రీకృష్ణపరమాత్మకూడా ఇదే చెప్పాడు. శంకరభగవత్పాదులుకూడా ఇదేవిషయం బోధించారు. "బుద్ధిమంతుడా! ఆత్మజ్ఞానివై కాలమును వెళ్ళించు. ప్రారబ్ధం అనుభవిస్తున్నాననే విచారంవదిలి దైవాన్ని నమ్ము." అని చెప్పారు. కనుక ధైర్యం తెచ్చుకో. శోకించవద్దు. నీ మనోవ్యాకులం నాకు హృదయ

భేదకమౌతోంది. నేను ఆశావాదిని. కంఠంలో ఊపిరి ఉన్నంతవరకు భగవంతుడు రక్షిస్తాడనే ఆశతో నేఉంటాను. తిరిగి నీకు హెచ్చరికను కలిగిస్తున్నాను. కుమార్ తిరిగి వస్తాడు. నీకు భర్తసమాగమం కలుగుతుంది. నీ జీవితం సుఖవంతమై సర్వసుభాలతో వెలుగుతుంటుంది. విచారపడ వద్దు. ధైర్యం సర్వకార్యసాధనం.”

మేనమామమాటవిని సుషమ గద్గదస్వరంతో అన్నది. “మామా! నాకు ఊరటకలిగించాలని నువ్వు ఏమేమో చెప్పావు. నాకేమీ విశ్వాసంకలగడంలేదు. ఈ జీవితంలో నాకు ఆయనదర్శనం లభిస్తుందనే నమ్మకంలేదు. నీ మాటలను యెంతమాత్రం విశ్వసించలేను. అదట్లాఉండనీ. జమీందారీ యెవరుకొన్నారో చెప్పవేం?”

యెంతబోధించినా సుషమను శాంతింపజేయడం దుర్లభం. తనశక్తికిమించినపని అనుకొని మాధవబాబు యితరప్రసంగంలోకి దింపాలనే ఊహతో “సుషమా! నువ్వు మాధురిపేర జమీందారీ వేలాంవిషయంలో ఏమైనా వ్రాశావా?” అని అన్నాడు.

“లేదు.”

“నువ్వు ఏమని వ్రాశావు?”

“ఒకమారువచ్చి కలుసుకోమని వ్రాశాను. రాలేదు. మామా! ఇంకోమాటు జాబు వ్రాస్తావా?”

“పిలిపించమంటావా? గట్టిగా చూడదలచుకొన్నావా?”

"పిలిపించు మామా! నీకు వందనం చేస్తాను. ఆమెను చూడాలన్న కోర్కె నాకు పూర్తిగా ఉంది."

"సరే. అట్లాగే తీసుకునివస్తాను." అంటూ లేచి బయటికి వచ్చాడు మాధవబాబు.

మాధవబాబు రావడం ఆలస్యం అయ్యేసరికి మాధురి ఈవిధంగా అనుకొంది. నేను రావడం ఆమెకు చాలాకష్టంగా ఉందేమో? నిజమే, నేను పతితను. వేశ్యను. నావంటి దానితో మనసిచ్చి మాట్లాడడానికి సుషమ అంగీకరించక పోవడంలో ఆశ్చర్యమేమీ లేదు. కాని నన్ను రమ్మనమని ఆహ్వానించింది. నా రాకకై ఎదురుచూస్తానని వ్రాసింది. ఇంత త్వరలో ఆమెకు నామీద మిత్రభావంపోయి శత్రుభావం ఎట్లాకలుగుతుంది?" ఇట్లా ఆలోచిస్తూండగానే మాధవ బాబువచ్చి మాధురితో అన్నాడు. సుషమకు శరీరంలో స్వస్థతగా లేదు. అందుచేత ఆమె రాలేకపోయింది. శ్రమఅనుకొనక లోపలికి రా. సావధానంగా మాట్లాడవచ్చును." ఆమాటవినగానే మాధురికి మనస్సు కొంచెం కుదుటపడింది. కాని తాను రావడంతరువాయిగా ఆమెకు శరీరస్వస్థత లేక పోవడం ఏమిటూ? అని కొంచెం అనుమానిస్తూ లేచి మాధవ బాబు వెంట లోపలికి వెళ్ళింది. అడుగులచప్పుడువిని సుషమ తలెత్తిచూచింది ఒకసామాన్యమైననిరాడంబరమైన వేషంతో మూర్తీభవించిన లజ్జాదేవతవలే ఒకసౌందర్యవతియైన స్త్రీరూపం తనముందు మోకరించి పాదములపై శిరస్సు ఉంచడంచూచి సుషమ ఎంతో విస్మయపడింది. ఏమనాలో తోచలేదు. మాధవబాబు అన్నాడు. "సుషమా! ఇదిగో

నువ్వు కోరిన మాధురిని తీసుకునివచ్చాను. నాకెన్నివంద నాలు సమర్పిస్తావో నీఇష్టము. నీ ఎదురుగా నిలువబడిఉంది." ఆమాటవినగానే సుషమకు ఎక్కడలేని ఉత్సాహంవచ్చింది. వెంటనేలేచి దిండుకు చేరబడికూర్చుని మాధురినిలేవదీస్తూ "సోదరీ! మాధురీ! ఇదేమిటి? ఏమిచేస్తున్నావు? లే." అన్నది.

మాధురి ఆమెపాదధూళిని నుదుటధరించి గద్గద స్వరంతో "అక్కా! ఏమీలేదు. నీపవిత్రమైన పాదధూళిని నుదుటధరించి నా శరీరాన్ని పవిత్రంచేసుకొంటున్నాను. అదట్లాఉంచు. నువ్వీరీతిగా ఉన్నావేమి? ఎంత చిక్కి పోయావు! నీకింత వ్యాకులమెందుకు?" అని అన్నది.

వారిద్దరినీ అక్కడనేఉంచి మాధవబాబు లోపలికి వెళ్లేడు.

"బలహీనత ఏమీలేదు. శరీరంలో సుస్తీగా ఉంటోంది. దానికితోడు ఇవ్వాళ జ్వరంకూడా వచ్చింది. సరేకాని ఈరోజు నాకెంతో సంతోషంగాఉంది. నిన్ను చూడగానే ఎంతో ఆనందంకలిగింది. నన్ను కృతార్థు రాలను చేయడానికి వచ్చావా సోదరీ? ఈ నిరుపేదలుండే కుటీరానికి నువ్వు వస్తావని ఎన్నడూ నేను అనుకోలేదు. ఈరోజు ఎంత సుదినం! నీకు చాలా శ్రమకలిగిఉంటుంది." అని అన్నది సుషమ.

"అక్కా! అట్లాఅంటున్నావేమిటి? నువ్వు అల్లా అంటే నామనస్సు ఎంతో వ్యాకులపడుతుంది. నాకెంత మాత్రమూ శ్రమలేదు. నీవంటి మహాసాధ్విని సందర్శించ

డానికి వస్తూన్న నాకు ఆనందమేగాని కష్టం ఎట్లాఉంటుంది? ఈదినం నాజన్మ తరించింది. నేను అదృష్టవంతురాల నైనాను. ఈపాపాత్మురాలికి నీ పవిత్రమైన పాదధూళి ధరించే అవకాశం, అధికారంఇచ్చి ధన్యురాలినిచేశావు. శాశ్వతమైన పవిత్రతను కల్పించావు. నువ్వు ఈవిధంగా అనుగ్రహించకపోతే ఈపాపినికి, పతితకు ఇట్టి సౌభాగ్యం ఎట్లాదొరుకుతుంది? అక్కా! నీహృదయం ఎంతో ఉదార మైనదనడానికి ఇంతకన్న దృష్టాంతమేముంది? నీమమ కారాన్ని, స్నేహశీలాన్ని, ఔదార్యాన్ని, ప్రేమభావాన్ని ఎంతపొగడినా నాకు తనివితీరదు. పరమశత్రువునుక్షమించి, ప్రేమించి తనదానినిగా చేసికోగలిగిన నీశక్తి చాలా అద్వితీయం. అక్కా! నీకుగాక ఈ విశాలహృదయం సాధారణంగా ఇతరులకెవరికీ ఉండదు." అని అన్నది మాధురి.

మాధురి ఇక మాట్లాడలేకపోయింది. కంఠం గాద్గదికమైంది. కన్నీరు అవిరామంగా ప్రవహిస్తోంది. నిట్టూర్పులు విడుస్తోంది. ఆమె స్థితిచూచేసరికి సుషమకుకూడా మనస్సు ఆగలేదు. తానుకూడా కళ్ళనీళ్ళు తుడుచుకొంటూ మాధురిని తన బడిలోకిలాక్కొని గుండెలకదుముకొంటూ ఉద్వేగం పొందింది. ఆసమయంలో వారిద్దరి సమ్మేళనంలో చెప్పరాని భావోద్రేకం, అభూతపూర్వమైన కరుణారసం పొంగిపోయింది.

సుషమ పైటచెరగుతో కళ్ళుతుడుచుకుంటూ మాధురితో అన్నది- "సోదరీ! నువ్వు నన్నుగురించి ఏమేమో గొప్పగా చెప్తున్నావు. నువ్వు అట్లా ఎందుకు

అంటున్నావో నాకేమీ అర్థంకావడంలేదు. నువ్వు చెప్పిన దానిలో శతాంశానికైనా చివరకు వెయ్యోవంతుకుకూడా నేను అర్హురాలనుకాను. మానవులు దేశకాలపరిస్థితులకు దాసులు. పరిస్థితులే వారిని కాలానుసారంగా మారుస్తూంటాయి. ఇంతవరకు నేను నీకు శత్రువును. విరోధినైన నన్ను క్షమించి, ప్రేమించి నీఆప్తురాలినిగా చేసుకున్నావు.' అని నన్నుగూర్చి నీవుఅన్నావు. ఒకప్పుడు నేనుకూడా నీ విషయంలో ఇట్టి దుర్భావనలోనే ఉండేదాన్ని. నిన్ను పరమ శత్రువుగా నిశ్చయించాను. కాని ఈనాడు దైవము నా కన్ను తెరిచాడు. జ్ఞాననేత్రం ప్రసాదించాడు. అందుచేత ఇదీ నా కర్మానుభవమేకాని నీదోషం ఏమీలేదని, నీ హృదయం ఎంతోపవిత్రము, స్వచ్ఛమైనదని గ్రహించాను. నా భ్రమ తొలిగింది. నాకష్టంలో భాగంపంచుకొనే ఆప్తురాలు నీకన్న నాకు ఎవరూలేరని తెలుసుకొన్నాను. సోదరీ! ఇది ముమ్మాటికీ నిశ్చయం. ఈశ్వరుడీనాటికి నాకీ నిశ్చయ జ్ఞానం కలుగజేశాడు."

సుషమ అన్నమాటకు మాధురి ఏదో జవాబుచెప్పాలనుకొంటోంది. ఇంతలో మాధవబాబు అక్కడకు వచ్చాడు. మాధురి సిగ్గుపడి ఆ చెప్పదలచుకొన్న మాటలను ఆపేసింది.మాధవబాబు కలుగజేసుకొని మాధురీ! ప్రసంగాలకేమిలే! ఎప్పుడూ జరుగుతూనే వుంటాయి. మనమిప్పుడు సమయోచితమైన కార్యక్రమంలో ప్రవేశించాలి. మిగతవిషయాలు తరువాత మాట్లాడుకోవచ్చును. కొంచెం శ్రమపడిలేచి స్నానానికి నీళ్లుసిద్ధంచేశాను. స్నానంచెయ్యి.

బట్టలుమార్చుకో. ఈదినం ఉదయంనుంచి సుషమ మంచం దిగి బయటకురాలేదు. అందుచేత వంటకూడ సిద్ధంకాలేదు. అయితేఏమి! ఏదోవిధంగా ఉదరపూజచేయాలికదా! లేకపోతే ముందుకార్యం ఎట్లాజరుగుతుంది. రొట్టెలు తయారుచేశాను. పాలు కాగివున్నాయి. చక్కెర సిద్ధంగావుంది. ఏదోవిధంగా ఊరగాయ నంజుతూ తీసుకో. నీవంటిదానికి ఈ నిరుపేదకుటీరంలో తగిన ఆతిథ్యం ఎట్లాలభిస్తుంది? ఏమి ఇయ్యగలము? మాధురీ! ఈపేదవాడిచ్చే రొట్టెలనే నువ్వు షడ్రసోపేతమైన మృష్టాన్నము, పిండివంటలుగా భావించి గ్రహించాలి," అన్నాడు.

మేనమామమాటవిని సుషమ, "ఔనుమాధురీ! మా మామయ్యకు నామూలంగా ఎంతకష్టంకలిగిందోచూశావా? ఈ దినమేకాదు. నాకీ దుస్థితి వచ్చిందిమొదలు తరుచుగా ఈయన కీ కష్టం తప్పడంలేదు. నేనువుండి లేనిదానితోనే సమం అయినాను. నేనుచేస్తానన్నా మామ నన్ను చేయనీయడు. సోదరీ! కాలాతీతమైంది. ఎప్పుడు భోజనంచేశావో ఏమో! లేచి........." అన్నది.

"అక్కా! మామయ్య నాకోసం అంతకష్టపడ్డారంటే ఆయనకష్టం వృథాచేసి వారిమనస్సును చికాకుపరిస్తే నాకు పాపంచుట్టుకొంటుంది. భగవంతుడు సంతోషించడు. మామయ్యచేతిప్రసాదం నాకు సర్వశుభాలను కలిగించి నా సంకల్పాన్ని పూర్తిచేస్తుంది. మామయ్యా! మమల్నిద్దరినీ వదిలి నువ్వు మెదలకుండా లోపలికివెళ్ళి ఎంతపనిచేశావు!" అన్నది మాధురి చిరునవ్వు నవ్వుతూ.

"అమ్మా! ఏమిచెయ్యమంటావు. సుషమకన్న నా కెవ్వరున్నారు? దానిని కష్టపెట్టి అది అవస్థపతూంటే నే చూడలేను. శరీరాన్ని పోషించకపోతే వ్యాధిగ్రస్తమౌ తుంది. కడుపులో ఎలుకలుజోరపడినప్పుడు వానికేదైనా ఆహారంవేసి కడుపునింపాలి." చిరునవ్వు నవ్వుతూ జవాబి చ్చాడు, మాధవబాబు.

మాధురి లేచి బయటికివెళ్ళి కాళ్ళుచేతులు ముఖము కడుక్కొని బట్టలుమార్చుకొనివచ్చి తనకుగావేసిన పీట మీద కూర్చుంది. మాధవబాబు పళ్లెంలో వడ్డించి మంచి తీర్థంతోసహా తెచ్చి మాధురిముందుంచాడు. ఇంతేగాక సుషమ తాను ఇద్దరూకూడా ఆమెతోపాటు ఎదురుగా కూర్చుని రొట్టెలు ఫలహారంచేయడం ప్రారంభించారు. వేడిపాలలో చక్కెరకలిపి మాధవబాబు ముందే మూడు గిన్నెలలోపోసి పళ్లేలదగ్గర సిద్ధంగా వుంచాడు. ముగ్గురు ప్రసన్నహృదయాలతో తృప్తిగా భుజించారు.

సుషమ, మాధవబాబు ఇచ్చిన ఆతిథ్యం, చూపిన ఆదరణ మాధురికి అత్యంత సంతోషాన్ని కలిగించాయి. వారి సౌహార్ద్రభావాన్ని ఆమె మరువలేకపోయింది. నిరాడం బరంగా అతి దయాభావంతో వారిచ్చిన ఆతిథ్యసత్కార ప్రభావం ఆమెహృదయమంతా నిండిపోయింది. జీవితంలో మరవడానికివీలులేని పరిస్థితికల్పించింది. సుషమమీద ఆమె కున్న ప్రేమ, మాధవబాబుపైగల శ్రద్ధ మునుపటికన్న నాలుగురెట్లు అధికమైంది. ఆ మేనమామ మేనగోడండ్రు

చేసిన గౌరవం, ప్రేమాదరణ ప్రవాహాలలో మాధురి తన పై నున్న కళంకాన్ని కడిగివేసుకొని పరిశుద్ధురాలైంది.

భోజనానంతరం అందరూకలిసి సుషమగదిలోకి వచ్చారు. సుషమ తనకుదగ్గరగానే మాధురికి పక్క వేసింది. ఇద్దరు పరుండి ఏదో లోకాభిరామాయణం ప్రసంగించు కొంటున్నారు. ఉదయంనుండి మాధురి చాలా శ్రమపడి ఉండడంచేత పరుండగానే నిద్రపోవలసిందేగాని ఆమె నిద్ర పోలేదు. ప్రొద్దుపోయేవరకు సుషమతో ఏదో ప్రసంగిస్తూనే ఉంది. అప్పట్లో వారిద్దరిస్థితి విమర్శతోచూస్తే రెండు జీవ నదులు చెరియొకవైపునుండి ప్రవహిస్తూ ఒకచోటకలిసి తమ భర్తయైన సముద్రుని దర్శనంకోసం ఎదురుచూస్తూ వెళ్తూన్నట్లు తోచకమానదు. కారణం ఏమంటే—కుమార్ కోసం ఇద్దరిహృదయాలు పరితపిస్తూనే వున్నాయి.

మరునాటిఉదయం మాధురిలేచి కాలకృత్యాలు తీర్చు కొని ప్రయాణసన్నాహం చేస్తోంది. మాధురి సాహచర్యం చేత సుషమ కొంత మనోవ్యాకులంతీరి స్వస్థపడింది. కాని అంతలో మాధురిప్రయాణ సన్నాహం ఆమెకు విచార కారణంఅయింది. తన విచారభావాన్ని వెలిబుచ్చుతూ—

"సోదరీ! మాధురీ! అప్పుడే వెళ్ళిపోవాలని చూస్తు న్నావా? అంతతొందర ఏమివచ్చింది? ఈ పేదకుటీరంలో ఇంకొక రెండుదినాలు గడపలేవా? నిజం చెప్తున్నాను, నీ సాంగత్యం నా మనస్తాపాన్ని కొంత తగ్గించింది. ప్రాధేయ పూర్వకంగా కోరుతున్నాను. నీకు ఈ ఇంట్లో సౌకర్యం

సరిగా లేకపోయినప్పటికీ నాకోసం రెండుదినములు వుంటావని ఆశిస్తున్నా" అంది సుషమ.

మాధురి సుషమమాటకు జవాబుచెప్పకుండా లేచి తన సూటుకేసు తెరిచి డిపాజిట్టురశీదు పైకితీసి చేతపుచ్చుకొని "అక్కా! నువ్వు ఎన్నడూ అట్లా అనుకోవద్దు. నా జీవితమంతా నీసేవజేస్తూ గడపాలని అనుకొంటున్నాను. మామయ్యా, నీవు చేసినఆదరణ నా తల్లిదండ్రులను మరపించింది. ప్రస్తుతం కార్యభారం మీదవేసుకొన్న నేను నీ కోర్కె తీర్చలేనందుకు చింతపడుతున్నాను. శీఘ్రంగా బయలుదేరి కర్తవ్యం నెరవేర్చుకోవాలి. నీతో ఒకవిషయం ప్రార్థనాపూర్వకంగా చెప్తున్నాను. ఇదిగో ఇదే. నిన్నటి దినం జరిగిన జమీందారీవేలాంతాలూకు డిపాజిట్టు రశీదు. అంటూ ఆ రశీదును సుషమచేతికందిస్తూ "చూడు. అక్కా నే నీ దుస్సాహసకార్యం మీదవేసుకొన్నాను. దీన్ని నువ్వు అంగీకరిస్తావనీ, స్వీకరిస్తావనీ నమ్ముతున్నాను." అన్నది మాధురి.

సుషమ రసీదును తీసుకొని చదువుకొంది. అందులో ఈవిధంగా వ్రాయబడివుంది. "కుమారబాబుగారి జమీందారీయావత్తూ పబ్లిక్ వేలంపాటలో సుషమాదేవిపేరున పాడబడిన లక్షఎనభై వేలరూపాయల ఆఖరుపాటమీద ఖాయపరుస్తూ నాలుగవవంతు డిపాజిట్టుక్రింద సుషమాదేవి గారికిగాను మాధురీదేవిగారు చెల్లించిన ఏబదివేలరూపాయలుపోను మిగతామొత్తం నెలదినములలో చెల్లించి కోర్టు

వారివలన క్రమమైన స్వాధీనపత్రమును పొందవలయును. తేదీ, కోర్టుముద్ర, అధికారి చేవ్రాలు ఉన్నాయి.

ఇదంతా చదివినతర్వాత సుషమ తనకళ్ళను తానే నమ్మలేకపోయింది. ఆమెకంతా స్వప్నంవలె కనపడుతోంది. నోటమాటాడలేక దిగాలుపడి మాధురిని చూస్తోంది. మాధవబాబు ఆగలేక ఆ రసీదును తీసుకొని చదివేసరికి ఆ వృద్ధునకు ముచ్చెమటలుపోశాయి. వెంటనేలేచి అన్నాడు. "మాధురీ! ఎంతసాహసంచేశావు? ఎంతత్యాగం! నాబిడ్డకోసం ఇంత మహాసాహసానికి పూనుకున్నావా? సుషమా! మాధురిని మనం పొరపాటుగా ఊహించాము. ఆమె మానవకాంత కాదు. దేవతాస్వరూపిణి. వేశ్యాలయందీ త్యాగశక్తి, ఇంత ఉదారభావం కనివిని ఎఱుగనివిషయం."

క్షణకాలంక్రితం తనభర్తతాలూకు జమీందారీ అంతా పరహస్తగతమైందని, తనమాట ఎట్లాఉన్నా తనపతి పరమదారిద్ర్యదశలో జీవితం ఎట్లాగడుపుతారు? అని దుఃఖపడుతూన్న సుషమ ఆకస్మికంగా తలవనితలంపుగా సంభవించిన ఈసంఘటనకు విభ్రాంతురాలై మాట్లాడలేకపోతోంది. మాధురి మాధవబాబుతో "మామగారూ! అంతపెద్దమాటలు నావిషయంలో ఉపయోగించకూడదు. ఇది త్యాగముకాదు. నావిద్యుక్తధర్మమనుకొని ఈకార్యంలో అడుగుపెట్టేను. తలపెట్టినపని పూర్తికావాలని దీవించండి. ఎవరిసొమ్ము వారికోసం ఖర్చుపెట్టడం త్యాగం అనిపించుకోదు"—అన్నది.

రెండు మూడు నిముషాలకాలం ఎవరూ మాట్లాడ లేదు. ఆప్రదేశమంతా నిశ్శబ్దంగాఉంది.

మాధురిలేచి సుషమపాదములకడ మోకరించి "అక్కా! ఈపతితకు ఇంకొక్కమారు నీపాదాభివందనం చేసే భాగ్యంకలగజెయ్యి. నీపాదధూళి నానుదుట ధరించి కృతార్థురాలనౌతాను. నాహృదయతాపం తీరి నామనస్సు శాంతించాలంటే ఇంతకన్నా వేరేమార్గంలేదు." అన్నది.

సుషమ లేచి మాధురిని దగ్గిరగాతీసుకొని వారించింది. "మళ్ళా పాతపాఠం చదవడం మొదలుపెట్టేవు. ఇంకొక మాటు అట్లాఅంటే నేనుఊరుకోను. శిక్షిస్తాను. నువ్వు పతి తవుకావు. పరమపతివ్రతవు."

ఎంతచెప్పినా వినక మాధురి సుషమపాదములపై శిరస్సుంచి ఆమెపాదధూళిని తీసి నుదుటధరించి ప్రయాణ మైంది. సుషమ ఉండమని ఎన్నివిధములచెప్పినా వినక బయలుదేరి వీధిలోకివస్తూ మాధవబాబు పాదాలుపట్టుకుని అన్నది. "మామా? నాకింకా రెండుపనులున్నాయి. ఒకటి! మిగతా లక్షొముప్పదివేలరూపాయలు కోర్టులోకట్టడం; రెండ వది: నామూలంగా బలవంతంగా దేశభ్రష్టులైన కుమార బాబును అన్వేషించడం—ఈకార్యాలు నాకు సులభసాధ్యం అయ్యేటట్లు దీవించండి. ఈదాసిని మరచిపోవద్దు."

మాధవబాబు కన్నీరుగారుస్తూ మాధురిని లేవదీసి తల మీద చెయ్యివుంచి నిండుహృదయంతో దీవిస్తూ అన్నాడు. "మాధురీ! నిన్ను మరిచిపోతే యమలోకంలోగూడా నాకు స్థానం దొరకదు."

అనంతరం మాధురి బండిఎక్కి రైలుస్టేషనుకు వెళ్ళింది. మాధవబాబుకూడ ఆమెను రైలుఎక్కించిరావాలని స్టేషనుకు వెళ్ళాడు.

* * *

మాధురి వెళ్ళిపోయింది. ఆమె సంతోషానికి అంతు లేదు. అయినప్పటికీ హృదయంలో ఎంతమాత్రమూ శాంతి లేదు. వాయిదా మొత్తం ఏవిధంగా సమకూర్చవలసి ఉంటుందో, దానికి మార్గమేమో తోచడంలేదు. మనస్సంతా క్షోభపడుతోంది. ఆనంద విషాదాలమధ్య ఆమె హృదయనౌక ఊగుతోంది. అదేపనిగా కూర్చుని ఆలోచిస్తోంది. ఎంతయోచించినా దారికనపడడంలేదు. వెనుక తాను నటించిన ఫిలింకంపెనీతో సంబంధం విడగొట్టుకుంది. తిరిగి ప్రవేశించడానికైనా ఆ కంపెనీ కొత్తఫిలిములు తయారుచేసేస్థితిలోలేదు. ఇంకేమిచేస్తుంది? తనకార్యక్రమాన్ని ఏదోవిధంగా మార్చుకొని ముందడుగువెయ్యాలనే ఉత్సాహం మనస్సులో గంతులువేస్తోంది.

క్రమంగా ప్రయాణంపూర్తిజేసి మాధురి ఇంటికిజేరి దివారాత్రములు మనస్సులో ఆలోచించసాగింది. కరుణామయుడైన భగవానుడు ఆమెతపస్సును ఏవిధంగా సఫలం చేస్తాడో!

# 15

మాధురి సౌందర్యవతి, విద్యావతియేగాక అపూర్వ ధైర్యము, అపరిమితసాహసముగల విలక్షణశక్తిశాలిని. తలపెట్టినకార్యము నిర్వహించడానికి మార్గమేదా? అని ఆలోచించడం ప్రారంభించింది.

"వేశ్యకు రూపమే జీవనాధారము. ఆ నర్తకియొక్క పాదవిన్యాసాలకు, చంచలదృక్కులకు, సౌందర్యానికి, మందహాసానికి విలువకట్టాలండే ఎన్నివందల బంగారు నాణెములైనా చాలవుగదా! ఇంత ఆలోచన ఎందుకు? ఒక కటాక్షవీక్షణప్రసారంతో ధనవంతులు దాసానుదాసులౌతారు. కనక వర్షం కురుస్తుంది. సులభంగా ధనంసంపాదించాలంటే ఇది తేలికమార్గం. కాని తిరిగి వేశ్యావృత్తిలో ప్రవేశించడమా! ఇంతకాలం కుమార్‌ను ఏకైకప్రియునిగానమ్మి సకల భోగాలు అనుభవించి ఇప్పుడు అతనిని సాగనంపి ధనంకోసం ధనికులైన విటులకీ శరీరాన్ని స్వాధీనంచెయ్యడమా! ఛీ! ఛీ! ఎంత నికృష్టజీవనం! కంఠంలో ప్రాణంఉన్నంతవరకు నేనాపని చెయ్యలేను. ఇంతకన్న చౌర్యం, బందిపోటుతనంచేసి జైలుకుపోవడం మంచిది. అంతేగాని వ్యభిచారవృత్తిలో ప్రవేశించి దేహాన్ని ఎంగిలిపరచడం ఎంత నీచమైనపని? లేదు. ఆపనిచేయలేను. అదిమానితే డబునచ్చే మార్గం ఏమిటి? వాయిదాతాలూకు కురదలామొత్తం కోర్టులో ఏవిధంగా కట్టడం? ఇంతడబ్బు ఎట్లా సమకూరుతుంది?

ఈవిధంగా మాధురి, ఆలోచనలో మునిగి తేలుతోంది. ఈనాడు ప్రపంచమంతా ఆమెదృష్టికి శూన్యంగా కనపడుతోంది. ఏవిధంగానైనా తాను తలపెట్టిన కార్యంలో కృతార్థురాలు కావాలనే నిశ్చయంతో మనస్సును లగ్నం చేసింది. డబ్బువచ్చే విధానం ఎట్లాగాఅని ఆలోచిస్తోంది. సుషమయొక్క విచారాన్నిపోగొట్టి ఆమెకు సర్వసంతోషాలు కలిగించి ఆమెను సుఖవంతురాలిని చెయ్యడంలోనే మాధురిఆనందం ఇమిడిఉంది. అందుకై ఆమె ఈ గడ్డుసమస్యను ఎదుర్కొనవలసివచ్చింది. ఇంతడబ్బు ఏవిధంగా సమకూరుతుంది? ఎవరు అప్పిస్తారు? అందుకు తగిన స్థిరరూపమైన ఆస్తి ఏముంది? దేనినిజూచి ఋణదాతలింతపెద్ద మొత్తాన్ని అప్పుఇస్తారు? ఈవిధంగా ఆలోచించేసరికి ఆమెకు తలతిరిగిపోతోంది. కూర్చున్నప్పుడు, భోజనం చేసేసమయంలో, పడున్నప్పుడు, సర్వకాల సర్వావస్థలయందు ఆమెకదే ఆలోచనఅయింది. తన ప్రాణాలనొడ్డి యిట్టి దుస్తర కార్యం తానెందుకు మీదవేసుకొన్నదో తెలుసుకోలేక పోతోంది. అలవిగానిపని మీదవేసుకోడానికి కారకులెవరు? ఎవరితప్పు? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పడం చాలాకష్టం. జగన్నాటకసూత్రధారియైన పరమేశ్వరుడీ కార్యం ఎట్లాచేయదలచుకొన్నాడో? దైవనిర్ణయంముందు మానవసంకల్పాలు ఎప్పుడూ సాగవు.

అయినప్పటికీ సంకల్పవికల్పాలు మానవులకుకలగడం ప్రకృతివిలాసం. తాను చేయగలడో లేడో అనే నిశ్చయజ్ఞానం మనుష్యునకు ఉండదు. ముందు సంకల్పం చేస్తాడు.

ఎంతచేసినా దానిని నిర్వర్తించడం, తత్ఫలం లభించడం, ఈశ్వరాధీనమే. దైవబలంవల్లనే పూర్తికావాలి. కాని, ఆ సంకల్పం సత్సంకల్పమైతే భగవానుడుకూడ కొంత చేయూతనిస్తాడు. అందువలన మంచిఫలాన్ని పొందుతాడు. దుస్సంకల్పమైతే అంతకు నాలుగురెట్లుగా అనుభవిస్తాడు. చేసుకొన్నతర్వాత అనుభవించక తప్పుతుందా! వండుకొన్నతర్వాత తినకతప్పుతుందా! కావున ఇదంతా ఈశ్వరుని లీలావిలాసం. మానవులు ప్రకృతిబద్ధులు. మాయాధీనులు. మాధురికూడ అట్టివ్యక్తియే. అందుచేతచే అధోగతిపాలైన ఒకవ్యక్తిని కాపాడి ఒకయిల్లాలి కష్టాలను పోగొట్టాలని సంకల్పించింది. దైవమామెసంకల్పాని కెటువంటి దోహదంకలిగించాడో వూహించండి.

ఏపనీచెయ్యకుండా ఎందులోనూ దిగకుండా ఈ విధంగా ఆలోచనలుచేస్తూ కూర్చోడం బుద్ధిలేనితనమని మాధురి గ్రహించింది. ఎక్కడికైనాపోయి ఏదోపనిలో ప్రవేశించి కార్యారంభంచెయ్యాలి. ఆలోచిస్తే లాభంలేదని ఊహించి సామానులుసర్దుకొని అవసరమైన వస్తువులు, రొక్కము, బట్టలు, కొలదిగా పాత్రసామాను రెండుపెట్టెలలో సర్దుకొని పసుపుచుట్టతీసుకొని తిరిగి నాటకరంగంలో ప్రవేశించి అభినేత్రిగా నటించాలన్న ఊహతో బయలుదేరింది.

మాధురి కొన్నిప్రదేశాలు తిరిగితిరిగి బొంబాయి పట్నంచేరింది. అచ్చట తనకుతగిన స్వాగతంలభిస్తుందన్న నమ్మకం ఆమెకు కలిగింది. పట్టణమంతాతిరిగి తనప్రయత్నా

నికి అనుకూలంగాఉండే వాతావరణం ఉన్నచోట మూడంత స్థులమేడ అద్దెకుదీసుకొని ఒకదాసిని ఒకసేవకుని నియమించి ప్రేక్షకులకు ఆకర్షణీయంగా అలంకరింపచేసింది. సావిడిలో సోఫాలు, నిలువుటద్దాలు, కుర్చీలు, డ్రాయర్లు, గదిలో అందమైనఫోటోలు ఏర్పాటుచేయించింది. ఇప్పుడు మాధురి వెనకటిమాధురికాదు. వేషంఅంతా మార్చింది. విలువగల దుస్తులు, కొద్దినగలు ధరించి కట్టు, బొట్టు, జుట్టు, చక్కగా నాజూకుగా అలంకరించుకొని దివ్యాంగనవలె తయారైంది. రాజవీధిలో వచ్చేపోయేవారికి "మిస్‌లిలీ, సినిమానటి" అని పెద్దఅక్షరాలతో వ్రాయబడిన సైన్‌బోర్డు హృదయాకర్షణీయంగా కనపడుతోంది.

"మిస్. లిలీ, అభినేత్రి, సుప్రసిద్ధనర్తకి, నేషనల్ ఫిలింకంపెనీ" —అని పెక్కురంగులతో చిత్రింపబడిన ఆ బోర్డును వచ్చేపోయే పిన్నలు, పెద్దలు, వర్తకులు, నటులు, కవులు, కంపెనీ మేనేజర్లు అందరూ చదువుకొంటున్నారు.

ఆ దినం వెలువడిన "నేషనల్ హెరాల్డ్" పత్రికలో ఈ విధంగా ప్రకటింపబడిఉంది.

"సుప్రసిద్ధమైన నేషనల్ ఫిలింకంపెనీలో అనేక
లలో నటించి తన నాట్య గానాలతో వేలకొలది
సంతోషవారధిలోముంచిన ప్రఖ్యాతనర్తకి,నటీమణి,
వాయుపరివర్తనమునకై బొంబాయి వచ్చినదని
సంతోషకరమైనవార్త. సుమారు ఇరువది
యిలో ఉంటుందని అందరూ

బొంబాయినగరంలో ధనికులంద రీ ప్రకటనచదివి ఆశ్చర్యపడ్డారు. మరునాటిఉదయం ఎనిమిదిగంటలుకాకుం డానే అనేకమంది ప్రతికాధిపతులు, ఫొటోగ్రాఫరులు, కార్లు, బండ్లతో ఆమెనుచూచి మాట్లాడాలనివచ్చి ఆమె రాకకై, ఆహ్వానానికై ఎదురుచూస్తూన్నారు. ఆమెతో ప్రసంగించాలని, ఆమెఫోటో తీసుకోవాలనీ వారి సంకల్పం. మాధురి వారికి అట్టి అవకాశాలు ఇయ్యక అందరితో తల కొక రెండునిముషాలుచొప్పున మాట్లాడి పంపివేసింది. నాలుగుదినాలు జరిగేసరికి అందరికీఆమెప్రస క్తియే, ఎవరినోట విన్నా ఆమెపేరే. పట్టణమంతా కోలాహలంగా చెప్పుకోడం సాగించారు. లక్షాధికారులు కోటీశ్వరులు ఆమెప్రేమవీక్ష ణాలకోసం ప్లానులు తయారుచేస్తున్నారు. మాధురిమాత్రం ఏమీచలించలేదు. తాను పూనుకొన్న కార్యానికి అను కూలమైన మార్గంకోసం ఎదురుచూస్తూ వచ్చినవారందరికీ చిరునవ్వుతో సమాధానంచెప్పి పంపించసాగింది. నియమిత కాలంలో వచ్చినపెద్దమనుష్యులకందరకు మూడునాలుగు నిమిషాలు అవకాశం. వెంటనే సేవకుడు గంటకొట్టాడు. వచ్చినపెద్దమనిషి వెళ్ళిపోతాడు. ఈవిధంగా జరుగుతో వారము పదిదినాలీవిధంగా జరిగింది. మాధురి ఎవరికీ మైన అవకాశం ఇయ్యలేదు. తన కర్తవ్యం ఎట్లా అవుతుందా అనే ఆలోచనలోఉంది.

ఒకనాడు అదృష్టవశాతు "ఆ ప్రొప్రైటరు ఫిలింతీయాలనే ఉద్దేశ్య లిలీతో మాట్లాడాలనివచ్చాడు. తా

ఈనాటికి లభించిందన్న సంతోషంతో మాధురి కాలకృత్యాలుతీర్చుకొని స్నానంచేసి దివ్యాంగనవలె తయారై వచ్చి ఫిలింకంపెనీ ప్రొప్రైటరునుజూచి నమస్కారంచేసింది. ప్రొప్రైటరు ప్రతివందనం చేశాడు. ఇద్దరూ కూర్చున్న తర్వాత వంటమనిషి వచ్చి రెండు వెండిగ్లాసులతో కాఫీ తెచ్చి ఎదురుగా బల్లమీాదఉంచి వెళ్ళిపోయింది. ఇష్టాలాపములతో కాఫీత్రాగటం పూర్తిచేశారు. మాధురి సౌందర్యాన్నిచూచి 'అబ్బా! ఏమిసౌందర్యం!' అని ఆశ్చర్యపోయాడు. ఇద్దరికీ ఈవిధంగా సంభాషణజరిగింది.

"మేమొక ఫిలింతీయాలనే ప్రయత్నంలో ఉన్నాము. అందులో మీరు ప్రధానభూమికను అభినయించాలని కోరుతున్నాము. మీరుకోరిన మొత్తం ఇయ్యడానికి సిద్ధంగా ఉన్నాము. అంతేగాదు మీరు మాకంపెనీలో స్థిరంగాఉండాలి" అన్నాడు ప్రొప్రైటరు.

"నిన్నటిదినం 'భారత్ ఫిలింకంపెనీ' మేనేజరుగారు వచ్చి మాట్లాడివెళ్ళారు. ప్రస్తుతం నేను సినిమారంగంలోంచి విరమించుకుందామనుకొంటున్నాను. ఈ రభసలో కాలుపెట్టడం నాకిష్టంలేదు" అన్నది మాధురి.

"మీవంటివారే ఇట్లాఅంటే సినిమాకళ దేశంలోంచి వెళ్ళిపోయిందనే అనుకోవాలి. మీ అభిప్రాయాన్ని మార్చుకొని ఇంకా కొంతకాలం కళోపాసనజేసి కొన్ని ముఖ్యపాత్రలను వహించి సినీమారంగాన్ని ప్రకాశింపజేయాలి అని నా తలంపు."

"మార్చుకోడం అంత తేలికపనికాదు. నాకుగూండ

కొన్ని నియమాలు ఉన్నాయి. షరతులున్నాయి. అందుకు కంపెనీవారంగీకరించాలి. అది చాలా కష్టం. కనుక మార్చు కోడం సంభవం కాదు."

"మీ నియమాలకు షరతులకు మేమంగీకరిస్తాము. మాశక్తికి మించకుండా ఉంటే మీరుకోరిన వేతనం ఇస్తాము. అడ్వాన్సు కావాలంటే కొంత తీసుకోండి. మీరూపం మేము తియ్యబోయే ఫిలిమునకొక అలంకారంగా ఉంటుం దని ఊహిస్తున్నాను."

"నేను ఆలోచించి నానిర్ణయం మీకు తెలియ జేస్తాను. మీరు రేపుఉదయం దయచెయ్యండి."

"అల్లాగే. బాగా ఆలోచించి చెప్పండి. నేను రేపు వస్తాను. నమస్తే."

"నమస్తే." అంది.

ప్రొప్రైటరు వెళ్ళిపోయాడు. మాధురి ఆ దినమంతా ఆలోచించి మరునాడు "ఆదర్శఫిలింకంపెనీ" ప్రొప్రైటరు రాగానే ఈవిధంగా తననిర్ణయం తెలియజేసింది.

"నాకు అడ్వాన్సుగా రెండులక్షలరూపాయలు కావాలి. సుమారు ఒకసంవత్సరంకన్న నేను ఎక్కువదినాలు ఉండను. నేను రెండుఫిలిములలో మాత్రం యాక్టు చేస్తాను. కంపెనీవారు నేనుకోరిన షరతులకు అంగీకరించి నట్లయితే నెల 1కి పాతికవేలరూపాయల జీతం తీసుకొంటాను."

ప్రొప్రైటరు అందుకు తనఅంగీకారాన్ని తెలియ జేశాడు.

మాధురి తానుకోరినషరతులను ఉదహరిస్తూ ఒక కాగితం వ్రాసిఇచ్చింది. ప్రొప్రైటరు దానిని తీసుకొనివెళ్ళి అందరికీ చూపించి వారిఅనుమతికూడా పొందినతరువాత రెండులక్షలు మాటప్రకారం మిస్. లిలీకిచ్చి పరస్పరం కంట్రాక్టువ్రాతను పూర్తిచేయించాడు. తాననుకొన్నపని ఈనాటికి పూర్తిఅయిందిగదా అని ఆనందపడుతూ భగవంతునకు వందనాలు సమర్పించింది. వేలాంతాలూకు మిగతా మొత్తం కట్టవలసినదినం అప్పటికి ఇంకా పదిదినాలు మాత్రమే ఉంది.

వాయిదాలోగా ఒకదినం మాధురి పైకంఅంతా తీసుకొనివెళ్ళి బ్యాంకిలో గవర్నమెంటువారిపేర సూటు నెంబరు, వేలాం నెంబరు, తేదీ ఉదహరిస్తూ జమకట్టి రశీదుతీసుకొని కోర్టుకుపంపిస్తూ ఒక అర్జీకూడా ఈవిధంగావ్రాసి కోర్టువారికి రిజిష్టరుచేసి పంపించింది.

"వేలాంతాలూకు మొత్తం అంతా పూర్తిగాచెల్లించి బ్యాంకురశీదు పంపడమైనది. సదరువేలాంఆస్తికి ఆ ఎస్టేటుకు రాణియైన సుషమాదేవిపేర క్రయదస్తావేజును వ్రాయించి ఆమెకు పంపగోరుచున్నాను. ఇది నాసమ్మతిని వ్రాసిపంపుకొన్న అంగీకారపత్రం" అని కోర్టువారిపేరవ్రాసి సుషమాదేవి కీవిధంగా ఒకజాబు వ్రాసింది. "ప్రియసోదరీ! పరమేశ్వరానుగ్రహంవలన వేలాంతాలూకు యావత్తుమొత్తం జమకట్టి రశీదు కోర్టుకుపంపించాను. ఇకమీద నీ ఎస్టేటును నీవు జాగ్రత్తగా కాపాడుకో. నీపేరనే క్రయదస్తావేజు కోర్టు వ్రాసిఇస్తుంది. కొంతవరకు నాకర్తవ్యాన్ని నేను నెఱవేర్చ

కొన్నాను. ఇంకా కొంతమిగిలిఉంది. అదికూడా దైవాను గ్రహంవల్ల పూర్తికాగలదని నా నమ్మకం.

ఇట్లు,
అభాగిని,
మాధురి."

అని వ్రాసి మాధవబాబుకుకూడా ఒక జాబు వ్రాసింది.

"మామాజీ! నమస్కారములు. సోదరి సుషమయొక్క సౌఖ్యం, సంతోషంకోసం నేనుచేయగల్గిన యీస్వల్ప కార్యం నావల్ల కలిగిన ప్రమాదానికి ప్రాయశ్చిత్తరూపంగా భావనచేస్తున్నాను. సోదరి సుఖానందాలకన్న నాకు కావల సిన దేముంది? ఎస్టేటు అన్యాక్రాంతంగాకుండా మీ ఆశీర్వ చన బలంవలన దేవునిదయవలన సోదరిపేర నిలువబెట్టడ మైంది. ఈదీనురాలు చేసినసేవను సోదరి ఆనందంతో స్వీక రిస్తుందని భావిస్తున్నాను. తరువాత కుమారబాబుయొక్క జాడను తెలుసుకోవలసిన పనిఒకటి ఉంది. అదికూడా విజయ వంతంగా పూర్తికాగలదని, భగవానుడు మనకట్టి దివ్యావ కాశాన్ని ఇస్తాడనే పూర్తిగా నమ్ముతున్నాను, మామాజీ! ఇదంతా మీ దివ్యపాదసేవాఫలం. సోదరి సుషమ ఇకమీద జాగ్రత్తగా తన స్వగృహానికివెళ్ళి ఎస్టేటును రక్షించుకోగల దని, అందుకుతగిన దోహదం తాము కలగజేస్తారనీ ఆశిస్తు

న్నాను. ఆడుదానను. ఇంతకన్న నేను చేయగలిగిన దేముంది. తప్పులు క్షమించండి.

ఇట్లు,
మీ పాదసేవిక,
మాధురి. (మిస్. లిలీ)."

* * *

ఆరోజున శ్రీమతి, రాణి సుషమాదేవియొక్క పాలకీ మహావైభవంతో పరిచారికాసహితంగా వచ్చి కుమార్ బాబు భవనంముందు ఆగింది. గ్రామంలో ఆబాలగోపాలం ఆనందంతో మునిగి తేలుతున్నారు. జమీందారుభవనమంతా పరిశుభ్రంచేయబడి వెల్ల వేయబడి వుంది. తోరణాలతో అలంకరించారు. మహాలక్ష్మీదేవి ఈనాడు రాణి సుషమా దేవిరూపంలో భవనాన్ని అలంకరింపవచ్చిందని యావన్మంది ఆనందభాష్పాలు విడిచారు. కుమార్ బాబుకూడా కొద్దిదినాలలో వెనుకటి దుర్వ్యసనాలను పూర్తిగా పరిత్యజించి ఇంటికివసాడని జనంఅంతా వూహిస్తున్నారు. కాని సుషమకు ఆనందంలేదు. ఆమెహృదయంలో విషాదాంధకారం అలము కొని ఉంది. తాను తిరిగి రాణినైనానన్న ఉత్సాహం, సంతోషం ఏమీ ఆమెకు కలగలేదు. రాజభవనంలో విచారంతోనే ప్రవేశించింది. తనభర్తలేని ఈ వైభవ మామె మనస్సుకేమీ ఉల్లాసం కలిగించలేదు.

మాధవబాబు ఎస్టేటుమేనేజిమెంటుకు సంబంధించిన కార్యభారమంతా పైనవేసుకొన్నాడు. ఈ విజయోత్సవం సంతోషసూచనగా రైతులందరికీ ఆ సంవత్సరంమాత్రం

శిస్తులో కొంతభాగం తగ్గింపుచేయడం - ఉద్యోగస్థులు, కర్మచారులు, దాసదాసీజనమునకు ఒక నెలజీతం బహుమతిగా ఈయడం జరిగింది. స్త్రీపురుషులు, బాలబాలికలు అందరూ శ్రీమతి రాణీ సుషమాదేవిని స్తోత్రాలుచేశారు. అంతటా ఆనంద,ఉత్సాహాలు వెల్లివిరిసిపోయినాయి.

ఇంతజరిగినా సుషమకుమాత్రం మనోవ్యాకులం వదలలేదు. దానికికారణం అందరికి తెలిసినదే. ఆమె ఆనందోత్సాహాలు భర్తరాకమీద ఆధారపడిఉన్నాయి.

# 16

ఇంతవరకు తనకులభించిన కృతార్థతకు మాధురి ఎంతో సంతోషించింది. గొప్ప ఉన్నతమైన అభిలాష నెఱవేరినట్లు సంతృప్తిచెందింది. కాని కుమార్ కనపడకపోవడం, అతనిజాడ తెలియకపోవడంచేత ఏదో పెద్దకొఱతఉన్నట్లు ఆమెకు కనపడుతోంది. ఎన్నటికైనా కుమార్ తానుచేసిన పనికి పశ్చాత్తాపపడి భార్యయైన సుషమను కలుసుకొని ఆమెనుప్రేమించి సకలభోగాలు అనుభవిస్తూ భార్యనుసుఖపెట్టి తాను ఆనందపడేసమయం, అట్టిశుభయోగం లభిస్తే మాధురి ఆదినం నిజమైనఆనందాన్ని పొందుతుంది. అంతవరకు ఆమెకు మనశ్శాంతి, సంతృప్తి కలుగదు. కనుక కుమారబాబుజాడ తెలుసుకోడానికై అనేకవిధాలుగా ప్రయత్నాలుచేస్తోంది. ఈమధ్యలో మాధవబాబుకు జాబులు వ్రాసింది. మామాజీఇచ్చిన జవాబులనుబట్టి కుమారబాబు సుషమదగ్గరకురాలేదనీ, జాడ ఏమీ తెలియరాలేదనీ గ్రహిం

చింది. ఈ వృత్తాంతము ఆమెహృదయాని కెంతో వ్యథగల్గించింది. అప్పటినుండి ఆమె సమస్తసుఖభోగాలనువదలి సామాన్యస్త్రీవలె జీవితంగడుపుతూ కుమారబాబుజాడ తెలియడానికి తగినప్రయత్నాలన్నీ చేస్తోంది. ప్రతిమీటింగుకు, క్లబ్బులకు, సినీమాహాలులకు తప్పకుండా వెళ్ళి వెదకడం సాగించింది. చాలాధనం ఖర్చుపెట్టి గూఢచారులను అనేక చోట్లకు పంపడమేగాక, కుమారబాబుజాడ తెలిపినవారికి అయిదువేలరూపాయలు పారితోషికం ఈయబడునని అన్ని పత్రికలలోనూ ప్రకటన వేయించింది.

ఈవిధంగా ఒకసంవత్సరకాలం గడిచింది. కుమారబాబుజాడ ఏమీ తెలియలేదు. మాధురికి నానాటికి విచారం అధికమౌతోంది. అయినప్పటికి ఆమె తనప్రయత్నం మానలేదు. అతను ఎక్కడో దాగిఉన్నాడు. ఎన్నటికైనా కనపడకమానడని మాధురియొక్క విశ్వాసం.

ఇక కుమార్ కార్యప్రణాళిక ఏవిధంగాఉందో కొంచెం విచారణచేద్దాం. అతడొక దేశద్రోహులైన దొంగల గుంపులో కలిశాడు. అతనిమనస్సులోఉన్న విద్రోహభావానికి తగినసాంగత్యం, తదనుకూలమైన సమాజం దొరికింది. వాతావరణం, అవకాశం అన్నీ అనుకూలంగా కలిసివచ్చాయి. ఇంకేమికావాలి? పరిచయం అధికమైనకొద్దీ కుమార్ తన తెలివితేటలచేత వారికందరికీ నాయకుడై దొంగతనము, త్రాగుడు, ఈరెండింటిలో గొప్పఅనుభవం సంపాదించాడు. చౌర్యవృత్తివల్ల సంపాదించిన ధనమంతా పైకార్యాలకింద సరిపోతుంది. ఆ కార్యక్రమం అంతతో ఆగ

లేదు. మాధురిని ఎప్పుడు ఏవిధంగా చంపుదామా? అన్న ఆలోచనలోకి దింపింది. దైవవశంచేత మాధురి తనప్రదేశం వదిలి ఇంకొకచోట ఉండడంచేత అతనిసంకల్పం కొనసాగలేదు.

మాధురిని వధించాలనే నిశ్చయంతో కుమారబాబు పరివారసహితంగా పాతఇంటికివెళ్ళి రాత్రివేళ కన్నంవేసి ఇంట్లోప్రవేశించి నలుప్రక్కల వెదికి నిరాశతో బయట పడ్డాడు. కాని తనపట్టుదలనుమాత్రం వదలలేదు? ఎట్లాగైనా మాధురినిచంపి పగ సాధించుకోవాలన్న ఉద్రేకం ప్రతి నరంలోనూ వ్యాపించింది. ఎంతప్రయత్నించినా తనకోటిక నెఱవేరకపోవడం అట్లాఉండగా ఆమె ఎక్కడఉన్నదో ఆ జాడకూడా తెలియలేదు. దినాలు గడుస్తూన్నకొలదీ కుమార బాబునకు ఒకవైపు కోపం, ఇంకోవైపు చింత అధికమౌ తున్నాయి.

"నన్ను బలవంతాన గెంటివేసింది. అందుచేత నా మూలంగా ఎప్పుడోఒకప్పుడు తనకు ప్రమాదంసంభవిస్తుంది. అనే సంగతి గ్రహించియే మాధురి తననివాసాన్ని మార్చు కొన్నది. కనపడకుండా దాగింది. ఎన్నాళ్ళు దాగుతుంది? ఇవాళకాకపోతే రేపో, యెల్లుండో, కొన్నిదినాలకో ఆమె జాడ నాకు తెలియకమానదు. దుర్మార్గురాలు! నీచురాలు! రాక్షసీ! విశ్వాసఘాతకీ! వేశ్యా! నీకు సర్వనాశనంతప్పదు. నిన్ను ప్రాణంతో వదిలిపెట్టను. సంతోషించు. నీభోగం, నీ ఆనందం ఎన్నాళ్లోలేదు. నిన్ను సంహారంచేస్తేనేగాని నాకు శాంతిలేదు. నువ్వు ఎటువంటివ్యక్తితో విరోధించావో

అప్పుడు తెలుస్తుంది. నీ స్నేహితులతో కులుకుతూఉండు. నీ వినాశకాలం దగ్గిరకువచ్చింది." అని అనుకొంటున్నాడు.

కొన్నిదినాలకు కుమార్ రైలుస్టేషన్ వైపుగా వెళ్తూ న్యూస్ పేపర్లు అమ్మేవానిదగ్గరకువెళ్ళి "బోంబే క్రానికల్" అనే పత్రికనుతీసుకొని ఒకబల్లపైకూర్చుని చదువుతున్నాడు. మాధురివేయించిన ప్రకటనను చదవగానే అతనికి ఎంతో ఆనందంకలిగింది. తనలోతానే నవ్వుకొంటూ ఇట్లా అనుకొన్నాడు. "దొరికేవు. ఎక్కడికి పోతావు? నీ తెలివితేటలు, నేర్పరితనం అన్నీ గ్రహించాను. పారిపోయికూడా ఇంకా నావెంటబడుతూనేఉన్నావు రాక్షసీ! నాసొమ్మంతా తిని నన్నువెళ్ళగొట్టినా నీ దాహం తీరలేదా? తీరుతుంది. తొందరపడకు. నీకు దాహశాంతి చెయ్యడానికే వస్తున్నాను. ఇంకా నువ్వెక్కడకు వెళ్తావు. నిన్ను తెలుసుకోడం అతి సులభం."—

అనుకొంటూ పేపరుతీసి ప్రకటనను మళ్ళా చదివాడు.

"జమీందారు కుమార్ బాబుజాడ తెలుసుకొనివచ్చిన వారికిగాని లేక ఆయనను వెంటబెట్టుకొనివచ్చినవారికిగాని అయిదువేలరూపాయలు బహుమతిగా ఈయబడును. వివరములు తెలియగోరువారు ఈ క్రిందిఅడ్రసుకు వచ్చి తెలుసుకొనవచ్చును.

Box No. 65375,

బాంబే క్రానికల్."

దీనిని ఆధారంగాచేసుకొని మాధురిజాడ కనిపెట్టాలి.

అదెట్లా సాధ్యమౌతుంది? బాంబేక్రానికల్ సంపాదకుని కలుసుకొంటే ఆమెజాడ తెలుస్తుందా? కలుసుకుంటేమాత్రం అతను చెప్తాడా? చెప్పదలచుకొంటే పేపరులో బాక్సునెంబరు ఎందుకు వేయిస్తాడు? ఈవిధమైన శంకలతో కొంత ఆలోచనలో పడ్డాడు. పావుగంట కాలానికి అతనికి ఒకయుక్తి తోచింది. అట్లాచేస్తే తనఊహ నెఱవేరుతుందన్న నమ్మకం కలిగింది. వెంటనే ఎగిరి గంతువేశాడు. తనస్థానంచేరుకుని అనుచరులకందరకు "నేను కొంతకాలంవరకు మీకు కనపడను. జాగ్రత్తగాఉండండి" అని హెచ్చరించి పెద్దమనిషి వలె వేషంమార్చుకొని బొంబాయి వెళ్ళాడు.

బొంబాయివంటి మహానగరంలో మాధురిజాడ తెలుసుకోడం చాలా దుర్లభం. ఒకప్పుడు అసంభవంకూడా అవుతుంది. కొన్నిదినాలు ఆమెకోసం ప్రయత్నించి లాభంలేక 'బోంబేక్రానికల్' పత్రికా కార్యాలయమును తెలుసుకొని ఆఫీసుకువెళ్ళి సంపాదకుని కలుసుకొన్నాడు. ఒక అరగంట మాట్లాడినతరువాత కుమారబాబును ఒక ప్రధానకర్మచారిగ ఉండడానికి ప్రధానసంపాదకుడు అంగీకరించాడు. పదిదినాలు గడిచేసరికి సహాయసంపాదకపదవి ఒకటి ఖాళీఅయింది. కుమారబాబు తెలివితేటలు చూచి అతనిని ఆ పదవిలో నియమించాడు. తానుతలపెట్టిన కార్యంలో ఇంతవరకు కృతార్థత లభించినందుకు కుమారబాబు ఆనందించాడు.

సహాయసంపాదకుడైన తర్వాత కుమార్ చాలా ఉత్సాహంతో పనిచేస్తూ ఆఫీసులోఉండే ఇతరఉద్యోగస్థ

లతో ఎంతోమిత్రభావంతో చనువుగా కలిసిమెలిసి ఉండడం చేత నెలదినాలుగడిచేసరికి ఇతనిమీద అందరికి ఒకవిధమైన గౌరవభావం కలిగింది.ఇట్లాఉంటున్నా కుమార్ తనువచ్చిన పనియేమో మరచిపోలేదు. బాక్సు నెం 65375 కు తాలూకు రహస్యమును తెలుసుకోడానికి ఎంతో ప్రయత్నంచేస్తున్నాడు. ఆ రహస్యం ప్రధానసంపాదకునకేగాని ఇతరుల కెవరికీ తెలియదు. ఆతడెవరికీ ఈరహస్యం చెప్పడు. ఈ రహస్యభేదనమునకు మార్గమేమిటి?......కుమార్ హతాశుడు కాలేదు. తెలివితేటలను, ధైర్యసాహసాలను ఉపయోగించి మాధురిజాడ తెలుసుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

చివరకు ఆ దినంవచ్చింది. ప్రధానసంపాదకుని ఆఫీసులో ఒక గౌరవనీయురాలైన మహిళామణి కూర్చునిఉండగా కుమార్ చూశాడు. ఆమె మాధురిఅయివుంటుందని అనుమానించాడు. ఒకమారు అటుఇటు తిరిగి ద్వారందగ్గరకువచ్చి చూచేసరికి వాకిట్లో ఒక కారు ఆగింది. డ్రైవరు మాత్రము తనసీటులో కూర్చునిఉన్నాడు.కుమార్ మెల్లిగా ఆ డ్రైవరుదగ్గరకు వెళ్ళి అడిగాడు. "ఇంతకుముందు లోపలికి వెళ్ళిన మహిళామణి ఎవరు?" అని.

"ఆమెఎవరో మీకు తెలియదా ?" అన్నాడు డ్రైవర్.

"తెలిస్తే మిమ్మల్ని అడగడమెందుకు! ఈ మోటారు ఆవిడదేనా!" అన్నాడు కుమార్.

"మీరెందు కింత ఆసక్తితో ఆ విషయం అడుగుతున్నారు?"

"ఊరికేనే అడుగుతున్నాను. ఎవరో గొప్పయింటివారై ఉంటారు. ఎవరో తెలుసుకొందామని అడిగేను."

"మిస్. లిలీని ఎరుగనివారీ బొంబాయిపట్టణంలో ఎవరూలేరు. మీరు కొత్తవారనుకొంటాను."

"ఔను. నేను కొత్తగానే వచ్చాను. ఈమె ఎక్కడ ఉంటారు! గొప్పవిద్వాంసురాలనుకొంటాను."

"ఈమె సుప్రసిద్ధగాయని. సినిమా అభినేత్రి. 125 నెంబరు మేడలో ఉంటారు."

"అటువంటి ప్రసిద్ధవ్యక్తిసంగతి తెలియజేసి నన్ను కృతార్థుణ్ణిజేశారు. మీకు నా ధన్యవాదాలు"

—అంటూ కుమార్ లోపలికివెళ్ళి తనపనిలో ప్రవేశించాడు. పనిచేస్తున్నాడేగాని దృష్టి దానిమీదలేదు. ఎట్లాగో కాలంగడిపి బయటపడి 125 నెంబరు మేడ ఎక్కడా అని గాలించడంప్రారంభించి విశ్వప్రయత్నంమీద మిస్. లిలీ మేడ కనుక్కొన్నాడు. అదిమొదలు ప్రతిదినం కొంతసేపు మేడకింద మారువేషంతో అటుఇటు తిరుగుతూ లోపలికి ప్రవేశించేమార్గంకోసం ఆలోచిస్తున్నాడు.

* * *

ఆలోచించగా ఒకనాటికి ఆ అవకాశంకూడాచిక్కింది. రాత్రివేళ మారువేషంధరించి బొడ్డులో కత్తిని బిగించుకొని లిలీఉండే మేడదగ్గరకువచ్చి దాగిఉండి రాత్రి పదిగంటలకు మేడకుఆనుకొనిఉన్న ఎలెక్ట్రిక్ స్తంభం ఎక్కి దానిసహా

యంతో మేడలో ప్రవేశించాడు. ఆసమయంలో అతని వేషం ఎవరూ ఆనవాలుపట్టలేనంతగాఉంది. చివరకు మాధురి (మిస్. లిలీ)కూడా గుర్తుపట్టజాలని స్థితిలోఉంది. ఆసమయంలో మాధురి పరుండేప్రయత్నంలోఉంది. ప్రక్క గదిలో దాసీలు ఇద్దరు, ఒక సేవకుడు పడుకొన్నారు. గదికెదురుగాఉన్న ప్రదేశంలో రక్షకుడుగాఉన్న ఘూర్కా కుర్చీలో కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. కుమార్ ఆ అవకాశం తనకనుకూలమనుకొన్నాడు. రెండడుగులు ముందుకు వేశాడు. కాని మనస్సుచలించింది. లిలీనిచంపడానికి మనస్సు వెనకాడింది. అంతలోనే ధైర్యం తెచ్చుకొన్నాడు. లోపలికి బోయి చూశాడు. మంచంమీద లిలీ పరుండిఉంది. దగ్గరకు వెళ్ళిచూడగానే తన్ను గెంటివేసిన దృశ్యం భావగోచరంఅయింది. వెంటనే ఉద్రేకం ఆపుకోలేక బొడ్డులోంచి కత్తిదీసి ఒక్కమారుగా ఆమెమంచంమీదకుచేరి కత్తితో డొక్కలో గురిచూచి పొడిచాడు. మాధురి ఇంకా పూర్తిగా నిద్రపోలేదు. కన్నుమూసుకొని అజాగ్రత్తగా పడుకొంది. ఆకస్మికంగా ఇట్టి ఉపద్రవం వస్తుందని ఆమె అనుకోలేదు. అజాగ్రత్తలోఉంది.

భగవంతుడు సహృదయం, నీతి, ధర్మబుద్ధిగల వ్యక్తులకు సాయపడుతూంటాడు. ఎప్పుడైతే కుమార్ తనమీద పడ్డాడో అప్పుడు వెంటనే కెవ్వుమని ఒక్క కేక పెట్టింది. తాగిఉన్న కుమార్ చేతికత్తి సూటితప్పింది. తొడమీద రెండుమూడుచోట్ల బలమైనగాయమైంది. మాధురిపెట్టిన కేకతో దాసీలు, సేవకులు, ఘూర్కా అందరూలేచి గదిలోకి

వచ్చారు. నెత్తురుప్రవాహంచూచి దొంగదొంగ - ఖూనీ - ఖూనీ - పోలీస్ - పోలీస్ - అని కేకలువేస్తూంటే కుమార్ కంగారుపడి కత్తినిపారవేసి పట్టుకోవచ్చిన ఘూర్ఖాను ఒక్కతోపుతో కిందకుపడేసి పారిపోవాలని ప్రయత్నించాడు. రోడ్డుమీద గస్తీతిరిగే పోలీసులు - ఇరుగుపొరుగు ఇండ్లలో ఉండేవాళ్ళు ఆకేకలతో మాధురుమేడనుచుట్టేసి లోపలికిప్రవేశిస్తున్నారు. కుమార్ పారిపోవడానికి సందు దొరకటంలేదు. తిరిగి మేడమీదికిబోయి తానువచ్చిన దోవనే విద్యుద్దీపపు స్తంభం ఎక్కి కిందికి దిగిపోవాలని ప్రయత్నించాడు. ఆప్రయత్నంలో స్తంభంకింద రోడ్డుమీద ఉన్న ఇద్దరుపోలీసులకు కుమార్ చిక్కిపోయాడు. దాసీలు వెంటనే ఫోన్‌చేసి డాక్టరును పిలిపించారు. మాధురికి బలమైనగాయాలు తగిలాయి. బాధకు తాళలేకుండాఉంది. తొడలమీద చేతులమీద బలమైన కత్తిపోట్లున్నాయి.

పోలీసులు కుమార్‌ని పట్టుకొని బంధించి స్టేషనుకు తీసుకొనివెళ్ళారు. అక్కడ అధికారి కుమార్‌నుచూచి ఆశ్చర్యపడి వేషంతీయమని ఆజ్ఞాపించగా భటులు పైనఉన్న మారువేషంతీయగానే నిజరూపం బైటపడింది. మరునాటి ఉదయం న్యూస్‌పేపరువిలేఖరులు ఫొటోగ్రాఫర్‌లు అంతా వచ్చారు. ఫోటో పేపర్లలో పడింది.

తెల్లవారేసరికి ఫోటోతోసహా ఈవిధంగా ముద్రింపబడిఉంది. "గతరాత్రి పైఫోటోలోవున్నవ్యక్తి సుప్రసిద్ధ సినీమానరకి మిస్. లిలీని హత్యచేయాలని ప్రయత్నించి గాయపరచాడు. అంతలో అందరూవచ్చేసరికి పారిపోతూ

పోలీసులకు పట్టుబడ్డాడు.” అని. బోంబే క్రానికల్ ఆఫీసువారు తమ సహాయసంపాదకుని గురించి ఆశ్చర్యపడ్డారు. మేజిస్ట్రేట్‌కోర్టులో చార్జి ఫైలుచేశారు. సుమారు నెలదినాలకు డాక్టర్లచికిత్సానైపుణ్యంచేత మాధురిగాయాలు మానిపోయాయి” ఆమెను సాక్ష్యంచెప్ప డానికి కోర్టువారు సమనులు జారీచేశారు.

జరిగినసంగతి అంతా గ్రహించినతర్వాత మాధురి ముఖంలో విచారభావం అంతరించింది. ఉదాసీనత రేఖా మాత్రంగా కనపడుతోంది. ఏదో ఆలోచిస్తూ మంచంమీద మేనువాల్చింది.

## 17

కుమార్‌పైన హత్యానేరం మోపబడింది. అందుకు తగిన సాక్ష్యంకూడా సిద్ధంగానేఉంది. మేజస్ట్రేటు విచారణ చేసి కేసును సెషన్సుకు పంపించాడు. పోలీసులంతా కేసును చాలా బలపరుస్తున్నారు. ముద్దాయికి ద్వీపాంతరవాసశిక్ష తప్పదని అందరూ అనుకొంటున్నారు. అతన్నిపట్టి బంధిం చిన పోలీసులు సబ్ ఇన్స్పెక్టరు మొదలగువారంతా తమకు బహుమానాలు వస్తాయనీ, ఉన్నతపదవులు లభిస్తాయనీ భావనచేస్తున్నారు. కుమార్‌ను జైలులోపెట్టి కొన్నినెల లైంది.

సాధ్వీమణియైన భార్యనువెడలగొట్టి, ఉద్ధరించవచ్చిన మాధురిని హత్యచేయ ప్రయత్నించినందుకు ప్రతిఫలంగా కుమార్‌కు జైలులో వేళకు తిండిలేకపోవుట, దెబ్బలు మొద

లగు దురవస్థలు లభించాయి. తడిసిగాని గుడిసెకట్టడన్నట్లు కుమార్ బాబుకిప్పుడు వెనుకటిస్థితిఅంతా జ్ఞప్తికివచ్చింది. చేసిన దుష్కార్యాలు తలంపుకువచ్చాయి. "మూడు వంతులు తప్పుతనదై ఉండ దానినిదిద్దుకోలేక అహంకారంతో మాధురిని హత్యజేయాలనుకొన్నందుకు, అది జరక్కపోగా గురితప్పడం, గాయపడడం, తాను పట్టుబడి జైలులో దెబ్బలు తినడం సంభవించింది. మాధురి తన్ను వెళ్ళగొట్టినందుకు తనకింతకోపం వచ్చింది. నిష్కారణంగా గృహలక్ష్మిని వెళ్ళగొట్టినందుకు ఆమెమనస్సు ఎంతదుఃఖపడిందో, ఎంత క్షోభించిందోగదా!—అన్న సంగతులు కుమార్ మనస్సులో ఒకటొకటిగా తలపుకు వస్తున్నాయి. తనవంటి జమీందారుకు ఇటువంటి అధమస్థితి కల్గడం ఎంత శోచనీయం? ఆనాడు భార్యచెప్పిన మాటవింటే తనకీ దురవస్థపట్టేదికాదు గదా! అని కన్నీరుపెట్టుకొని దుఃఖించాడు. రేపు కోర్టులో మాధురి తనకు వ్యతిరేకంగా సాక్ష్యంచెప్తే తనకు యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షకన్న వేరేగతేముంది?" అన్న సంగతి తలపుకువచ్చినపుడు గుండెలు దడదడకొట్టుకొన్నాయి. "తనకెవరూ రక్షకులులేరు భగవంతుడొకడే గతి. తప్పంతా నాదైఉండగా దైవంమాత్రం ఎట్లా క్షమిస్తాడు? నావంటి అనామకుని కాపాడడానికి ఎవరు పూనుకొంటారు? నాగతి అంతా అదృష్టంమీద ఆధారపడిఉంది, దుఃఖపడితే లాభం లేదు. చేసుకొన్నది అనుభవించవలసిందే." అనుకొని గుండెను రాయిచేసుకొన్నాడు కుమార్. కొన్ని వాయిదాలు

గడిచినాయి. సాక్ష్యులవిచారణ అంతా ముగిసింది. మాధురి సాక్ష్యం ఒకటే తరువాయిగాఉంది.

అది ఆఖరుదినం. మాధురిసాక్ష్యం, జూరర్సు అభిప్రాయం, జడ్జీతీర్పు అన్నీ జరిగిపోతాయి. కోర్టు జనంతో కిటకిటలాడిపోతోంది. న్యాయవాదులు, జూరర్సు, వచ్చి తమతమస్థానాల్ని అలంకరించారు. పోలీసువారు ముద్దాయిని తీసుకొనివచ్చి బోనులోనిలవబెట్టేరు. "మిస్. లిలీ" అంటే బొంబాయిలో అందరికీ గౌరవమే. అట్టి ఉత్తమకళారాధినిని సంహరించదలంచిన దుర్మార్గుని శిక్షను వినడానికి జనం గుంపులుగుంపులుగావచ్చి చూస్తున్నారు. మిస్. లిలీ ఇచ్చే సాక్ష్యాన్ని వినడానికై జనంఅంతా ఎదురుచూస్తున్నారు. సకాలమునకు మిస్. లిలీ కారుదిగి న్యాయస్థానంలోకివచ్చి ఒకబల్లమీద కూర్చుంది. ఎదురుగాఉండే బోనులో కుమార్ నిలువబడిఉండడం లిలీ చూచింది. ప్రేక్షకులలో కొందరు మిస్. లిలీముఖాన్ని, మరికొందరు కుమార్‌ముఖాన్ని, తక్కినవారు న్యాయమూర్తిని చూస్తున్నారు. కేకవేయగానే లిలీవెళ్ళి సాక్షులునిలువబడే స్థానంలో నిల్చుంది. లిలీ పక్షమున పనిచేసే ప్లీడరు ఆమెను అనేకవిధాలుగా బోధించి పంపేడు. ఆమెసాక్ష్యం ఏమిచెప్తుందోఅన్న ఆదుర్దాతో కుమార్ లిలీని మాటిమాటికి చూస్తూండడం ఆమె కనిపెట్టింది. గవర్నమెంటువకీలు ఆమెను అనేకప్రశ్నలు వేశాడు. ఎన్నిప్రశ్నలు వేసినా ఆమె తొణకలేదు. ముద్దాయికి శిక్షతప్పదని అందరికీ నమ్మకంకలిగింది. ద్వీపాంతరవాసశిక్ష నిశ్చయమనే యావన్మందీ ఊహిస్తున్నారు. ఆ

సమయంలో మిస్. లిలీవైపుకు అందరిచూపులు మరలి నాయి. కుమార్ కూడా తలవంచుకొని ఓరగంట లిలీ ముఖాన్ని చూస్తున్నాడు. ఆ చూపులలో దైన్యభావం స్పష్ట మౌతోంది.

ఇంతలో న్యాయాధికారి లిలీనిపిలిచి అడిగేడు.

"ముద్దాయిని చూశావా?"

"చూశాను" అని చెప్పింది లిలీ.

"నిన్ను హత్యచెయ్యాలనే ఉద్దేశ్యంతో కత్తితో పొడిచినవ్యక్తి ఇతడేనా?"

లిలీ కోర్టుఅంతా వినపడేటట్టు స్పష్టంగా చెప్పింది.

"నన్నుపొడిచినవ్యక్తి ఇతడుకాడు. ఇంకొకరు. ఈ వ్యక్తి నన్నుచంపాలని ఎప్పుడూ ప్రయత్నించలేదు."

"బాగా గుర్తించావా? ఆలోచించి చెప్తున్నావా?"

"ముద్దాయిని బాగా నిదానించిచూశాను. త్రికరణ శుద్ధిగా చెప్తున్నాను. నన్ను గాయపరచినవ్యక్తి ఇతడు కాడు."

"ఆసమయంలో నీకు స్పృహఉన్నదా?"

"ఉన్నది. ఆసమయంలో నేను మెలకువగాఉండి చూస్తూనేఉన్నాను. నన్ను గాయపరచిన వ్యక్తి వేరొకరు. ఇతడు నిర్దోషి. నిరపరాధిపైన నేను ఎట్టి అపరాధాన్ని ఆరోపించలేను. ముమ్మాటికి ఇతడు నిర్దోషి."

జడ్జీ నిశ్చలుడై లిలీని చూస్తున్నాడు. జూరర్సు నిర్ఘాంతపోయారు. ప్లీడర్లకు చూడవచ్చిన ప్రేక్షకులకు విప రీతమైన ఆశ్చర్యంకలిగింది. కోర్టులోఉన్నవారందరికి ఒక్క

మారుగా ఆశాభంగమైంది. కుమార్ సంగతి వూహించడం కష్టమే. అతడు లిలీమాటవినగానే కొయ్యబారిపోయ్యాడు. లిలీ ఈవిధంగా సాక్ష్యంచెప్తుందని కలలోగూడా ఊహించలేదు. ఊహాతీతమైనపరిస్థితి సంభవించింది.

లిలీ స్వభావాన్ని, హృదయాన్ని కుమార్ ఇప్పటికైనా అర్థంచేసుకోలేకపోతాడా!!! ఆమె రాక్షసికాదు. దయాస్వరూపిణి. మానవాంగనకాదు. దేవాంగన అని అతని మనస్సుకు తోచకుండాఉంటుందా!! తప్పక తెలుసుకోనేఉంటాడు.

పోలీసువారికందరికీ ఎంతో కష్టంగాఉంది. కుమార్ ద్వీపాంతరావాస నిర్వాసితుడై వారికందరికీ లాభించేది. అనేకవిధాలుగా మాధురి వాళ్ళ ఆశలను వ్యర్థంచేసింది. అందుచేత వారంతా ఆమెమీద పళ్ళుకొరుకుతూ నిప్పులు కురిసే చూపులను కురిపిస్తున్నారు. కాని లాభం ఏముంది?

లిలీ "నేను చూశాను. నన్నుపొడిచినవాడు వీడు కాడు ఇంకొకడు." అని స్పష్టంగా చెప్తూంటే జూరర్సు కుమార్ని దోషిగా ఎలా నిర్ధారణచేస్తారు? ఆఖరికి అందరూ ఆలోచించి "ముద్దాయి నిర్దోషి" అని తమ నిర్ణయాన్ని జడ్జీగారికి అందజేశారు. జడ్జీ వెంటనే కేసు కొట్టివేశాడు. పోలీసువారిముఖాలు వాడిపోయినాయి. చూడవచ్చిన వారంతా తమతమ భావాలను వెల్లడించుకొంటూ ఒకవిధమైన నిరుత్సాహంతో వెళ్ళిపోయారు.

కుమార్ను విడుదలచేసి బయటికి పంపించారు. కాని అతనికి ముందుకువెళ్ళాలంటే అడుగులుపడడంలేదు. మాధురి

కారుదగ్గరకువెళ్ళి ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ నిల్చుంది. జనంఅంతా ఎక్కడివారక్కడనే సర్దుకొన్నారు. కుమార్ హృదయం పశ్చాత్తాపంతో కుమిలిపోతోంది. తలఎత్తి మాధురిని చూడలేకపోతున్నాడు. పదినిముషములు గడచిన తర్వాత కుమార్ ఇహ నిలువలేక గబగబావెళ్ళి ఒక్కసారిగ మాధురి రెండుకాళ్ళమీదపడి కన్నీరుకార్చడం ప్రారంభించాడు. మాధురి వెంటనే కుమార్‌నిలేవదీసి కారులోకూర్చొపెట్టుకొంది. కారు గమ్యస్థానానికి పరుగెత్తుకొనిపోతోంది.

* * *

కుమారబాబును వెంటబెట్టుకొని మాధురి తన పూజామందిరం ప్రవేశించి దేవునకు పూజజేసి భక్తితో హారతిచ్చింది. ఆమె ఆనందానికి మితిలేదు. ఆమెచేసిన తపస్సు ఫలించింది. కనుకనే భగవంతుడామెకోర్కెలను రెండింటినీ నెఱవేర్చాడు. కుమార్ మాధురితో తలెత్తి మాట్లాడలేక సిగ్గుతో మగ్గిపోతున్నాడు. అయినప్పటికీ తత్త్వంతెలుసుకొన్న మాధురి ఊరడిస్తూ వినోదప్రసంగాలతో అతని మనోవ్యాకులాన్ని పోగొట్టింది. నాలుగుదినాలు విశ్రాంతితీసుకొన్నతర్వాత మాధురి కుమారబాబును వెంటబెట్టుకొని వసంతపురంవెళ్ళింది. కుమార్ భార్యముఖం చూడలేక రానని ఎంతపట్టుదలచేసినా మాధురి వినక బలవంతంమీద తీసుకువచ్చింది. రాజభవనంముందు కారు ఆగింది. కుమార్‌తోసహా మాధురి సుషమాదేవిగదిలోకి వెళ్ళింది. రాణి సుషమాదేవియొక్క ఆనందం మిన్ను ముట్టింది. ఒక్కఉదుకులో వెళ్లి కుమార్ రెండు

పాదములమీదబడి కన్నీరు విడిచింది. మాధవబాబు ఆనంద పారవశ్యంలో మునిగిపోయి ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. రాజభవనంఅంతా సంతోషంతో కలకలలాడుతోంది. జమీందారురాకతో వసంతపురమంతా పండుగదినంగా భావించి ఉత్సవాలుజరిపేరు. సుషమ మాధురిని కౌగలించు కొని "ఎన్నిజన్మాలకూ నీ ఋణం తీర్చుకోలేను." అంటూ కన్నీరువిడిచింది. ఎస్టేటు ప్రతిగ్రామంలోనూ ఉత్సవాలు జరిగినాయి.

సుషమాదేవి మాధురిని, భర్తను ఎదురుగా ఉంచు కొని జరిగినవిషయమంతా తెలియజేసి మాధురిచేసిన త్యాగాన్ని వెల్లడించింది. కుమార్ మాధురిని దగ్గరగా తీసుకొని "మాధురీ! నువ్వు మధురమూర్తివి. నీలోఉండే మాధుర్యం సత్యమైనదిగాని క్షణికంకాదు. నీ తత్వాన్ని గ్రహించలేక అపార్థంచేసుకొన్నందుకు నేను నిజంగా శిక్షార్హుణి. నాకొఅక్కై ఇంతత్యాగంచేసి నాప్రాణాలను రక్షిస్తావని నేను ఎన్నడూ అనుకోలేదు." అన్నాడు.

"నీఊహ పొరపాటు, కుమార్! నేను నీకోసం త్యాగం చెయ్యలేదు" అన్నది మాధురి.

"ఎవరికోసం చేశావు?" ప్రశ్నించాడు కుమార్.

"ఇంకా ఎవరికోసం! సోదరి సుషమాదేవియొక్క గౌరవం, అభిమానం రక్షించడంకోసం చేశాను. తెలిసిందా?" అన్నది మాధురి.

"నాకంటె సుషమయే నీకు ఎక్కువ ప్రేమాస్పదురాలైందా?"

"నిస్సందేహంగా నువ్వు ఆమెను తిరస్కరించి నిష్ఠా రణంగా శిక్షించావు. ఆడుదాని అవస్థ ఆడుదానికే తెలియాలి గాని పురుషులకేమి తెలుస్తుంది? అందుకే నేనిట్లా చేశాను. ఇప్పుడైనా సరిగా ఉంటావా?"

"మాధురీ! నీచేతులుపట్టుకొని బతిమాలుకొంటాను. ఆ ప్రసంగం ఆపు. నేను వినలేను." అన్నది సుషమ.

"సోదరీ! నువ్వు అడ్డురావద్దు. నన్ను అడిగినప్రశ్నకు దొరగారేమి సమాధానంచెప్తారో వినాలి." అన్నది మాధురి.

"అయితే నేను వెళ్ళిపోతాను." అన్నది సుషమ.

"వీలులేదు. నువ్వుఉండాలి, నీ ఎదుటనే కుమార్ నామాటకు సమాధానం చెప్పాలి." అంది మాధురి కఠినంగా.

"నన్ను సర్వవిధములా లొంగదీశావు మాధురీ! ఇంకా ఎందుకు సిగ్గుపరుస్తావు? ఈ జీవితంలో నిన్ను మరచిపోవడం అసంభవం." అన్నాడు కుమార్.

"నీమాట సరిగా అర్థంకాలేదు. స్పష్టంగా చెప్పు. ఎందుచేత మరిచిపోలేవు?"

"నువ్వు మానవాంగనవుకావు. దేవాంగనవు." అన్నాడు కుమార్.

"చాలించు. ఇకమీద ఎప్పుడూ అట్లా అనవద్దు. 'నాప్రియమైన సేవికగా భావించాను. అందుచేత మరువలేను.' అని చెప్పు. అట్లా అనలేవా?" అన్నది మాధురి.

"మాధురీ! ఆవిధంగా నిన్ను ఊహిస్తే ఈశ్వరుని

దృష్టిలోనే అపరాధినౌతాను. నాజీవితాన్ని సర్వవిధముల రక్షించి దరిచేర్చిన దేవమూర్తిని సేవికగా భావించగలనా? అదిగాక నేను సర్వవిధముల అస్వతంత్రుణ్ణి.. ఇదివరలో నేను స్వతంత్రుణ్ణి అనే గర్వంతో ఉండేవాణ్ణి. అట్టి నన్ను బంధించావు. స్త్రీధనంతో జీవించవలసిన స్థితిలోకి తెచ్చావు. ఇంతకన్న నాకు శిక్ష ఏముంది?" కుమార్.

అని అంటూ సిగ్గుతో తలవంచుకొన్నాడు.

"కుమార్! నేనీవిధంగా చెయ్యక జమీందారి అంతా నీపేరనే వ్రాయించినట్లైతే నువ్వు వెనుకటివలెనే సోదరిసుషమాదేవిని వెళ్ళగొట్టినావంటి వేశ్యాంగన కెవతికైనా ఈ ఐశ్వర్యమంతా కట్టబెట్టి దుర్గతికి పాల్పడవచ్చును. తాగుడు, జూదం, వేశ్య, ఈ మూటికి మానవుడు అలవాటు పడకూడదు. పడ్డాడా ఆ వ్యామోహంలోంచి తప్పుకోడం చాలాకష్టం. మళ్ళా అట్లాగే సంచరిస్తావేమో...ఈభాగ్యం అంతాచూచి ఏ దుష్టసమూహమో చుట్టుజేరి నిన్ను అధోగతిపాలుచేస్తుందేమో...అన్న భయంతో సోదరి సుషమాదేవిపేర ఎస్టేటువ్రాయించాను. అది కాకపోయినా, ఇది నాడబ్బేమీకాదు. నీ ద్రవ్యమే. నువ్వు నాకోసారి వ్యయపరచిన ధనమును తిరిగి నీకోసమే నేను ఉపయోగించాను. ఆస్తి ఎవరిపేరఉన్నా ధనము నీదేకాని ఎవరిదీ కాదు. అందుచేత నీ కా సంశయమక్కరలేదు." అని అన్నది మాధురి.

సుషమ లేచి కుమార్ కాళ్ళదగ్గర మోకరించి "స్వామీ! నాకు ధనమక్కరలేదు. భోగభాగ్యాలక్కర లేదు. మీరే కావాలి. ఇదంతా మీకే సమర్పణచేస్తున్నాను. మీ తాతముత్తాతలనాటి జమీందారి భగ్నమై పోవడం చూడలేక దుఃఖపడ్డాను. సోదరి మాధురి దైవం పంపిన దూతవలె వచ్చి అడ్డుపడి అన్యాక్రాంతం గాకుండా నిలువబెట్టింది. దీనిని సర్వదా రక్షించుకొంటానని మీ తండ్రిగారిపేరున శపథంచెయ్యండి. నేను విని ఆనందిస్తాను." అన్నది సుషమ ప్రాధేయపూర్వకంగా.

"సుషమా! నామాట నమ్ము. పెడమార్గంలో పడ్డందుకు తగినశిక్ష లభించింది. జైలులోపడ్డ బాధలతో అవన్నీ అంతరించిపోయినాయి. కుమార్ మరోజన్మఎత్తేడు. నీకు ఆ భయమక్కరలేదు. మాధురిఇష్టప్రకారం ఎస్టేటు నీపేరనే ఉండనీ" అన్నాడు కుమార్.

మాధురి లేచి కుమార్‌పాదములకు సుషమపాదములకు వందనంచేసి "ఇప్పటికి నాతపస్సు ఫలించింది. నా కోర్కె నెఱవేరింది. సోదరి సుషమయొక్క సౌభాగ్యాన్ని అపహరించినదోషానికి తగినప్రాయశ్చిత్తం చేసుకొన్నాను. ఈశ్వరానుగ్రహంవల్ల సోదరికి భర్తఅనుగ్రహంజమీందారీ లభించడం అన్నీ జరిగాయి. రెండుమాటలు నా స్వవిషయం చెప్తున్నాను.

నా తల్లిదండ్రులు ఎవరో నాకు తెలియదు. దారిద్ర్య త నా పెంపుడుతల్లికి నన్ను అమ్ముకొన్నారని ను. ఆమె నన్ను పెంచి సంగీతం, నాట్యం, సాహిత్యం దమైనవిద్యల జెప్పించి నన్నొక వారాంగనగా తయారు సి వేశ్యావృత్తిలోకి నన్నుదింపాలని చూచింది. అదేమి కారణమో చిన్నప్పటినుండి నా కావృత్తిమీద చాలా అసహ్యంగాఉండేది. నాకు యౌవనదశరాగానే అనేకమంది టీశ్వరులు నాకోసం ప్రయత్నించారు. నేను వారికి అంద ండా తప్పించుకొన్నాను. దైవయోగంవల్ల కుమార్ బాబుతో ప్రథమసందర్శనం అయింది. దైవసంకల్పబలం చేతనే నేను వారికి వశపడ్డాను. ఈనాటివరకూ త్రికరణ శుద్ధిగా ఆయననుగాక వేరొకవ్యక్తికి మనస్సులోకూడా తావియ్యలేదు. ఇకమీద ఇయ్యదలచుకోలేదు. స్త్రీకి ఒకడే భర్త. నా పూర్వజన్మ పాపఫలితంగా నాకు వివాహ యోగ్యతలేకుండా పోయింది. అయినప్పటికీ కుమార్ బాబును నాభర్తగానే భావించి సర్వవిధములా ప్రేమించి నావారినిగా చేసుకొన్నాను. ఆనందించాను. ఇంతలో సుషమాదేవి వ్రాసిన జాబు, మామాజీ వ్రాసిన జాబులు నామనస్సు కద లించాయి. నేనుచేసిన తప్పును తెలుసుకొన్నాను. నాకళ్ళు తెరువబడ్డాయి. వెంటనే కుమార్ బాబును నాదగ్గిరనుండి పంపించాలనుకొన్నాను. మనస్సులో ఇష్టంలేకపోయినా ఎంతో విచారంగాఉన్నా, సోదరిని సుఖపెట్టడం కర్తవ్య

మనుకొన్నాను. బలవంతాన కుమార్ బాబును ప‌ దీనివలన ఆయన దుఃఖపడతాడని, మనస్సు చెదరిపొ నాకు తెలుసు. కాని కర్తవ్యభారం నాచేత అట్లాచే చింది. కుమార్ సోదరిని కలుసుకొంటాడని ఊహించా కాని నాఊహ వేరొకలాఅయింది. ఏమైతేనేం? చివర దైవానుగ్రహంవల్ల అన్నీ సవ్యంగానే జరిగాయి. ఈ జీవి తానికి నాకు కుమార్ బాబే ప్రియుడు, భర్త. ఆతని ప్రతి బింబంచూసుకుంటూ శేషకాలం భగవధ్యానంలో గడుః తాను. ఈ నాట్యవ్యాపారం, సినీమాలలో అభినయం అన్ని టికీ స్వస్తిచెప్పేశాను. మీ దంపతులిద్దరూ నాతప్పలేమైనా ఉంటే క్షమించండి. ఇక నేను వెళ్ళిపోతున్నాను. సెలవు దయచెయ్యండి" అంటూ వినమ్రురాలైంది.

మాధురి లేచి వెళ్ళడానికి వెనక్కితిరిగింది. మాధవ బాబు ఎదురై మాధురిని ఆగమన్నాడు. సుషమలేచి మాధు రిని కౌగలించుకొని కన్నీరువిడుస్తూ, "మాధురీ! నేను సర్వ విధములా నీకు ఋణపడిఉన్నాను. భగవంతుడు నీకు కలుగ జేసిన భాగ్యమంతా నాకోసం ధారపోశావు. అయినా నిన్ను ఇంకొక్కటి కోరుతాను. నాకోర్కె చెల్లిస్తానని మాట ఇయ్యాలి" అన్నది.

"ఒకటికాదు. చేతనైతే నీవు కోరినవన్నీ ఇస్తాను" అని అన్నది మాధురి.

"నిన్ను నేను వదలిపెట్టలేను - నన్నువిడిచి నువ్వు వెళ్ళిపోతే నేను చాలా దుఃఖపడతాను. నువ్వు ఎక్కడికీ వెళ్ళకుండా నాదగ్గరనే ఉండాలి" అన్నది సుషమ.

మాధవబాబు వెంటనే అన్నాడు :

"మాధురీ! ఈ ఎస్టేటుఅంతా నీదే. ఇదంతా నువ్వు చేసిన మహాత్యాగానికి ఫలం. ఇందులో పరులెవ్వరు? లోక దృష్టితో నేను వేశ్యనని నువ్వు అనుకొన్నా మాదృష్టిలో నువ్వొక జీవరత్నంగా కనపడుతున్నావు. కుమార్ నీభర్త అయినప్పుడు సుషమ నీసోదరి. నీజీవితకాలమంతా ఇక్కడనే ఉండి ఆ దంపతులనిద్దరినీ రెండుకళ్ళవలె చూచుకొంటూ సుఖజీవితం గడుపు. కావాలంటే ఒక మందిరం కట్టిస్తాము. దానిలో భగవానుని ప్రతిష్ఠించి భక్తితో నృత్యగానాదులతో స్వామినికీర్తించి నీ జన్మను సార్థకంచేసుకొని పరమేశ్వరానుగ్రహాన్ని ఆర్జించు. ఇదంతా నువ్వుపెట్టిన భిక్ష. నీకు సర్వాధికారముంది. నువ్వు ఎక్కడికీ వెళ్ళవద్దు."

"మాధురీ! నా అభిప్రాయంకూడా ఇదే. నీతో నేను ముందే చెప్పాలనుకొన్నానుగాని సుషమ అన్యథాభావిస్తుందేమో అనుకొని ఊరుకొన్నాను. సుషమ నాపాలిటి యశోలక్ష్మి. నువ్వు విజయలక్ష్మివి. నీప్రేమ పవిత్రమైనది. మీ రిద్దరూ నా సమీపంలోనేఉంటే నాజీవితం సరియైనమార్గంలో నడుస్తుంది" అన్నాడు కుమార్.

"మీ అందరిఅభిప్రాయాలు ఒకటైతే నేనుమాత్రం భిన్నంగా ఎందుకు నడుస్తాను? నన్ను మీకుటుంబంలో ఒక దానినిగా భావిస్తే ఉండడానికి నాకు ఎట్టిఅభ్యంతరమూ లేదు" అని అన్నది మాధురి.

"శుభమస్తు. మాధురీ! మంగళవాద్యాలు మోగు తున్నాయి. సేవాశ్రమానికి శంఖుస్థాపనజరిపే సమయం సమీపించింది. ఆ కార్యభారం అంతా నువ్వే వహించాలి" అని అన్నాడు మాధవబాబు.

"బ్రహ్మానందం. ధన్యురాలను" అన్నది మాధురి పవిత్రహృదయంతో.

అందరు లేచి శంఖుస్థాపనకు బయలుదేరి వెళ్ళారు.

—: స మా ప్త ము :—

